నృత్య, శిల్ప వాస్తుశాస్త్రముల ఆధారములలో 21 సం
పరిశోధించి రచించిన

# రామప్ప దేవాలయ
# శిల్పకళా రహస్యములు


రచన :

కీ॥ శే॥ చనుమల్ల రాజభద్రయ్యా విశ్వ
శిల్ప, చిత్రకారుడు

Ramappa Devalayamu
Shilpakala Rahasyamulu

Author & Artist

Ch. Raja Bhadraiah Vishwakarma

1986

**Rs. 20-00**



Ch. Kaladhar,
H. No. 9-1-19, Girmajipet,
WARANGAL-506 002

Dhanalaxmi Printing Press, WARANGAL,

For Copies

CH. KALADHAR

Girmajipet, WARANGAL-506002

# విషయసూచిక

# ఆధార గ్రంథాలు

1 ఆగమ శిల్ప శాస్త్ర పరిచయము
2 విజ్ఞాన–విశేషాలు
3 రామప్ప
4 రామప్ప గుడి
5 కాకతీయులు
6 శ్రీచక్ర విలసనము
7 రంగులు విజ్ఞానం
8 ఆర్ష విజ్ఞాన సర్వస్వం
9 భారతీయ తత్వ శాస్త్రము
10 వస్తుగుణ ప్రదీపిక
11 కామశిల్పం
12 భారతీయ మహాశిల్పం
13 తెలుగునాడు నృత్యకళ
14 వాత్స్యాయన కామసూత్రాలు
15 మానసిక శక్తులు
16 ఆవాహన
17 Ramappa and Other Temples of Palampet
18 దేవాలయములపై బూతుబొమ్మలెందుకు
19 యోగాసనాలు
20 స్థలపురాణం స్థానికప్రజల వివరణ
21 వింత అగ్నిగోళము

# కృతజ్ఞతలు

రామప్ప దేవాలయం శిల్పకళా రహస్యములు గ్రంథ ముద్రణకు ఆర్థికముగా సహాయముచేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారికి మా కృతజ్ఞతలు.

శ్రీ టి. హయగ్రీవాచారిగారు ది. 30–3–80న రామప్ప దేవాలయము శిల్పకళా రహస్యములు లిఖిత గ్రంథాన్ని ఆవిష్కరించి **1116/–** నగదు ఇచ్చి ఆర్థికముగా సహాయముచేసినవారికి మా కృతజ్ఞతలు.

కళాహృదయులు, కళాకారులు, పురప్రముఖులు, మిత్రులు, ఈ గ్రంథముద్రణను ఆర్థిక సహాయ సహకారములు అందించిన అందరికి స్థలాభావంవల్ల పేర్లు ప్రకటించలేకపోతున్నాము వారి సహాయసహకారములకు మా కృతజ్ఞతలు.

—ప్రకాశకులు.



# గ్రంథ రచయిత పరిచయము

కీ శే॥ చనుపల్లి రాజభద్రయ్య విశ్వకర్మగారి జన్మస్థలం వరంగల్లు జననం 30-10-1934 తల్లి తండ్రులు బ్రహ్మయ్య, వెంకటమ్మగార్లు వీరు స్థానిక హనుమకొండ కొత్తూర్ ఉన్నత పాఠశాలలో చిత్రకళోపాధ్యాయు లుగాపనిచేస్తు ది. 1-4-1980న స్వర్గస్థులైనారు.

సరస సంగీత సాహిత్యములకు జోడు సరస్వతీమూర్తి పాలిండ్ల పాలసముద్రంలో ఏతామునెత్తిన పోతన్నవంటి మహాకవుల జన్మస్థలి కూడలిగా కాకతీయ సామ్రాజ్య పరిపాలనా సర్వం సహా సామ్రాజ్ఞి రాణీరుద్రమాదేవి కోటలో ప్రప్రథమంగా రామప్ప దేవాలయం శిల్పకళారహస్యం అను గ్రంథం ఆవిష్కరించబడుట మహాద్భాగ్యంగా భావిస్తున్నాము.

సశాస్త్రీయ సాంప్రదాయాల నాకళింపుజేసుకొని జాతి చైతన్యమునకు హిందూ సంస్కృతికి సాంప్రదాయానికి విరిగిన మెట్లను జతపరచుటలో వీరి కృషి గంగాఝరియై ప్రవహిస్తున్నది

1956 శ్రీ తిరుమల తిరుపతి వెంకటేశ్వర శిల్పకళాశాల శిల్పాచా ర్యులు శ్రీ దేవషణ్ముఖనాథస్థపతిగారికి అలంబనగానిలచి శ్రీ అకారపు నరసిం

గం గారి కాశీవిశ్వేశ్వరాలయంలో శ్రీ భద్రకాళి, వీరభద్రుడు, లక్ష్మీనర్సింహ స్వామి విగ్రహములను తీర్చిదిద్ది అప్పుడే శహబాష్ అనిపించుకున్నారు.

వీరి పూర్వీకులు కాకతీయుల కాలములో దేవాలయ నిర్మాణములందును కోటల నిర్మాణమునందును ఆభరణ విశేషములు తయారు చేయుటయందును మొనలేని కృషిసల్పిరి.

అఖండ శేముషీ దురంధరులైన పండిత ప్రకాండులకు శాస్త్రజ్ఞులకు ఏ పరమార్థ రహస్యములు మిగిలిపోయెనో వీరి ప్రజ్ఞాపాటవముచే పరిశోధించి అనేక వేల సంవత్సరముల క్రితం లోకహితార్థము ప్రవేశపెట్టబడిన సౌరశక్తి విశ్వశ్రేయస్సుకు దోహదంచేసిన అద్భుత విషయాలను వెలికితెచ్చారు.

భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిచే ప్రవేశపెట్టబడిన 20ఆర్థిక సూత్రములను పుణ్యక్షేత్రములను చారిత్రిక ఔన్నత్యములను జోడించిన అక్షర రూపచిత్రం అఖిలభారత కీర్తిచార్జించి వీరి కళాప్రతిభను ఇనుమడింపజేసింది.

శ్రీ వెంకటేశ్వరుని సుప్రభాత శ్లోకములతో మంగళాశాసనములతో భావయుక్తంగా కూర్చి భక్తజనకోటి హృదయాలలో చెరగని ముద్రవేసినారు.

తరతరాలుగా కాకతీయ పౌరులు కలలుగన్న కాకతీయ విశ్వ విద్యాలయ అధికార ముద్రికను సశాస్త్రీయముగా రూపకల్పనగావించి, కాకతీయ విశ్వ విద్యాలయస్థాయికి, ఔన్నత్యమునకు తగిన కళాకారునిగా ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమీ సభ్యునిగా ఎన్నిక చేయబడినారు.

సినిమాలపేర్లతో డా॥ అక్కినేని నాగేశ్వరరావు, డా॥ ఎన్.టి.రామారావుగార్లకు అక్షరరూప చిత్రమువేసి సినిమా ప్రముఖులచే అభిమానులచే ఓహో యనిపించుకున్నారు.

పండిత ప్రకాండులు సైద్ధాంతిక విమర్శకులు మహోపధ్యాయులు సంస్కృత సాహిత్యవిలువలను సంతరించుకున్న స్థాయిలో ఈ కాకతీయగడ్డపై అనువంశిక శిల్పచిత్ర కళాకారుడుగా వీరి కళాప్రతిభ ఆవిర్భవించుట గర్వకారణము.




శ్రీ రాజభద్రయ్య విశ్వకర్మగారి కళానిపుణతకు నా జోహర్లు.

—దాశరథి

20 ఆర్థిక సూత్రములను కంఠహారంగా మలచి రూపొందించిన శ్రీమతి ఇందిరాగాంధి చిత్రం మీ సునిశిత ప్రజ్ఞకు శతపత్రం.

—సి. నారాయణరెడ్డి

కళాకారులు శ్రీ రాజభద్రయ్య విశ్వకర్మగారు ఈ రచనలో తమ ప్రతిభను చక్కగా ఆవిష్కృతంచేశారు. ఈ గ్రంధంభారతీయభాషలలోనే గాక విదేశీభాషలలో కూడా రావాలని మీ కృషి జయప్రదం కావాలని నా ఆకాంక్ష.

—డా॥ యం. పార్థసారథి

I have great admiration for the art implied their in I hope you will contribute towards it and I hopy you all the success.

—A. Nageshwar Rao, Cine Artiste.

శ్రీ రాజభద్రయ్య విశ్వకర్మగారి చిత్ర రచన పరిపక్వ శిల్ప పరిజ్ఞానాన్ని ప్రస్ఫుటం చేస్తుందని వేరే చెప్పనక్కరలేదు.

—ఇంటూరి వెంకటేశ్వరరావు సినిమా

శిల్ప సాంప్రదాయ సంబంధములు యౌగిక సంబంధములు అనేక విషయములలో మీరు చేయుచున్న ఆలోచనా ధోరణి నన్ను ముగ్ధుణ్ణిగావించినది.

—యెఱ్ఱాజు మాధవాచార్యులు, సభాపతి.

దేవాలయ విశేషాల్ని తెలిపేవారుకావాలి. వీరి మాటలు గ్రంథరూప ములోనికి రావాలి. ఈ గ్రంథం అన్ని దేవాలయముల దగ్గర దొరకాలి. అలా చేస్తేనే భావితరాలవారికి దేవాలయములగురించి తెలిసేది. ఈ తోవలో శ్రీ రాజభద్రయ్య విశ్వకర్మగారు ముందడుగువేశారు.

—పెదపాటి నాగేశ్వరరావు యం.ఏ. స్థాపత్య వేదాచార్య సాహిత్యవిశారద.

వీరి ప్రస్తుత రామప్ప దేవాలయము అను శిల్ప కళాఖండములను గురించిన సమీక్ష ఇదొక భారతీయ అనల్పకళా భావ రహస్యముల నుగ్గడించెడి పరిశోధనాత్మక ఉత్తమోత్తమ రచన.

—వానమామలై జగన్నాథాచార్యులు (చైతు రామాయణకర్త)

హిందూధర్మ అస్థిత్యానికి సుస్థిరమైన గ్రంథం ఈ రామప్ప దేవాలయం శిల్పకళా రహస్యం.

—చిలకమర్తి శ్రీనివాసాచార్యులు, పా. చరిత్ర ఆగమ విద్వాంసులు

రామప్ప దేవాలయం శిల్పకళా రహస్యములు అను ఒక గొప్ప గ్రంథాన్ని రచించడం ఎంతో శ్రమతోకూడినపని శ్రీ రాజభద్రయ్యగారు దాదాపు 21 సంవత్సరాలుగా పరిశోధించిరచించినారు వారిప్రతిభ వరంగల్లు వాస్తవ్యులకు ఎంతోగర్వకారణము. —టి. హయగ్రీవాచారి



# కాకతీయ శాసన స్థూపము

రామప్ప దేవాలయమునకు ఎడమవైపు తూర్పుముఖంగా ఈ శాసన స్థంభముగలదు. దీనిపై మంటపముగలదు ఈ శాసనముపై ప్రాకృతబాషలో తెలుగు కన్నడ మిశ్రమరూపములో శాసనముపై లిఖించబడియున్నది ఈ శాసనములో ఈ ఆలయము రుద్రేశ్వరాలయముగాను దీనిని గణపతి దేవచక్రవర్తి నిర్మింపజేసినట్లుగలదు. గణపతిదేవునియొక్క పరిపాలనా దక్షతను వీరి విజయములను గూర్చిన అనేకవిషయములు లిఖించబడియున్నవి.

ఈ శాసన స్థూపముపై సూర్యచంద్ర బింబములు ప్రముఖముగా శిల్పించబడినవి. సూర్యుడు-చంద్రుడు మనకు ప్రత్యక్షదేవతలు. ఇవి కాకతీయ అను పదమునకు మూలరూపములు సూర్యచంద్రులను ప్రత్యక్షముగా పూజించిన వచ్చుఫలితము కాకతీయ అని ఉచ్చరించునప్పుడుకూడ కలుగు శబ్ద ప్రణముగలదు. కాకతీయ అనుపదమును ఉచ్చరించునప్పుడు తగునిష్పత్తిలో సూర్యునియొక్క చంద్రునియొక్క శక్తిని శబ్దరూపమున కర్ణేంద్రియముల ద్వారా శరీరములో లోపించిన ధాతుశక్తినిపూరించి మేధాశక్తిని వీర్యశక్తిని పెంపొందించి పూర్ణజీవితమును గడుపుటకు ఆయురారోగ్యములను ప్రసాదించును. కాకతీయులు అనగా చిరంజీవులు, వీరులు, ధైర్యసాహసులు గలవారనికూడాగలదు. శైవమతములో చంద్రుని ప్రాముఖ్యత అధికముగానున్నట్లు ఈ శాసన శిల్పములనుబట్టి తెలియుచున్నది. కాకతీయులు శైవములో కొంత మార్పుజేసి ఈ చంద్రశక్తిని అధికంచేయుచు వీరశైవముగా వరి మతమును ఏర్పాటుచేసిరి. కాకతీయ పదమునకు "రామా" అను పదమునకు ఏకత్వమున్నట్లు తెలియుచున్నది. 'ర'కారము సూర్యబీజము 'మ'కారము చంద్రబీజము రామా అను పదమును ఉచ్చరించునప్పుడు ఉత్పత్తియగు శబ్ద తరంగాలు సూర్యునియొక్కయు చంద్రునియొక్కయు శక్తిని వాతావరణమునుండి విడదీసి కర్ణేంద్రియములద్వారా శరీరమునకు శరీర ధాతువులకు సంక్రమింపజేసి భయంకరమైన గుండెరోగములనురాకుండా శరీరంలోని విషమును హరింపజేసి పూర్ణజీవితమును ప్రసాదింపజేయు మహత్తరశక్తి రామనామములోగలదనుటకు కొన్ని ప్రామాణికాధారములుగలవు.

ఆంజనేయుడు రామనామమును క్రమంతప్పక జపించుటవలన రామ అను పదముచే ఉత్పత్తియైన శబ్దతరంగాలు వర్ణకక్షలోని సౌరశక్తిని గుండె భాగమునకు సంక్రమింపజేసి దేహబలంతోపాటు మానసికశక్తిని పెంపొందింప జేసుకొని పూర్ణజీవితము గడిపెను.

ఆంజనేయుడు తన ఛాతీభాగమును చీల్చి గుండెలో రామశబ్దము యొక్క రామనామమును ప్రదర్శించు ప్రతిభ సూర్యచంద్రుల సమ్మేళనమైన రామ పదములోగలదనియే దీనిభావము. తమిళనాడులో, కర్ణాటకములోను ఎరుపురంగు తిలకముతోపాటు దీనికి క్రిందిభాగమున చంద్రవంకను లేపనము చేయుట మనము గమనిస్తాము. కాకతీయ రాజ్యపతనానంతరము తురుష్కుల మతప్రభావమువలన తెలంగాణాలో ఈ చంద్రవంక లేపనముచేయుట మాని వేయబడినది. ఒక్క ఎరుపురంగు బొట్టుమాత్రమే మిగిలియున్నది.



వైష్ణవాచారములోని పట్టెనామములో మధ్యగల జ్యోతిరూపము శ్రీ చందములో తెల్లని పట్టెనామాల ఆకారము సూర్యచంద్రుల ఆకారమునకు మాయరూపములుగావెలసినవి వీటినే శంఖుచక్ర ఆకారమునకు మాయరూపములు వెలసినవి. వీటినే శంఖచక్రాలుగా వైష్ణవములో మనము చూడగలము. ఈ

శైవవైష్ణవులకు పూర్వము ఒకే ఒక గుండ్రనితిలకము పురుషుల స్త్రీలనుదుట తిలకరూపములో మన ఆచారమందునుండెడిది.

లలితయు రాముడు బ్రహ్మవిద్యయు పార్వతియు ఒక్కటేయనియు అది శ్రీచక్రమందున్నదనియు శ్రీ శంకరుల వచనము. ప్రత్యేక చంద్రకళా కిరణములు 360. 360 దినములవలన సంవత్సరమేర్పడుచున్నది సంవత్సరము ప్రజాపతిరూపము. ప్రజాపతి జగత్కర్త కాబట్టి మరీచులు ప్రపంచ సృష్టి స్థితి లయకారులగుచున్నవి. అనంతకోటి బ్రహ్మాండములోగల పిండాండములందును బ్రహ్మాండములందును 360చొప్పున అనంతముగానున్నవి. శ్రీదేవి చరణారవిందములైన 'మరీచులు' సూర్యచంద్రాగ్నులతోగలసి భిన్నభిన్న లోకములను సృష్టిస్తు ప్రకాశింపజేయుచున్నవి. మరీచులనగా సూర్యుని కిరణములు చంద్రునిపైబడి తిరిగి ఆ కిరణములు సూర్యునిలోనికి పరావర్తనమునొంది సూర్యునిలోని ప్రత్యేక అణుకిరణములతో సంయోగమునొంది శక్తివంతములై తిరిగి భూమిపై ప్రసరించు కిరణములను మరీచులనిపేరు. శివశక్తిని చంద్రకిరణశక్తిని పరిశోధించిన మహాఋషి శంకరుడు. ఆ తత్వమునకు గుర్తుగా శంకరుని శిరస్సుపైగల చంద్రవంక చంద్రుని ప్రాముఖ్యమునుతెలుపు అర్థమును సూచించుచున్నది. ఆ కిరణముల ప్రభావమును సంతరించుకొనుటకే సోమవారంనాడు శివునికి పూజలు జరుపుట ఆచారమైనది.

ఈ మరీచులు శ్రీదేవి చరణారవింద జనితములని తైత్తరీయ బ్రాహ్మణములందున్న "లోకస్యద్వార మర్చిమత్పవిత్రమ్" అనిశృతి పాఠము చెప్పుచున్నది. ''మరీచయస్స్వాయంభువాః'' అని శృతి పాఠించుచున్నది కాబట్టి భగవతి చరణారవింద జనితములైన అనంతకోటి కిరణములలో కొన్నిటిని తీసుకొని సూర్యచంద్రాగ్నులు 'శ్రీదేవి' 'భారతి' 'కాకతి' ప్రాసారితమైన జగత్ప్రకాశన సామర్థ్యంలో జగముల ప్రకాశింపజేయుచున్నారు. చంద్రకళా చక్రమైన బిందుస్థానము సర్వలోకాతిక్రాంతమైనది. భైరవ యామళవలన చంద్రవిద్య మహోత్సవదీపిషయములను పార్వతికి చెప్పినట్లుగలదు. ప్రతి నాణాలపై ప్రత్యక్షముగోచరించు ఈ సూర్యచంద్ర శిల్పసాంప్రదాయమును బట్టి కాకతీయ శాస్త్ర పరిశోధకులు ఈ రెండు గ్రహములు అనగా సూర్యుడు,

సూర్యుడుకాకను అనగా వేడిమినిచ్చువాడు అను అర్థము ఆ పదములోనేకలదు దానికితోడుగా చంద్రశక్తి చంద్రుడు అమృతకరుడు అందుచేత రెంటినిజోడిం రూపకల్పన చేయబడినది, ఆ రూపకల్పన స్వరూపమే కాకతిదేవత ఆ కాక పేరుతో వారివంశనామము కాకతీయగా ఏర్పడినది.

## కాకతీయ సామ్రాజ్యం



దేశ విదేశాలచే కొనియాడ బడుచున్న ఇంద్రనీల ప్రాసాదము రామప్పదేవాలయము యొక్క శిల్ప కళాఖండాలను సృష్టించిన

# ప్రత్యేకశిల్పులు-పనివిభాగములు

1. రామప్ప:- ప్రధాన శిల్పాచార్యుడు.
మూల విగ్రహము-నంది-కామసూత్రములు-ద్వార పార్శ్వ శిల్పములు మహిషాసురమర్దనీ-వాయుకోష్ఠములు(air condilion plants) రతీమన్మథులు-గణపతి-గర్భాలయ శిల్పములు మహాపద్మరాజము 12 ఆధార శిల్పములు Brocket-figures

2. భైరవభట్టు:- శిలాపరీక్షావిభాగము-అను భద్రగజములు

3. త్రిపురారిభట్టు:-ఎనిమిది మంది కాకతీయ శిల్పులు స్తంభశిల్పములు త్రిపురారి భట్టుదళ నాయకుడు.

4. సంధాన శిల్పములు:- నాగలింగస్వామి - రుద్రికాళయ్య - భుజంగస్థపతి కుమారస్వామి-భవభూపతిభట్టు-కాశీపతి-వీరు దాక్షిణ్యశిల్పులు

5. నంది భట్టు:- పీఠభాగనిర్మాణము, ఇతడు హొయసల శిల్పి.

6. స్తంభముల జిలుగుపనులు:- కామారిస్థపతి-బసవాచార్యులు-మారన్న-విజయ భట్టు - నాగశివుడు - భైరవభట్టు - దేవోజు-కాలనాగు-బమ్మోజు

చిన్నగరాయన్న-జక్కోజు - రాయన్న - పద్మోజు - శుభ్రకీర్తి వీరుచాళుక్యశిల్పులు.

7. కుడ్య శిల్పములు:- త్రిసరములు - వజ్రపట్టకములు (పద్మములు) పద్మ కోశములు-వాయుకోష్ఠముల పనిని 25 మంది కాకతీయశిల్పులు.

8. భద్రప్ప:- పైకప్పు సంధానశిలా పలకములను అమర్చుట - ఇతడు కాకతీయశిల్పి.

9. అభిరామప్ప:- శిఖరభాగమునకు తేలికయైన ఇటుకలను తయారు చేయుట.

"ఓజు" అను పదముగలవారు మహాశిల్పులుగ బిరుదములనంది గౌరవింపబడిన మహాశిల్పులు, ఓజస్ అనుసంస్కృత పదమునకు ఓజు వికృతరూపము. ఒజ్జ అనగా ఉపాధ్యాయుడని అర్థముకూడకలదు. ఓజుఅనుపదము శిల్పాచార్యులకు ప్రత్యేకముగా వ్యవహరింబబడినట్లు ప్రాచీన శాసనములందు గలదు.

రుద్రోజు-దేవోజు-రామోజు-మారోజు-ఇంద్రోజు-గన్నోజు - ఎట్టోజు అల్లోజు-మండలోజు-సిద్దోజు-పుల్లోజు-మామిడోజు-పెద్దోజు-పొన్నోజు - ఎలిశోజు పోటోజు-బొల్లోజు-భోగోజు-తిప్పోజు - గౌరోజు. మొదలగు మహాశిల్పులందరూ కాకతీయ సామ్రాజ్యములో మాధవవర్మ మొదలు ప్రతాపరుద్ర చక్రవర్తి వరకు దాదాపు మూడు వందల సంవత్సరముల కాలము ఆయాప్రభువుల వద్ద మందిర నిర్మాణములయందును, కోటలనిర్మాణములయందును, కిరీటములను తయారుచేయుట యందును ఆభరణవిశేషములు చేయుట యందును, కాంస్య విగ్రహములు చేయుట యందును అద్భుతమైననేర్పును ప్రదర్శించినందువలన వారికి గౌరవసూచకముగా ఓజు అను బిరుదములనిచ్చి గౌరవించిరి. ఓజు అనగా ప్రకాశము తేజస్సు అని కూడ అర్థముగలదు.

ఓజు అను ఇంటిపేరు గలవారు సగర్వముగా మా పూర్వులు మహాశిల్పులు అని చెప్పుకొనవచ్చును.

ఆధ్యాత్మిక చింతనగలిగి తపోనిష్ఠగలిగి మహారాజులకు ఆధ్యాత్మిక సలహాలిచ్చి రాజనీతిని బోధించిన మహాశిల్పులకు సంకృతీసంధాన అనియును విశ్వకర్మ

అనియును మహోన్నత విలువగల ఈ బిరుదములతో సత్కరించి గౌరవింపబడి యుండిరి. ఈ పదవులుగల వారిని ఉత్తర భారతప్రభువులు ఆహ్వానించుట వలన వారి వ్యాప్తి భారత దేశమునందు అన్నిరాష్ట్రములయందు వ్యాపించినది. హిందూధర్మం. హిందూదేశం అవిభాజ్యములు. హిందూధర్మం. హిందూమతం అన్ని దేశాలకు అన్నికాలాలకు చెందిన సనాతనధర్మము.

పూర్వకాలములో దేవాలయములద్వారా సనాతన ధర్మప్రచారం జరిగినది. ప్రజలు ధర్మవర్తనులై సుఖశాంతులతో పూర్ణజీవితము గడిపియున్నారు. హిందూ ధర్మం విశ్వకళ్యాణ కారకము. ఇదియేమన జాతీయత, నేడుమనకు కావలసినది శక్తి అధికాధికమైన భౌతిక నైతిక ఆధ్యాత్మికశక్తి భారతీయులలో క్రమ క్రమముగా ఆధ్యాత్మిక దృక్పదము నసించుటవలన జాతిసమైక్యత నశించి జాతి క్షీణింపనారంభించినది. దొంగతనాలు, దోపిడీలు, హత్యలు, మాన భంగాలు పెచ్చు పెరిగి సమాజము అస్తవ్యస్తమైపోయినది.

మానవ జాతి కత్యంత అవశ్యకమైన మహత్తరశక్తిని సాధించే కర్తవ్యం మనపైన నిలుపబడినది. అందుకే ఈ మహోద్యమం అందుకే భారత స్వారాజ్యం,

నేడు స్వాతంత్ర్యము ఉన్నది కాని ఏ కత్వములేదు. ఈ విభజనఅంతరించ వలెను. అంతరిస్తుంది. సనాతనధర్మం తిరిగి పునరుద్ధరింపబడినప్పుడే యిది జరుగుతుంది.

---

మహోద్యమాలన్నీ ప్రగాఢధార్మిక పునరుద్ధరణపైననే ఆధారపడి విజయ ములు సాధింపబడినవి. ధార్మిక జాగృతి సంపూర్ణముగా జరిగినప్పుడే మహత్తర శక్తి నిర్మాణం అవుతుంది.

—అరవింద ప్రబోధమునుండి

---

# రామప్ప దేవాలయ పరిచయము

కాకతీయ మహాసామ్రాజ్యము వైభవోపేతముగా వెలుగుచున్న కాలములో పాలంపేట ఒక సరిహద్దు పట్టణమై కీర్తిగాంచినది. దక్షిణభారత దేశమునకు మహోన్నతమైన సంస్కృతిని చరిత్రనూ శిల్పకళాఖండాలద్వారా ప్రసాదించినది.

ఇప్పుడు పాలంపేట ఒక కుగ్రామము. మూడువైపులా పర్వత శ్రేణులు అరణ్యములు, తటాకములు ప్రకృతిశోభగలిగిన రమణీయ ప్రదేశము. చుట్టూగల అర్ధచంద్రాకారపు పర్వతశ్రేణులను కలుపుతూ ఎత్తైన కట్ట వేయబడినది. దినినే రామప్ప చెరువనియందురు. దీనివైశాల్యము 82 చ. మై. ఈ చెరువుకట్టపై చక్కటి శిల్పములుగల శిధిల దేవాలయములు గలవు. యాత్రికులకు వినోద పర్యటకులకు అధునాతన సౌకర్యములుగల వసతి భవనములు గలవు. చెరువులో పడవ విహారము చేయుటకు సౌకర్యములు గలవు.

భారత దేశములోనేకాదు ప్రపంచములో ఏ దేవాలయమునకుగూడ ఒక దేవాలయమునకు శిల్పి పేరు పెట్టి ఆ మహాశిల్పులను గౌరవించినట్లు రామప్ప దేవలయముతప్ప ఎచ్చటను కానరాదు ఆ ఖ్యాతి కాకతీయశిల్పి యైన ఒక్క రామప్పకుమాత్రమే దక్కినది.

---

కళయొక్క గౌరవాన్ని గ్రహించలేని దాని అందాన్ని అనుభవించలేని వారికి దైవ చింతన ఉండదు. కళారాధనలేమి మిక్కిలి తెలివిహీనత

—వివేకానందుడు

---

# ప్రస్తుత పరిస్థితి:-

నేటి అణుయుగములో మానవుడు భూలోకపు అవధులుదాటి సుదూర గ్రహ నక్షత్రాలకు చేరగల యంత్రములను కనుగొను చున్నాడు. తనతోటి మానవున్ని సర్వనాశనం చేయగల చిత్ర విచిత్రములైన అణుశక్తి కనుగొను చున్నాడు. పుట్టుకురుపు, కాన్సరు, కామిళ్ళు లాంటి తీవ్రవ్యాధులకు కారణములనే కనుగొన లేకపోవుట విచిత్రమైన విషయము. అయితే మన విజ్ఞానశాస్త్రం సాధించినది ప్రగతియా? ప్రళయమా?

భారతీయులకు అధ్యాత్మిక చింతన వెన్నెముకలాంటిది. విదేశీయులు ఈ అధ్యాత్మిక చింతననే భగ్న పరిచిరి నేటి సమాజములో ఏదో అసంతృప్తి యున్నట్లు వారి అందోళనవలన తెలియుచున్నది. సమాజము అదుపు తప్పి అస్త వ్యస్తముగానున్నవి. కారణం దాదాపు 600 సం॥ లు విదేశీయులు మనదేశమును పరిపాలించి మనదేవాలయములను, సంస్కృతిని భాషలను, కళలను సర్వనాశనము చేయుటవలన దేవాలయములందు మన భాషలయంధు, కళలయందు దాగియున్న శాస్త్రీయరహస్యము లేమిటో తెలియకుండా మరుగున పడిపోయినవి. మన దేశ వాతావరణమునకు సరిపడని విదేశీ ఆచారములవలన నేటి యువకులలో మన భారతీయ సంస్కృతియెడల, దేవాలయములయెడల, కళలయెడల అవిశ్వాస మేర్పడి మానభంగాలు, హత్యలు, అత్యాచారాలు చేయుటయందు వెనుకాడక నేటి పరిస్థితి అయోమయంగా అస్తవ్యస్తముగా తయారయినది.

భారతీయ ఋషులు, శాస్త్రవేత్తలు, విశ్వమానవ శ్రేయస్సుకై విశ్వమానవ కళ్యాణమునకై ప్రకృతి శక్తులను వశపరచుకొనుటకు నిరంతరము కృషిసల్పిరి వారి అమోఘమైన పరిశోధన ఫలితములే మన సంస్కృతి, భాష, కళలు.

వారు సాధించి సమర్పించిన శాస్త్ర విజ్ఞానమంతా విదేశాలలో చేరి క్రొత్త పేరుతో మనదేశమునకు తిరిగి దిగుమతియగు చున్నది. ఈ శాస్త్రపరిజ్ఞానమును గాంచి నేటి విద్యావేత్తలు దిగ్భ్రాంతి జెందుచున్నారు. ఎవడో విదేశీయుడు మన దేశమందలి పూర్వపు శాస్త్రవిజ్ఞానము గుర్తించితే తప్ప మన వారికి మన శాస్త్ర విజ్ఞానముపై విశ్వాసము కలుగుటలేదు.

ప్రళయ భయంకర ప్రకృతిశక్తులను, సౌరశక్తిని విశ్వమానవ శ్రేయస్సునకుపయోగించుటకు ఎన్నెన్నో మార్గములను ప్రవేశపెట్టినారు. ఋషులు మునులు ఈ శక్తులను తపశ్శక్తి చేత సాధన బలం చేత శరీరమందిమిడ్చుకొని పూర్ణ జీవితమును గడిపినారు కాని సామాన్యులకు ఇది అసాధ్యమైన విషయం కాబట్టి సౌరశక్తిని ప్రకృతి శక్తులను సామాన్యమానవునికి అందుబాటులో నుండుటకు దేవాలయములం దావాహన చేసి భారతీయులు కొన్నివేల సంవత్సరముల క్రిందనే అమోఘమైన శాస్త్రవిజ్ఞానమును నిరూపించు కున్నారు.

అయితే దేవాలయములందు భారతీయ శిల్పకళయందు దాగియున్న శాస్త్రీయ రహస్యము లేమిటో రామప్ప దేవాలయ వివరముద్వార విశదము కాగలవు.

కాకతీయులు వారి మహాసామ్రాజ్యములో దేవాలయ నిర్మాణమునకు అధిక ప్రాధాన్యత నిచ్చినట్లు ప్రత్యక్ష అనుభవముద్వారా తెలియుచున్నది. ఈ దేవాలయ నిర్మాణమునకు కోట్ల రూపాయలు వెచ్చించి ఏన్నెన్నో కష్టనష్టాలను ఎదుర్కొని శిల్పులు, శిల్పశ్రామికులు, శాస్త్రజ్ఞులు అవిరళ కృషి సల్పి మహోన్నతమైన మనోజ్ఞమైన శిల్పకళాఖండాలతో దేవాలయముల నిర్మాణము గావించిరి. కాని ఇంత పెద్దఎత్తున వైద్యశాలలు నిర్మించినట్లు వారి సామ్రాజ్యములో ఎచ్చటను కానరాదు.

ఇంతటి కృషి సల్పి ఆలయ నిర్మాణము గావించుటలో ఏదో మహత్తరమైన ఆశయము దాగియున్నది. ఏ ఆశయములేకుండా యింతటి నిర్మాణము అనవసరము.

విదేశీయుల ఘాతుక చర్యలవలన పవిత్రమైన మన దేవాలయములు శిల్ప కళాఖండాలు శిధిలమై నేలమట్టమై పండితులు, శిల్పులు, సంగీత విద్వాంసులు, నాట్యకళావేత్తలు, శాస్త్రపరిజ్ఞానముగలవారందరూ చిత్రహింసలకు గురియై చెట్టు కొకరు పుట్టకొకరుగా విడిపోయి సర్వనాశనమైపోయిరి. వారి సంతానమేమైన మిగిలియున్నచో వారికి ఆదరణ లేకుండాపోయినది.

ఏ కొరతాలేకుండా అడవులయందు సంచరించు మృగములకు జంతువులకు పక్షులకు ఏ ఆపదారాకుండా ఆ జాతినాశనము కాకుండా వన్యమృగరక్షణపేరుతో లక్షలరూపాయలు వెచ్చించి ఆ జంతు జాతికిరక్షణ కలిగిస్తున్నారు. కాని సాటి మానవుడు, మానవజాతికి అత్యంత ఉపయోగకరమై ప్రాణదానం చేయగల

లలితకళలు, వాటినే జీవనోపాధిగా జీవిస్తున్న కళాకారులకు, కవులకు తినుటకు తిండిలేక ఉండుటకు నీడలేక అలమటిస్తూ సర్వ నాశనమై పోవుచున్న ఈ కళా వేత్తలకు రక్షణలేక వారి సంతానం సర్వనాశనమై ఊరు పేరు లేకుండా పోతుంటే కాపాడేనాథుడే లేకపోవుట విచారకరమైన విషయము. యిప్పుడు రాజ్యాంగములో పనిచేయుచున్న మనవారి శాస్త్ర పరిజ్ఞానమేమిటో అర్థమగుచున్నది. ఇప్పటికైనా కళాకారులకు సంగీత విద్వాంసులకు కవులకు వారి సంతతికి రక్షణ కల్పించని యెడల జాతియావత్తు నానారోగములతో కుమిలి కృశించుచు నరకయాతన అనుభ వించవలసి వస్తుందని తెలుసుకొనవలెను.

సూర్యోదయమునకు ముందుగా నిద్రలేచి శుచియై దైవదర్శనమునకు దేవాలయములముందు బారులుగా నిలిచేప్రజలు నేడు ఏ డాక్టరుయింటిముందో ఏ వైద్యశాలముందో బారుదేరి ప్రత్యక్షమగుచున్నారు. క్రమక్రమముగా దేవా లయముల స్థానములు వైద్యశాలలు ఆక్రమించి వృద్ధియగుచునేయున్నవి కాని తగ్గుట లేదు. వైద్యులకు వైద్యశాలలు, వైద్యసాలలకు రోగులు, వృద్ధియగుచు దేశ మంతా ఎక్కువ నిష్పత్తిలో రోగులమయమై యున్నది. రోగులు నిష్పత్తి పెరగడ మన్నది నేటి శాస్త్ర పరిజ్ఞానానికి అవమానకరమైన సూచనయై యున్నది. మరి నేడు సాధించిన శాస్త్రపరిజ్ఞానమంతా ఏమైనట్లు ?

అందుకే నాడు భారతదేశం పవిత్ర దేవాలయములతో సంస్కృతీ సభ్యతలతో పుణ్యభూమిగా ఖ్యాతిగాంచినది. మన దేశములో ఏనగరానికివెళ్ళినా ఏ పల్లె ప్రాంతాన్ని దర్శించినా బ్రాహ్మీముహూర్తముననే సుప్రభాతములతో ఓంకార ప్రణవధ్వనులతో ఆలయగోపురాలతో మనోహర ప్రకృతిదృశ్యాలతో సాక్షాత్కరించేవి.

హిందూ దేవాలయాలు భారతీయ సంస్కృతికే ఆధ్యాత్మిక జీవనమునకు దేశప్రతిష్టకు దేశసౌభాగ్యానికి ప్రతినిధులై నిలచినాయి.

భారతదేశపు ఆధ్యాత్మిక తత్వము రోజురోజుకు యూరప్, అమెరికా ఖండా లలో ప్రవేశిస్తున్నది ఈకదలిక మరింత ఉధృతరూపందాలుస్తున్నది.

కాలప్రవాహంలో సంభవించే విపత్తులమధ్య మరెన్నోకండ్లు భారదేశమువైపు భారతీయ ఆధ్యాత్మిక తత్వమువైపు ఆశతో చూస్తాయి.

# కాకతీయరాజుల వంశవృక్షము

| | | |
|---|---|---|
| మొదటి బేతరాజు | .... | 1020-1050 వరకు |
| మొదటి ప్రోలరాజు | .... | 1050-1079 వరకు |
| రెండవ బేతరాజు | .... | 1079-1115 వరకు |
| రెండవ ప్రోలరాజు | .... | 1115-1158 వరకు |




# కాకతీయ రాజుల సంక్షిప్తచరిత్ర

ఈ తెలుగుదేశాన్ని శాతవాహనులు ఇక్ష్వాకులు, చాళుక్యులు, చోళులు, విష్ణుకుండినులు, పల్లవులు, కాకతీయులు, విజయనగరాధీశులు, గోల్కొండ నవాబులు, రెడ్డిరాజులు, వెలమదొరలు పరిపాలించిరి,

కాకతీయులు ఇప్పటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమునేకాక తమిళనాడులోని కొంత భాగమును సాధించి ఒకటిగాజేసి దాదాపు 200 సం॥ లు పరిపాలించిరి. వేంగి

చాళుక్యులు కళ్యాణి చాళుక్యులు 11వ శతాబ్ధమువరకు సమర్థులైన రాజ ప్రతి నిధులుగా నుండిరి మొదటి కాకతీయ రాజవంశజుడగు గుండయరాజు రాష్ట్ర కూటరాజుల వద్ద సేనానాయకుడుగానుండి వరంగల్ జిల్లా మానుకోట తాలూకా లోని కొరవి సీమను ఏలుచుండెను. అంతకుపూర్వం ఈ సీమను ముదిగొండ చాళుక్యపు రాజులు పాలించేవారు. గుండయ వీరిని తరిమివేసెను. రెండవ తైల దేవుడు రాష్ట్రకూటులను అణచివేసి రాజాయెను. కాకతి గుండరాజు తైలదేవునికి సామంతుడుగా నుండుటకిష్టపడక స్వతంత్రుడాయెను. ఇతడు సూర్యవంశ మునకు చెందిన ఉత్తర భారతీయుడనిసతీతి.

హనుమకొండలోని శాసనముల ఆధారముగా మూడవ చాళుక్య దేవునికి మహాబలవంతుడూ యుద్ధ తంత్ర నిపుణుడూఅయన మొదటి బేతరాజు రాజ ప్రతి నిధిగా హనుమకొండ ప్రాంతమును పరిపాలించుచుండెను. ఇతనివద్ద ప్రభుత్వ ధన రాసులు విపరీతముగానుండెను. ఈ ధనసహాయముతో యుద్ధతంత్ర నిపుణుడై సేనానులను వీరులైన సైనికులను ఏర్పాటు చేసుకొని స్వతంత్ర్యము ప్రకటించు కొని ఒక సామ్రాజ్యాధినేతగా కీర్తిగాంచవలెనని తహతహలాడుచున్న తరుణములో రాష్ట్రకూటులు, చాళుక్యులు బలహీనులైరి. బేతరాజు తైలదేవునిపై తిరుగుబాటుచేసి యుద్ధములో అతనినిఓడించెను. హనుమకొండ ప్రాంతము పూర్తిగా తనవశమైన తర్వాత మానవతా దృక్పధముతో తైలదేవున్ని వదలివేసెను. ఈ విధముగా యిప్పుడున్న తెలంగాణా ప్రాంతమును వశపరచుకొని ఒక మహా సామ్రాజ్యమునకు పునాదులు వేసెను తర్వాత ఇతని కుమారుడు ప్రోలరాజు 1052లో రాజ్యానికి వచ్చెను. ఇతడుకూడా తండ్రివలెనే మహావీరుడు ఇతడు చక్రకూటము కొంకణమండలము ఇంకాకొన్ని దేశాలు జయించి తండ్రిని మించిన పరాక్రమశాలిగా కీర్తిగాంచెను.

వరంగల్లు జిల్లాలో కొంతభాగమును కరీంనగర్ జిల్లాలోని కొంతభాగమును కలుపుకొని రాజ్యవిస్తరణగావించెను. ఈ ప్రోలరాజుకు "అరిగజకేసరి" యని బిరుదుకూడ నుండెను. కేసముద్రములో అతడు త్రవ్వించిన చెరువునకు కేసరి సముద్రమని పేరుపెట్టెను. అదియే క్రమముగా కేసముద్రముగాను ఆ గ్రామమునకు కూడ కేసముద్రమని పేరుతో ప్రచారమాయెను. ఇతడు విక్రమాదిత్యునికి యుద్ధ విషయములో సహకరించి విజయములు కేకూర్చినందుకు బహుమతిగా విక్రమా

దిత్యుడు యితనికి "త్రిభువనమల్ల" బిరుదునిచ్చి బేతరాజును గౌరవించెను. సబ్బి మండలమనే యిప్పటి సిద్ధిపేట, కరీంనగర్, వేములవాడ ప్రాంతమును, తన హనుమకొండ రాజ్యమున చేర్చుకొనెను. ఇతడు శివభక్తుడు శైవగురువులను ఆదరించి హనుమకొండలో శివపురమనే ఒకవాడను ఏర్పాటు చేయించెను.

తెలంగాణా ప్రాంతందత సామంతులను చిత్తుచిత్తుగా ఓడించి ప్రోలరాజు తనపెద్ద కొమారుడైన రుద్రదేవునికి రాజ్యభారమప్పగించి చనిపోయెను. రుద్రదేవుడు 1179 నుండి 1595 వరకు ఆంధ్ర తూర్పుప్రాంతపు జిల్లాలను జయించి సముద్రతీర ప్రాంతమును కలుపుకొనెను. శ్రీశైల ప్రాంతమును కాకతీయ సామ్రాజ్యమునకు ఉత్తర సరిహద్దుగా ఏర్పాటు చేసుకొనెను. రుద్రదేవుని తర్వాత అతనితమ్ముడు మహాదేవుడు రాజ్యమునకువచ్చి యాదవులతో యుద్ధముచేసి వీరస్వర్గమలంకరించెను. రేచర్ల, మల్యాల నాయకులు మహాదేవుని కుమారుడగు గణపతిదేవున్ని సింహాసనమెక్కించి అతనిరాజ్యానికే యాపదారాకుండా కాపాడిరి.

ఆంధ్రదేశమునేలిన గొప్పరాజులలో గణపతిదేవుడు మహాబలవంతుడు. ఇతడు 1199 నుండి 1262 వరకు మహావైభవముతో రాజ్యపరిపాలన గావించెను. ఇతని కాలములో ఏకశిలానగరము యొక్క కోటల నిర్మాణము పూర్తి గావింపబడినది. ఎన్నెన్నో గొప్పగొప్ప శిల్పకళాఖండాలతో గూడిన దేవాలయ నిర్మాణములు గావింపబడినది. ఇతనికాలములోనే పాలంపేటలో మహోన్నతమైన శిల్పకళావిలసితమైన రుద్రేశ్వరాలయ నిర్మాణము గావింపబడెను.

రుద్రుని శిరస్సు :- కాకతీయుల శిల్పకళాపోషణకు కాకతీయ శిల్పుల అద్భుతమైన కళానైపుణ్యమునకు మేధాశక్తికి శాస్త్రపరిజ్ఞానానికి మచ్చుతునకయైన ఈ రుద్రుని శిరస్సు ఒక ప్రత్యక్ష నిదర్శనము.

ఓరుగల్లు కోటలోని ఈ శిథిల శిల్పమునుగురించి (డా॥ కులశేఖరరావు M.A. Phd.,) రీడరు తెలుగుశాఖ సాయంకళాశాల హైద్రాబాద్‌గారు మరియు శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులుగారు సంగ్రహ ఆంధ్రవిజ్ఞాన కోశము పుట 147లో ఈ శిరస్సును ప్రతాపరుద్రుని శిరసుగా వివరించియున్నారు.

కాని ఈ శిరస్సును గమనించినచో ఫాలభాగమున మూడవనేత్రము తల చుట్టూ ఆరు పుత్తెలు కళాత్మకముగా మలచబడిన జటాఝూటం. వీటికి క్రింది వరుసలో త్రిశూలాకారమైను బోలిన త్రిసరములు స్పష్టముగా గోచరించుచున్నవి. ఈ వివరములను బట్టి ఇది రుద్రుని శిరస్సని తేల్చి చెప్పవచ్చును. కాకతీయులు రుద్ర అను పదమును శివునికి పర్యాయ పదముగా విస్తారముగా ఉపయోగించుకొని యున్నారు. రుద్రేశ్వరాలయమని, రుద్రదేవుడని, రుద్రసేనానియని, రుద్రమదేవి యని, ప్రతాపరుద్రుడని రుద్రపదమును వినియోగించుకున్నారు. ఈ అరుపుత్తెలు షట్శాస్త్రములను పరిశోధనగావించిన మహాఋషులకు రూపకల్పన గావించబడినవి. అరుగురు మహాఋషుల మేధాశక్తి ఒక్క రుద్రునికి గలదను భావమునకు శిల్పులు కళాత్మకముగా శిల్పరూపములో విన్యసించి యున్నారు. ఈ మేధాశక్తికి నిదర్శనముగా దివ్యనేత్రమును లేక జ్ఞాననేత్రముగా ఫాలభాగమున సృష్టించబడినది.

ఈ అరు పుత్తెలకు ఊర్ధ్వముఖముగా అలంకార ప్రాయమైన 10 విధముల వజ్రములు పొదిగిన దివ్య పథకము రూపకల్పన చేయబడినది ఈ పది వజ్రములను వేదాంత సారమైన ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తరేయ, ఛాందోగ్య బృహదారణ్యకములను పది ఉపనిషత్తులను సూచించుచున్నది. అనగా రుద్రుడు దివ్యజ్ఞాన సంపన్నుడని ఈ దివ్యజ్ఞానముచే భూత, భవిష్యత్, వర్తమానకాలములను తెలుసుకొని రాబోవు ప్రళయములనుండి భక్తజనావళిని కాపాడి లోక కళ్యాణం గావించినాడను భావమును విశదపరచుచున్నది.

1. న్యాయ దర్శనము — గౌతమహర్షి
2. వైశేషిక దర్శనము — కణాదమహర్షి
3. సాంఖ్య దర్శనము — కపిలమహర్షి
4. యోగ దర్శనము — పతంజలిమహర్షి
5. పూర్వ మీమాంస — జైమినిమహర్షి
6. ఉత్తర మీమాంస — బాదరాయణమహర్షి

ఇందరు ఋషి పుంగవులు పరిశోధనా పరిజ్ఞానము కలిగి సుదూరగ్రహ నక్షత్రముల వునికిని మానవులపై వాటి ప్రభావమును దూరమందున్న వారి అకార

మును ధ్వనులను తెలుసుకొని సకాలములో వారి నాదుకొని దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయగలిగెను.

రామప్ప దేవాలయమందలి కమ్మీలపైగల గజముఖాసురుని సంహార గట్టము లోని శిల్పములయందును ఈ శిరస్సును బోలిన కిరీటములాంటి జటాజూటమును ప్రత్యక్షముగా చూడవచ్చును. బలిపీఠముపైగల మహాపద్మరాజముచుట్టూ శివతాండవ శిల్పములు నటరాజ శిల్పములు మొదలగు అనేక శిల్పములందు ఈ రుద్రుని శిరస్సును బోలిన శిఖవిన్యాసం స్పష్టముగా గోచరించును.

కాకతీయ శిల్పులు దేవతామూర్తులకు తప్ప రాజుల శిల్పములే కాని రాజుల శిల్పముకు కిరీటము లేకాని శిల్పించినట్లు ఎచ్చటను కానరాదు. వరంగల్ ఖిల్లాలోని స్వయంభూ దేవాలయములోని చతుర్ముఖలింగమునకు గల నాలుగు ముఖములను గమనించినచో అందులో శివుని శిరస్సు యొక్క శిల్పకళావిన్యాసము స్పష్టముగా గోచరించగలదు.

గణపతిదేవుడు తమిళనాడులోని కంచి చంగల్ పట్టు జిల్లాలను కలుపుకొని వెలనాటి రాజులపై దండు వెడలెను, దివియందున్నలయ్య వంశపు మాండలికుడు ఇతనితో సంధి చేసుకొనెను. ఆవంశములోని యువకుడే జాయప్ప. ఇతని అస మానమైన తెలివికి పరాక్రమానికి మెచ్చి గణపతిదేవుడు ఇతనిని తన సైన్యాధి కారిగా నియమించుకొనెను. తర్వాత విక్రమసింహపురి (నెల్లూరు) వశపరచుకొని తన ప్రతినిధులను ఏర్పాటు చేసి కాకతీయ సామ్రాజ్యమును వైభవోపేతముగా పరిపాలించెను.

కాకతీయ శిల్పులు కావ్యముల భావములకు భావగాంభీర్యమైన ఆకృతికల్పిం చుటలో సిద్ధ హస్తులు

రామప్ప తండ్రియైన రుద్రోజు వేయిస్థంభాల దేవాలయములోని కళ్యాణ మంటప స్థంభములపై భావయుక్తమై ఒక చక్కని ప్రబోధముతో వెలసిన ఈ దిగువ శిల్పము ఒక మచ్చుతునక.



రామప్ప దేవాలయము

రామప్ప తండ్రియైన రుద్రోజు తత్వజ్ఞానమునకు రూపకల్పన చేసినశిల్పము. యోగిచేతిలో ఆహారము యోగినిచేతిలో చిలుక మధ్యభాగమున యోగివైపుతిరిగి బంధింపబడియున్న మర్కటము. యోగి యోగినుల వలన కలగిన సంతానం. మర్కటబుద్ధి చంచలమైనది. దానిని బంధించి వీర్యమును సరియగుపద్ధతిలో వాడుకున్నప్పుడే పూర్ణజీవితమును గడుపగలడు.

అప్పుడే మోక్షానుకూలతకు దోహదం జరుగును. కామిగాని మోక్షగామి గాడు అనగా కామమును అదుపులోనుంచినప్పుడే మోక్షానుకూలత జరుగుతుంది. చిలుకపలుకులు స్త్రీయొక్క చక్కని ఆకర్షణీయమైన సంభాషణకు నిదర్శనము. ముందువెనుకలు ఆలోచించకుండా ఆహారమునకు ఆశపడినచో ఎన్నో అనార్థాలకు దారితీయగలరు ఎందుకనగా పురుషుడు చపలచిత్తుడు. స్త్రీ పురుషునితో ప్రేమ వ్యవహారములో జాగ్రత్తగా నుండవలయును వివాహముకాకముందే లైంగికసంబధములు కలిగియుండుటవలన సంతానము కలుగును పురుషుడు తన కామవాంఛతీరిన తర్వాత ఆమెను పెండ్లిచేసుకొనక పోవచ్చును. ఎందుకనగా పురుషుడు చపలచిత్తుడుకాబట్టి స్త్రీ పురుషులు పెండ్లికాకముందు ఏలాంటి లైంగిక సంబంధములు కలిగియుండ కూడదూ అను భావము ఇందులో ద్యోతకమగుచున్నది. ప్రకృతి పురుషులతత్వానికి చక్కని ఉదాహరణగా రూపకల్పన చేయబడినది.

ఈశిల్పము కాకతీయశిల్పుల కళానైపుణ్యమునే కాక కాకతీయరాజుల కళాప్రియత్వమెంత ఉన్నతమైనదో ఈశిల్పమువలన తెలియుచున్నది. కాకతీయులు ప్రతి విషయమును ఉభయ ప్రయోజనములనాశించి ప్రయోగించిరి.

గణపతిదేవుని తర్వాత అతనికూతురు రుద్రమదేవి రాజ్యమునకు వచ్చెను. ఇతనికి మగ సంతానము లేదు ఇద్దరూ ఆడసంతానమే. రుద్రమదేవి, రుద్రమదేవికి ఇద్దరూ ఆడసంతానమే రుయ్యమ్మ ముమ్మడమ్మ. రుద్రమదేవి తర్వాత ప్రతాపరుద్రుడు రాజ్యమునకు వచ్చెను. ఇతడు మహావీరుడు యుద్ధతంత్ర నిపుణులు అయినసైన్యాధిపతులతో చురుకైనసైన్యముతో తమిళనాడు రాజులనువశపరచుకొనెను. ఉత్తర భారతమునుండి దండెత్తివచ్చెడి తురుష్క సైన్యాలను ఎదుర్కొనుటకు ఎకశిలా నగరముచుట్టూ రాతికోటలను మట్టికోటను బాగుచేయించి రాజప్రాసాధమునకు తగినరక్షణ కల్పించుకొనెను ఇది కాకతీయరాజుల సంక్షిప్త చరిత్ర—




రాష్ట్రకూటులు, చాళుక్యులు పరిపాలించుచున్న కాలములోనే జైన బౌద్ధ మతములు రాజుల ఆదరణతో విజృంభించ నారంభించెను. అందువలన శైవ మతము వైష్ణవ మతములు క్షీణించనారంభించెను. జైన బౌద్ధమతములు సామాన్యులకందుబాటులో లేకపోవుటవలన అటు శైవమతము, వైష్ణమతము యందును. ఇటు జైన బౌద్ధమతములయందును స్థిరత్వ మేర్పడక ధార్మిక జీవనము అడుగంటనారంబించెను. ప్రజలలో నీతినియమములు అడుగంటి మానభంగాలు, దోపిడీలు హత్యలు పెచ్చుపెరిగి సమాజము అదుపుతప్పి ప్రజాజీవితము అస్తవ్యస్థము కాజొచ్చెను భారతీయులకు ఆధ్యాత్మికచింతనయే వెన్నెముక ప్రజలను సరియగు మార్గములో

నడిపించి శాంతిసౌఖ్యములను ప్రసాదించినది ధార్మిక జీవనము ఆచారవ్యవహారములు సన్నగిల్లుటవలన ప్రజల ఆరోగ్యము క్షీణించి నానారోగములననుభవించుచూ భయంకరమైన రోగముతో మృత్యువాత బడజొచ్చిరి. అందువలన ప్రజలకు భక్తి మార్గమును ధార్మిక జీవనమును పెంపొందించుటకు అదుపుతప్పిన సమాజమును అదుపులోనికి తెచ్చుటకు ఈ దేవాలయనిర్మాణము తీవ్రమైన ఉద్యమరూపములో ప్రారంభమైనది. ప్రజలసాంఘిక విధానములోను ఆయురారోగ్యముల విషయములోను ఈ దేవాలయములు ప్రముఖ పాత్రవహించినవి.

గణపతిదేవుడు రాజ్యపరిపాలనాసౌలభ్యముకొరకు ఏకశిలా నగరమునకు నలువైపుల నాలుగురకాల సైనికకేంద్రాలను ఏర్పాటు చేయించి కరిపురము (కరీంనగర్) లో గజసైన్యమును, పానుగల్లులో రథసైన్యమును, అశ్వారావు పేటలో అశ్విక సైన్యమును పాలంపేటయందు కాల్బలమును వృద్ధిచేయుచు తగుశిక్షణ నిప్పించుచూ సైన్యాభివృద్ధి గావించుచుండెను. సమర్థులైన కొందరు ప్రముఖులను ఏకశిలానగరముచుట్టూ ఎప్పటికప్పుడు మెలకువతో సంసిద్ధముగా నుండనట్లేర్పాట్లు గావించెను

పాలంపేట కాకతీయ మహాసామ్రాజ్యమునకు సరిహద్దు పట్టణమై వెలసి యుండుటచేత రేచర్ల వంశజుడగు రుద్రసేనాని కాలయ భాండయలను సహాయక సేనానులతో గణపతిదేవునికి ఆత్మీయుడై అండదండగా మెలగుతూ ఆ ప్రాంతమును పరిపాలించుచుండెను. రుద్రుడు ప్రత్యేకముగా తన యుద్ధతంత్ర నిపుణతను ప్రదర్శించి గణపతిదేవునికి ఎన్నో విజయములను చేకూర్చెను. అందుకు ప్రతిఫలముగా రుద్రునికి బోర్లపల్లి గ్రామమును వ్రాసియిచ్చినట్లు శాసనములు గలవు.

జాయప్ప కాకతీయ సామ్రాజ్యమునకు గజసేనాపతి స్వయముగా గణపతిదేవునికి బావమరిది. సుప్రసిద్ద నాట్యాచారుడైన కుండయామాత్యుల వద్ద గురుముఖముగా నాట్యమభ్యసించెను. జాయప్ప నృత్యరత్నావళి- గీతరత్నావళి- వాద్యరత్నావళియను మూడు గ్రంథములు రచించెను. ఇప్పటికి ఒక్క నృత్యరత్నావళి మాత్రమే ప్రచారమందున్నది సారంగదేవుడు, దేవగిరిని పరిపాలించిన యాదవ మంత్రి సింగన్న యొక్క ఆస్థానములోనుండిన నాట్యశాస్త్రవేత్త. సారంగదేవుడు మరియు జాయప్ప యిరువురు సమకాలికులు సారంగదేవుకు సంగీత రత్నాకరము అను గొప్ప సంగీతశాస్త్రమును రచించెను. నృత్యం గానం, వాద్యం ఈమూడింటిని గురించి తెలుపుశాస్త్రమునకే సంగీతశాస్త్రమని పేరు.

జాయప్ప కేవలం నాట్యం నేర్చిన పండితుడే కాక స్వయంగా నాట్య మాడిన అనుభవజ్ఞుడు ఒక మహాసామ్రాజ్యమునకు సైన్యాధిపతియైయుండి నాట్యమాడినట్లు చరిత్రలో ఎచ్చటను కానరాదు ఇతడు నూరుపాళ్ళ తెలుగు వాడు కావడం మనందరికి గర్వకారణం.

త్రిలోచనాశ్రమము:- కళాకారుడు ప్రకృతియొక్క విద్యార్ధి. అతడు ప్రకృతి నుండే స్ఫురణను పొందగలడు. గంభీరమైన ఆలోచనాశక్తిని సాధనముగా చేసుకొని దానికి సంబంధించిన చిత్రాలను శిల్పాలను, తనమస్తిష్కంలో చిత్రిస్తాడు లేదా సృష్టిస్తాడు. ఈ ప్రక్రియలో వైజ్ఞానికుడు ఇతర కళారాధకులవలెనే తానుగా ఏర్పరచుకొన్న తర్కం అనే నియమాలతో తనను బంధించుకుంటాడు. సహజప్రకృతికి ఆకృతులను గావించే ఈ కృషిలో మానవుని సౌందర్యాత్మక 'బౌద్దిక' భావనల ఏకీకరణమే విజ్ఞానం. అందుకే విజ్ఞానం, అత్యుత్తమమైన సృజనాత్మక కళారూపం అని సర్ సి.వి. రామన్ అన్నారు.

హనుమకొండలో వేయిస్తంభాల దేవాలయము నిర్మించిన మహా శిల్పి 'రుద్రప్ప' ఇతని అసలుపేరు శివదేవప్ప. వేయిస్తంభాల దేవాలయ నిర్మాణము తర్వాత అనగా రుద్రేశ్వరాలయమును నిర్మించుటవలన కాకతీయ రాజులు యితనిని "ఓజు" అను బిరుదముతో గౌరవించుట వలన 'రుద్రోజు'గా ఖ్యాతిగాంచెను. 'ఓజు' అను పదము ఆనాటి బ్రహ్మశిల్పులకు గౌరవసూచకముగా ఉపయోగించేవారు. రుద్రోజు తనకళా నైపుణ్యమును ప్రదర్శించి శైవ ప్రధానమైన వేయిస్తంభాల దేవాలయమును పూర్తి చేయగలిగెను. ఇది త్రికూటాలయము. వాసుదేవర, సూర్యదేవర, శివదేవర అనుమూడు ఆలయాలు యిందు పొందుపరచబడి యున్నవి.

ఈ ఆలయమందలి శిల్పకళా కౌశలం వేయినోళ్ళ పొగడినా చాలదు వేయికండ్లతో చూచినా తనివితీరదు. లింగాకారముపై వెలుగు నీడలు పడుటలో రుద్రోజు తన శిల్ప చాతుర్యమును ప్రదర్శించెను. 'సందిసి'

అద్భుతముగా శిల్పించెను. కళ్యాణ మంటపములోని యోగిని, యోగియొక్క భావ గాంభీర్యమును శిల్పరూపమున విన్యసించెను. ఈ దేవాలయము యొక్క కొన్ని భాగములను మరియు కళ్యాణ మంటపమును కొన్ని రాజకీయ కారణములవలన పూర్తి చేయజాలక పోయెను.

రుద్రోజుయొక్క కుమారుడే రామప్ప. భార్య పేరు చాముండేశ్వరి రామప్ప జన్మించిన పిదప కొద్దికాలమునకే చాముండేశ్వరి పరమపదించెను.

రామప్పకు తల్లి పెట్టినపేరు గంగరాజు. రామప్ప తండ్రితో వేయి స్థంభాల దేవాలయ నిర్మాణ సమయమున ఎన్నెన్నో శిల్పకళలలోని మెలకువలను నేర్చుకొనెను. ఇతడు బాల్యమునుండే చురుకైనవాడు.

త్రిపురారి వేయిస్థంభాల దేవాలయ నిర్మాణములో స్థంభములను పైకప్పు భాగములను సందులు లేకుండా అమర్చుటకు కొంతమంది సహాయ శిల్పులు కావలసివచ్చెను. ఇతనికి కావలసిన సహాయకులను ఎన్నుకొనుటకు ఒక పరీక్ష పెట్టెను. రెండు గోలీలను జిగురు లేకుండ ఒకదానిపై ఒకటి నిలుపుమని చెప్పెను. పోటీకి వచ్చినవారిలో ఎవ్వరికీ ఉపాయము తోచక వెర్రిమొఖము పెట్టిరి. రామప్ప ముందుకువచ్చి ఇదెంతపని తృటిలో చేయుదునని చెప్పి తన చేతి వ్రేళ్ళకుగల ఉంగరము నొకదానిని నేలపైపెట్టి దానిపై ఒక గోలీని పేరొక ఉంగరము ఆగోళీపై పెట్టిదానిపై రెండవగోళీని అవలీలగా నిల్పెను. రామప్ప మేధాశక్తికి త్రిపురారి ఆశ్చర్యపడి ఎత్తుకొని శభాష్ అని వీపు చరిచెను. చుట్టు 27 నక్షత్రములు మధ్యన చంద్రుని ఆకారముగల ఒక సువర్ణ పతకమును బహూకరించెను. ఈ పతకమునకు చంద్ర భూషణమని పేరు. ఈ పతకము ధరించి నప్పటినుండి చంద్రభూషణుడని పేరు గాంచెను.

రుద్రోజు తనకుమారుడు తననుమించినవాడు కావాలని తను ప్రదర్శింపజాలని కళాఖండములను సృష్టించి తరతరాలకు పేరు ప్రతిష్ఠలు నిలుపుకొన

వలయుననను తపన వృద్ధ శిల్పియైన రుద్రోజు మనస్సు పరితపించుచుండెను.

చక్రవర్తి గణపతిదేవుడు కళ్యాణమండప నిర్మాణమును ప్రస్తుతానికి నిలిపివేసినట్లు అందుకు కొన్ని బయటి రాజకీయ కారణములని తెల్పిరి. నేను బ్రతికి యుండగా నాచేతులతో పూర్తిచేయు అవకాశము పోయెనను బాధ వృద్ధశిల్పి మనస్సును బాధించెను. ఆ భగవంతుణే స్మరించి కన్నీరు గార్చెను. మానధనుడు, కార్యదక్షుడు అయిన రామప్ప తండ్రి వేదనను అర్థము చేసుకొని క్షణంకూడా హనుమకొండలో నిలువక తండ్రిని తీసికొని పాలంపేటకు పోయెను అచ్చట ఒక పర్ణశాల నిర్మించుకొని తన తండ్రి కోరిక ప్రకారము ఆ పరిసర ప్రాంతమంతా తిరుగుచూ ప్రకృతి పరిశీలన గావించు చుండెను. అప్పటికి రామప్ప చెరువు ఇంత అభివృద్ధిలో లేకుండెను. అప్పటికది మామూలు తటాకము మాత్రమే.

రామప్ప ఉదయములేవగానే తనవంశ దైవమైన "విశ్వకర్మ" భగవానుని స్మరించుకొని కార్యక్రమమునకు ఉపక్రమించెడివాడు. దివారాత్రములు భూమి, భూమియందలి ఖనిజములు, ఆ ప్రదేశముయొక్క వాతావరణము ఆ ప్రదేశమందు గ్రహనక్షత్రాది ప్రభావము ఆకర్షింపబడుట, మొదలగు విషయములు తండ్రికి తెలియజేయుచూ తీవ్రమైన పరిశోధనగావించు చుండెను. వర్షాకాలము ప్రారంభమాయెను. రాత్రి సమయమంతా పగలు పరిశోధించిన విషయములు పునరాలోచించి ఎప్పుడో, ఆ సమయములోనో నిద్రించెడివాడు. ఒక నాటి రాత్రి ఉరుములు మెరుపులతో కుంభవర్షము కురియుచుండెను. ఆ ప్రదేశమంతయు జలమయమై భీభత్సవముగా గోచరించు చుండెను. రామప్ప మెలుకువలోనుండి ఆకాశము వైపు తదేకదృష్టితో జూచుచూ మినుకు మినుకుమను నక్షత్రములను, ఉల్కలను, తోకచుక్కలను వాటి వర్ణవిశేషములను గాంచుచూ ఖగోళములో సంభవించే ప్రకృతియొక్క వింత చేష్టలను గాంచుచుండగా అంతరిక్షము నుండి అకస్మాత్తుగా భయంకరమైన పెళపెళ ధ్వనులతో రోదసీ నుండి భూమివరకు పెనవేసుకొని తెలుపుఊదారంగు జ్వాలాముఖముగా చెరువులోపడుట ప్రత్యక్షముగా గాంచి భయకంపితుడాయెను. ఆ రాత్రియే భగవత్ప్రేరణకు అంకు

రార్పణ జరిగినది. ఉదయముననే రామప్ప తాను రాత్రి చూచిన ఈ వెలుతురు గురించి తండ్రికి తెలియజేసెను. తండ్రి బాగుగా ఆలోచించి గ్రహశక్తులను ఆకర్షించే అద్భుతమైన తత్వము ఈప్రాంతమునకు గలదు. కాబట్టి ఆలెక్క ప్రకారము ఆ శక్తి స్థాయిని తగ్గించే ఆకర్షించే గుణము ఇప్పటి దేవాలయ ప్రాంతమున గలదని తెలియజేసెను.

జల సమృద్ధి గలిగి రమణీయ పర్వతశ్రేణులు వనప్రాంతము గలిగిన ఆ ప్రదేశమున, ఒక్కొక్క ఋతువునందు విచిత్ర తత్వముగల ఒక్కొక్క విధమైన ప్రకృతి సౌందర్యముతో మార్పులు జరుగుట రామప్ప స్వయముగా గాంచుచుండెను. ఆ ప్రాంతము శిల్పాశ్రమమునకు యోగ్యమైనదిగాను దేవాలయ నిర్మాణమునకు ముఖ్యమైనదిగాను భావించి, మొదలు పరిశోధనా కేంద్రముగా త్రిలోచనాశ్రమమను పేరుతో ఒక శిల్పాశ్రమమును స్థాపించెను

త్రిలోచన శిల్పాచార్యుడు కాకతీయ సామ్రాజ్యమునకు ప్రధాన స్థపతిగా నుండెను. ఇతడు స్వయముగా రుద్రోజుకు తండ్రి మరియు రామప్పకు తాతగారుదివ్య జ్ఞానసంపన్నుడు. కొయ్య, రాగి, బంగారము పంచలోహములతో కాంస్య ప్రతిమలు విగ్రహము చేయుట యందు సిద్ధహస్తుడు. ఓరుగల్లు కోట నిర్మాణము నందు అనూహ్యమైన అసాధారణమైన నిర్మాణ విధానము ప్రవేశ పెట్టి దుర్గమమైన ద్వారములను నిర్మింపజేసెను. త్రిలోచనాచార్యుడు శిల్పియే గాక గణపతిదేవ చక్రవర్తికి ఆభరణములు మణిఖచిత స్వర్ణ కిరీటములు తయారు చేసి అద్భుతమైన కళానైపుణ్యమును ప్రదర్శించినందులకు గౌరవ సూచకముగా ఇతనికి 'సంకృతి పంచానన' యనియు 'విశ్వకర్మ' యనియు ప్రత్యేక బిరుదములనిచ్చి గౌరవించెను.

విశ్వరూపము, విశ్వములోని విభిన్న తత్వములను తెలియజేయు ఆది యొక్క దివ్యస్వరూపము. సూర్యుని విభిన్న తత్వముగల సౌరశక్తియే ఈ సృష్టికి మూలము, ఈ విశ్వసృష్టికిమూలకారుడే విశ్వకర్మ భగవానుడు. ఇతని విభిన్న తత్వము ప్రదర్శనయే విశ్వరూపము.

సృష్టికి ప్రతిసృష్టి చేయుటలో అసమానమైన ప్రజ్ఞాపాటవములను బ్రహ్మ జ్ఞానమునకు జోడించి కళానైపుణ్యము ప్రదర్శించేడివారికి "విశ్వకర్మ" అనియు మరియు విశ్వకర్మ ప్రత్యేకముగా పంచభూతాత్మకమైన పంచతత్వములుగలిగి యున్నందువలన "సంకృతీ పంచానన" అను బిరుదములతో సత్కరించెడివారు.

మయబ్రహ్మ అనూహ్యమైన అద్భుతమైన సాంకేతిక కళాశాస్త్ర పరిజ్ఞానముతో పాండవులకు ఒక రాజసభ నిర్మించియుండెను. కళాత్మకమైన సాంకేతిక నిర్మాణం ప్రతిభను ప్రదర్శించినందులకు ధర్మరాజు తన సభామండపములో, ప్రముఖుల సమక్షమున శ్రీకృష్ణునిచేత మయబ్రహ్మకు 'విశ్వకర్మ' అను బిరుదం ప్రధానం చేయబడినది.

తర్వాత ఆ సభలో, అమోఘమైన బలసంపన్నుడై రారాజుగా కీర్తింపబడిన దుర్యోధన సార్వభౌముడినే సంభ్రమాశ్చర్యములతో మతి చలింపజేసి అయోమయ స్థితికి దిగజార్చి అవమానముల పాల్జేసిన మయబ్రహ్మ నిర్మాణ ప్రతిభ అమోఘము. అందుకు "విశ్వకర్మ" బిరుదమునందుకోనడము ప్రత్యేక విశేషము. ఆ మయబ్రహ్మ పేరుతో ఆ సభ మయసభగా కీర్తించబడుట అపూర్వ ఎనలేని విశేషము.

రామప్ప ఉన్నతస్థితికి వచ్చుటకు శాస్త్రపరిశోధనతోపాటు శంకుస్థాపనలు గృహనిర్మాణ సంబంధమైన వాస్తుశాస్త్ర విషయములు, జ్యోతిష్యము మొదలగు విషయములు ఆ ప్రాంత ప్రముఖులకు తెలియజేయుచుండెడివాడు. రామప్ప యెడల అచ్చటి సామాన్య ప్రజలకు సైతము సద్భావన ఏర్పడెను. అతని హస్తగుణము మంచిదను భావము అందరికి ఏర్పడి ఆ ప్రాంత ప్రజల హృదయములలో నిలచిపోయెను, రామప్పకు శైవసాంప్రదాయము, వైష్ణవ సాంపదాయయులు సంపూర్ణముగా తెలిసియుండెను. తండ్రి కుమారునిచేత రావణబహ్మ వ్రాసిన నటరాజస్తోత్రములను వళ్లింపజేసేడివాడు. రావణబ్రహ్మ విశ్వకర్మ సంతతివాడని తెలిపేవాడు. రావణబ్రహ్మకు రామునికిగల సజాతి వైరముయొక్క. వివరములను బోధించేడివాడు.

వేదాధ్యయనముతోపాటు జాయప్ప రచించిన నృత్యరత్నావళి, వాత్సాయనకామసూత్రములు, స్ఫటికశాస్త్ర విజ్ఞానమును కరతలామలక మొనరించెను. క్రమక్రమముగా అతని పేరుప్రఖ్యాతులు ఆ ప్రాంతమున వ్యాపింపసాగెను.

మహాశిల్పి షణ్ముఖస్థపతి:- శిల్పియైనవాడు సకలశాస్త్రములను, సౌరశక్తిని పరిశోధించి ఆ దివ్యశక్తులను మానవమనుగడకు ఉపయోగించు పరికరములను, యంత్రములను, సంగీత స్వరములు పలికించు తీగలుగలవీణను, మృదంగమును మొదలగు సంగీతమునకు సంబందించిన పరికరములను, వాయువుకంటె తేలికయై సౌరశక్తితో అతివేగముగా ప్రయాణం చేయగల పుష్పకములను, క్షణములో భస్మీపటలముచేయుశక్తిగల మారణాయుదములను అనగా ఇంద్రుని వజ్రాయుధము, విష్ణుమూర్తి చక్రమును, బ్రహ్మకోరధమును, శంకరుని కి త్రిశూలమును రాముని బాణము మొదలగు దివ్యాయుధములను ొట్టలు నేయుటకు యంత్రములు, మానవ నివాసమునకు గృహములు మొదలుకొని సకల శాస్త్రములు తెలియజేయు శిల్పములు, చిత్రములు ఆ తర్వాతనే అక్షరములకు రూపకల్పనచేసి ప్రయోగించి తగినసామర్థ్యముగలవారికి శిక్షణనిచ్చి వేరు వేరు వ్యవస్థలను ఏర్పాటుగావించినవారు "విశ్వకర్మలు".

షణ్ముఖస్థపతి విశ్వకర్మకులజులు. పాలంపేటనివాసి. తర్క మీమాంసాది ఖగోళ శాస్త్రములందు అపార అనుభవము గడించిన వేదాంతి. ఇతడు నూరు పాళ్ళ కాకతీయుడు, అనివార్య కారణములవలన స్వదేశమువదలి దక్షిణభారత దేశము వెళ్లవలసివచ్చెను. యాదవరాజుల వద్దను, కళ్యాణీచోళ్ళులవద్దను తన ప్రతిభను ప్రదర్శించి-కళాపోషకులైన రాజులచే మన్ననలనుపొంది సత్కారములను, సన్మానములనుపొంది కీర్తింపబడెను. అనేక దేవాలయ నిర్మాణమందును, శంఖుస్థాపన మొదలు విగ్రహ ప్రతిష్ఠ కార్యక్రమములందును ప్రముఖపాత్ర వహించి పునాది కార్యక్రమములను నిర్వహించుటకు వేదపండితులకు, బ్రాహ్మణులకు శాస్త్రీయముగా శిక్షణనిచ్చి పండిత ప్రకాంతులకే సంభ్రమాశ్చర్యములు కలుగజేసిన మహాశిల్పి. దేశదేశములుతిరిగి వృద్ధాప్యము దాపురించుట వలన, శేషజీవితమును స్వగ్రామమైన పాలంపేటయందు గడుపుటకు చేరుకొనెను.

కొంతకాలమైన తర్వాత అనోట ఈనోట రామప్ప యొక్క ప్రజ్ఞ విశేషాలు విని కళాప్రియుడైన షణ్ముఖస్థపతి రామప్ప శిల్పములను చూడదలచి ఒకసారి త్రిలోచనాశ్రమమునకు వచ్చెను.

ఆశ్రమములో రామప్ప శిష్యులు క్రమశిక్షణతో శిల్పములను చెక్కుచుండిరి. కొందరు రాతి ఫలకములను నునుపు చేయుచుండిరి, కొందరు నునుపు చేయబడిన ఫలకములపై రూపములను వ్రాయుచుండిరి. కొందరు ఉలులను పదును చేయుచుండిరి. కొందరు పూర్తియైన శిల్పములందు నునుపు చేయుచుండిరి. ఈ దృశ్యము పెద్ద పెద్ద మందిర నిర్మాణములయందు జరుగు పని మాదిరిగా దోచెను. ఒకమారుమూల గ్రామములో అద్భుతమయిన శిల్పకళా ఖండాల నిర్మాణముగాంచి అప్రాంత ప్రముఖులు, ప్రజలు 21సం॥లయువకుడు నూనుగుమీసాల రామప్ప ప్రతిభను కొనియాడెడివారు.

అయితే షణ్ముఖస్థపతి రామప్పను దగ్గరకు పిలచి ప్రేమతో అతని ముఖవర్చస్సునుగాంచి ఇతడు మహాశిల్పి కాబోయె లక్షణాలున్నాయని గ్రహించెను. కాని రామప్పలోని ఒకానొక చిన్న లోపమును మాత్రము తెలుసుకొనెను. రామప్ప యువకుడు, అవివాహితుడు, కాబట్టి శిల్పములకు ప్రాణము పోయగల స్త్రీల రహస్యస్థానము తెలియవు. అందుచేత రామప్పను స్త్రీసౌందర్యోపాసన చేయుమనెను ఈ సౌందర్యోపాసనవలన శిల్పికి కాలము తెలియదు, విసుగు జనించదు, చిత్తైకాగ్రత జనించి సమాధి కుదురును. స్త్రీలయొక్క మహాసౌందర్యము, శరీరమర్మములు తెలుసుకొనినవాడు. ఒక శిల్పియో, కళాకారుడో, కవియో, సంగీత విద్వాంసుడోయైనచో ఎన్నియో సుందర విగ్రహములుద్భవించగలవు, కళావిలసితమైన చిత్రములు రూపొందింపబడగలవు. స్త్రీ సౌందర్యమును వర్ణించుచూ మనోహరమైన కావ్యములు వెలువడగలవు. సరస సంగీత తరంగములుద్భవించగలవు. అవ్యక్తమునుండి వ్యక్తములగువానిని అనంతముఖములై నిర్మించబడగలవు. మహాశిల్పియైన జక్కనాచార్యుడు హోయసలరాకుమార్తె అందాలకుందనపు బొమ్మ సౌవర్ణిని ప్రేమించి పెండ్లిచేసుకొని, ఆమె సౌందర్యోపాసనవలన ఎన్నెన్నో కావ్యాలకు

భాష్యాలుగా సుందరశిల్పములు వెలువడినవి. సౌపర్ణిని జక్కణాచార్యునిపైగల అమిత ప్రేమచే ఎన్నెనో మనోహరమైన భంగిమలనిచ్చి, స్త్రీ సౌందర్యమును శిల్పముగా విన్యసించుటకు తోడ్పడినది. కాబట్టి "నీ శిల్పములు స్త్రీసౌందర్యా రాధనవలననే సంపూర్ణ కళా స్వరూపము దాల్చగలవు" ఈ అ న ం త మై న విశ్వమునందులి భిన్న భిన్న తత్వములుగల ఆకృతులకు మహాసౌందర్య శిల్ప ములు సృష్టించగలవు. ఈ సౌందర్యోపాసనలో ఈశ్వరాంశయున్నచో ఈ నీ ఆరాధన కళాస్వరూపందాల్చగలదు. ఈ ప్రపంచములోని మహాశిల్పులు అరి తేరిన చి త్ర కా రు లు నిర్మించిన మహోన్నతమైన సౌందర్యవంతమైన కళా ఖండాలకు మూలమువారు ప్రేమించిన స్త్రీయొక్క సౌందర్యోపాసన ఫలితమే. శిల్పము వేదాధ్యయనము శిల్పి జీవితరథానికి చక్రములవంటివి. అని రామప్పకు సౌందర్యోపాసన తత్వమును బోధించెను.

షణ్ముఖస్థపతి తెలిపిన విషయమును, తన తండ్రి తెలిపిన శిల్ప మెల కువలు ఒకటిగానే తోచెను.

వెంటనే రామప్ప షణ్ముఖస్థపతిని తండ్రి వద్దకు తీసుకపోయి పరిచయం చేసెను. అవసాన దశయందున్న రుద్రోజుకు షణ్ముఖస్థపతిపై సంపూర్ణవిశ్వాస మేర్పడి రామప్ప పసివాడు వీని బాధ్యత స్వీకరించవలసినదిగా వేడుకొని అతని కప్పగించెను. ఈ విధముగా శిల్పులైన ముగ్గురి మధ్య అవినాభావసంబంధ మేర్పడి ఒక కుటుంబవ్యక్తులుగా మెలగసాగిరి.

వీరి ముగురి శాస్త్రచర్చలు రామప్ప పరిశోధనకు సహకరించినవి.

పాలంపేటయందును పరిసరములయందును భక్తిభావము, ఆధ్యాత్మిక చింతన సన్నగిల్లినందువలన సమాజము అదుపుతప్పి ప్రజలు దురాచారములకు దిగుచుండిరి. హత్యలు-మానభంగాలు-అక్రమాలు పెచ్చు పెరిగి విలయతాండవ మాడుచుండెను. దానవుడైన మానవుని అదుపులోనుంచగల శక్తి ఆధ్యాత్మిక ప్రబోధమునకేగలదు. మానవునికి అత్యంత ప్రీతికరమైనది తన ప్రాణము.

ఆ ప్రాణరక్షణకు సంబంధించిన విషయములన్నియు దైవభక్తి వలన సంతరించ గలవు. దైవశక్తులన్నియు దేవాలయములద్వారా పొంది మానవుడు పూర్ణజీవితమును గడుపగలడు. చదువంతగా ప్రచారంలో లేని రోజుల్లో వేదముల సారమంతయు శిల్ప రూపమున కథలు గాథలుగా అర్థమయ్యే భంగిమలలో రూపకల్పన చేసి ప్రదర్శించిరి. ఈ శిల్ప వాఙ్మయము ద్వారా తమతమ జీవన విధానములను సక్రమమార్గములో మలచుకొని సమాజము అదుపులోనుండి సుఖశాంతులతో జీవనం గడుపగలుగుతారు. అందుకొరకు దేవాలయములు విద్యావైజ్ఞానిక కేంద్రములుగా ఉన్నత స్థానములనాక్రమించినవి.

ఈ దేవాలయములు కేవలం రాజధానియందే కేంద్రీకరింపచేయక కొన్ని వందల గ్రామములకు కేంద్రమైన స్థానమందును, ప్రతిపౌరుని అందుబాటులో నుండుటకు ప్రతిగ్రామములో కూడ నిర్మాణం చేసియుండిరి.

పాలంపేట ప్రాంత ప్రజలు రుద్రప్ప వద్దకువచ్చి అచ్చట ఒక దేవాలయము నిర్మింపవలసినదిగా తమ అభిప్రాయమును తెలియజేసిరి. దేవాలయ నిర్మాణమనునది వ్యయ ప్రయాసములతో కూడినపని. రాజు ఆదరణ లేనిదే దేవాలయ నిర్మాణము సులభసాధ్యమైన విషయము కాదు. అని రుద్రోజు తెలియజేసెను. అప్పుడు సనాతన ధర్మపాలకులైన కొందరు ఆ ప్రాంతపు సైన్యాధికారులైన 'కాటయ, కుండయ'లకు విన్నవించిరి. వారు ఈ విషయమును చక్రవర్తియైన 'గణపతిదేవు'ల వారికి ప్రజల కోరికగా విన్నవించుకొనిరి. అప్పటికే పాలంపేటయందు దేవాలయము నిర్మించవలయునను అభిప్రాయము చక్రవర్తులకు కలిగియుండెను. సమర్థులైన శిల్పుల కొరకు వేచియుండవలసి వచ్చెను.

రుద్రోజు, తను నిర్మించిన త్రికుటాలయమైన వేయిస్తంభాల దేవాలయం తన్నుమించిన శిల్ప కళాశోభితమైన రుద్రేశ్వరాలయము తన కుమారునిచేత నిర్మింపచేయాలని, ఆదివ్య మంగళమూర్తిని కన్నులారాగాంచిన తర్వాతనే తన తనువును చాలించనునట్లు తన కోరికను రామప్పకు తెలిపెను. ఆ సర్వేశ్వరుని

నిర్ణయము ఎవరూ ఆపలేనిది. కొలది రోజులలోనే రుద్రోజు లింగైక్యము నొందెను.

రామప్ప అప్పటినుండి తన తండ్రి కోరిక నెరవేర్చుటకు అవకాశము నకై వేచియుండెను. తండ్రి పోయినప్పటి నుండి షణ్ముకస్థపతియే రామప్పకు తల్లి-తండ్రి, గురువై కాపాడుచుండెను.

ఏకశిలా నగరంలో గణపతిదేవ చక్రవర్తి యొక్క కూతురు రుద్రమదేవి, పదహారేండ్ల యుక్తవయస్సులో మిసమిసలాడు చుండెను. సాముగరిడీలు గుఱ్ఱపుస్వారీలు, ముష్టియుద్ధములు-యుద్ధతంత్ర విద్యలతోపాటు భరతనాట్యము-సంగీత సాహిత్యములయందారితేరియుండెను. తండ్రితోపాటు మగవేషములో చర్చావేదికలందును, కవి సమ్మేళనమునందును పాల్గొనుచు ప్రముఖులచే ప్రశంసల నొందుచుండెను. కీలకమైన రాచకార్యములందు తండ్రికి చక్కని సలహాలనిచ్చుచుండెను. రుద్రమకు దైవమునందు అమితమైన విశ్వాసము. ప్రతి వారము పద్మాక్షి దేవాలయం, భద్రకాళి దేవాలయమువకుపోయి తన భక్తి ప్రపత్తులను ప్రదర్శించుకొనేడిది. ప్రత్యేక సమయములందు తన చెలికత్తెలతో మారువేషమున పాఖాల-పాలంపేట మొదలగు ప్రదేశములకు వీరవిహారమునకై పోయి కేళీవిలాసముగా కాలము గడిపేది.





కాముని పున్నమి రోజున వనవిహారమునకై చెలులతో
భిల్లీ వేషములో వచ్చుట

---

రామప్ప హృదయంలో సౌందర్యోపాసనతత్వం వేధింపనారంభించె
సుందరమైన వనితల అన్వేషణకై రామప్ప ఆ పరిసర ప్రాంతము లయం
వెతకసాగెను. నీవొక్క స్త్రీని ప్రేమించుటవలన స్త్రీల తత్వం, స్త్రీ మార్ద
తెలియగలదు. అప్పుడు నీవు సజీవ సుందరీ శిల్పములను సృష్టించగల
అను షణ్ముకస్థపతి యొక్క సౌందర్యోపాసనతత్వం హృదయమును కల

పెట్టుచుండెను. భిల్లి, కోయ, లంబాడా, సంతాల, యువతులనుగాంచి సరియగు రూపసౌందర్యవతి కనుపించనందువలన, నిద్రాహారములు మాని తిరిగి తిరిగి విసుగుచెంది ఒక చెట్టునీడన ఒకరాతిపై కునుకుపట్టి నిద్రించుచుండెను.

అదే సమయంలో యువరాణి భిల్లివేషంలో చెలికత్తెలను వెంటబెట్టుకొని విల్లంబులు చేతబూని అవనప్రాంతమున వేటాడుచు తిరుగుచుండెను. అకస్మాత్తుగా రుద్రమ దృష్టి ఒక చిరుతపులిపై బడెను. వెంటనే రుద్రమ బాణము ఎక్కుపెట్టి చెట్లచాటునుండి చిరుతపులిని సమీపించుచుండెను. చిరుతపులి పొంచి పొంచి రామప్పను సమీపించుచుండెను. ముందువైపున ఆజాగా ఎవరో అలసి విశ్రాంతించుచున్నట్లుగా గాంచి, అతనికేమైన హాని కలుగునేమోయని వెంటనే బాణము ఎక్కుపెట్టి పులికి కొట్టెను. ఆ దెబ్బకు పులి పెద్దబొబ్బలు పెడుతూ అడవిలోనికి పారిపోయెను. రామప్ప ఒళ్ళుమరచి నిద్రించుచున్నందు వలన ఈ అలజడి అతనికి వినిపించకపోయెను. రుద్రమ అతనిని సమీపించి కాలితో తట్టిలేపెను. రామప్ప అయోమయంగా లేచి కూర్చుండెను. ఎదుట నిలిచిన భిల్లినిగాంచి నిర్ఘాంతపోయెను. అతను వెదకుచున్న రూపలావణ్యం ప్రత్యక్షముగా తన యెదుటనేగాంచి పరవశించిపోయెను. వనప్రాంతపు స్త్రీయొక్క వదనములో రాజసంఉట్టిపడుచుండెను. రామప్పకు కావలసిన ప్రేమమూర్తి నిండు చందమామ పోలిన ఆమె ముఖపద్మములో ఒక ప్రత్యేకతనుచూచి పెదవులు కదలించలేక పోయెను. అతని తీక్షదృక్కులకు రుద్రమ గిరుక్కున తిరిగి వనములోనికి వెళ్ళిపోయెను. రామప్ప త్రుళ్ళించి, ఆమెవైపే చూచుచుకూర్చుండెను. స్పృహవచ్చి ఆమె పోయిన వైపునకే నడచెను. కొందరు వనితలు గుట్టములపై వెళ్ళి పోవుచున్నట్లు గాంచి అమూల్యమైన వస్తువు దొరికినట్లే దొరికి చేయిజారి పోయినందుకు నిస్పృహచెంది బాధపడసాగెను. ఆమె కొరకు వెదకి వెదకి చివరకు ఎలాగో పాలంపేట చేరుకొనెను.

తానుగాంచిన సుందర మోహన మందహాసవదన మనస్సునందు నిలుపుకొని ఆశ్రమంలో శిల్పముల తయారుచేయుట మొదలిడెను. కనులు మూసినా, కనులు తెరచినా ఆమె రూపలావణ్యమే రామప్పను కలవరపెట్టుచుండెను.

నుండి వెడలి, చెరువు గట్టున విశ్రాంతి తీసుకొని సాయంత్రమువరకు ఏకశిలా నగరము చేరుకొనెను.

ఒకరోజు రుద్రమ తను స్వయంగా చూచిన త్రిలోచనాశ్రమంలోని శిల్పకళాఖండాల గురించి, వాటి వైభవమును గురించి, రామప్పయొక్క శిల్ప ప్రతిభనుగురించి తండ్రికి తెలియజేసెను. అంతటి మహాశిల్పిని ఆలయ నిర్మాణమునకుపయోగించుకొని అతనిచేత అమోఘమైన శిల్పములను వెలయింపజేయ వచ్చునని తండ్రికి సలహానిచ్చెను. కూతురు చెప్పిన ప్రతి అక్షరము శ్రద్ధతో విని తన సామ్రాజ్యములో ఒకమారుమూల గ్రామమున ఒక మహాశిల్పి యుండుట తన అదృష్టముగా భావించెను. గణపతిదేవునికి రామప్పపై సద్భావ మేర్పడి రాజధానికి పిలిపింపదలచెను. ఆనోట ఈనోట రామప్ప పేరు రాజధానీ నగరము వ్యాపించి మారుమ్రోగుచుండెను.

కాటయ, భాండయలు రాజభానిలో రామప్ప శిల్పకళాప్రతిభ ప్రశంసలు విని, వారికి తెలియకుండా వారి ప్రాంతమున ఒక కళాతపస్వియుండుట వారికాశ్చర్యము కలుగజేసెను. పాలంపేటకు తిరిగివచ్చిన తర్వాత వారికి ఆ శిల్పిని, అతని శిల్ప కళాఖండాలను చూడవలెనను తలంపుగలిగి, ఒకరోజు త్రిలోచన శిల్పాశ్రమమునకువచ్చి, అపురూప శిల్పకళాఖండాలను తదేక దృష్టితోగాంచుచు పరవశింప మొదలిడిరి. రామప్ప ప్రతిభను కొనియాడి అతని శిల్పములను మిక్కిలి ప్రశంసించిరి. కాటయభాండయల దృష్టి ఒక అపరూప లావణ్య సుందర శిల్పముపైబడెను. ఆ శిల్పముయొక్క రూపురేఖలన్నియు అచ్చుగ్రుద్దినట్లు యువరాణి రుద్రమను పోలియుండెను. ఒకరి ముఖము ఒకరు చూచుకొనిరి. వారి ముఖములపై క్రోధము ఆవేశించియుండెను. రుద్రమ ఒక మహా సామ్రాజ్యాధినేత కూతురు. అంతఃపుర అవివాహితకన్య. కాకతీయ మహా సామ్రాజ్యమునకు కాబోయే మహారాణి. కాటయ,భాండయల ఒడలు చెమటెక్కి మతి చెలించిపోయెను. విశ్వాస పాత్రులైన ఈ సేనానులు ఈ విషయమును, చక్రవర్తులకు తెలియజేసి తమ స్వామిభక్తిని నిరూపించుకొనదలచిరి. ఏదో విషయము రామప్పకు చెప్పి, అతనిని చక్రవర్తులవద్దకు తీసుకొనిపోయి రహస్య

ముగా రామప్ప తీర్చిదిద్దిన యువరాణీ శిల్పమునుగురించి తెలియజేసిరి. చక్రవర్తి కళాప్రియుడు, కళాపోషకుడు కావడంచేత, అప్పటికే ఆ ప్రాంతమున వేలాది ప్రజలకు అందుబాటులోనుండుటకు ఒక ఆలయ నిర్మాణమునకు సమర్థుడైన శిల్పికొరకు అన్వేషణలోనుండుటచేత, అతనిని శిక్షించుటకు బదులు తన ఏకాంతమందిరమునకు తీసుకపోయి అన్నివిషయములు తెలుసుకొనెను. రుద్రమ యింతకుముందే అతని ప్రతిభా విశేషములు చెప్పిన విషయములేకాక, స్వయముగా చక్రవర్తులు ఆయువ శిల్పినిచూచి ఆనందభరితుడాయెను. అతనిని శిక్షించుటకు బదులు ఒక విడిది ఏర్పాటు చేయించి అతని సేవకు పరిచారికలను ఏర్పాటు చేయించెను.

జాయప్ప సేనానులను - రుద్ర సేనానులను పిలిపించి రామప్పయొక్క శిల్ప కళాప్రతిభను తెలియజేసెను.

కాకతీయ సామ్రాజ్యమునకు గజసైన్యాధిపతియైన జాయప్ప 60సం॥ల వయస్సులోకూడా నాట్యమాడుటను మానలేదు. గ్రంథరూపములోనున్న నాట్య శాస్త్రమును శిలలయందు విన్యసించి తరతరాలకు ఆ శాస్త్రమును శాశ్వతపరుచుటకై ఆరాటపడుచున్న సమయములో రామప్ప తటస్థ పడుట తన అదృష్టముగా భావించెను.

ముగ్గురు కలసి రామప్పను విడిదినుండి రావించి, సావకాశంగా రామప్పతో ఆలయ నిర్మాణ విషయమై ప్రస్తావించిరి. రామప్ప దేవాలయమునకు సంబంధించిన ప్రకృతి శక్తుల అమోఘ విషయములను తెలియజేసెను.

చక్రవర్తి మరియు సేనానులు యువకుడైన రామప్ప తెలిపిన విషయములను విని ఆశ్చర్యపడి మీ తండ్రిగారి పేరేమని అడిగిరి.

రామప్ప తన తాత విశ్వకర్మ త్రిలోచనాచార్యులని, తండ్రి రుద్రోజులని తెలియజేసెను.

ఉన్మత్తస్థితికి చాలా రోజుల తర్వాత రామప్ప వైఖరిలో మార్పు కనిపించెను. ఏదో వెదకుచున్నట్లు ఏవేవో పరాకు మాటలు మాట్లాడుచున్నట్లు గోచరించు చుండెను.

వైశాఖ పౌర్ణమి రోజు పండుగను మహా వైభవముగా జరుపుకొనుట కాకతీయులకు ఒక ప్రత్యేకాచారము. ఆనాడు వివిధ వర్గముల స్త్రీలు వివిధ రంగుల వస్త్రములు ధరించి, శిఖనిండా పూలు ముడుచుకొని వసంత లక్ష్మి మాదిరిగా కనబడుదురు. ఉత్సవాలు, వేడుకలు, కోలాటములు, జాజరపాటలతో ఆడుచూ పాడుచూ పురుషులతోపాటు పాల్గొందురు. ఆనాడు రాజధానీ నగర మంతయు కన్నులపండువుగా అలంకరించి ఆబాలగోపాలము వేడుకలయందు పాల్గొని ఆనందించుదురు. పేద, సాద, ధనికుడు, దరిద్రుడు మొదలు రాజ వంశపు పురుషులు-స్త్రీలు, సమానత్వం, సౌభ్రాతృత్వంతో వేడుకల ఆనందమును సమానముగా పంచుకొనెడివారు. ఆ రోజు వీథివీథి మొదలుకొని రాజమార్గము లన్నియు రాజభవనములన్నియు కన్నులపండుగా మన్మధ రాజధానిగా కనబడు చుండెడిది. ప్రత్యేకముగా యువరాణి రుద్రమదేవి సాక్షాత్తుగా రతీదేవివలె కనిపించుట వేడుకలందు పాల్గొనుట అందరితోకలసి పాడుట ఆచారమైయుండెను పౌర్ణమియొక్క ప్రభావంతోనే ఒడలు పులకరించి, పరవశించి నాట్యమాడెడివారు.

రుద్రమ ప్రత్యేకంగా ఈ పున్నమి రోజున వెన్నెల తాపమునే విరహ వేదనకు తట్టుకొనేది.కాదు. వేడుకల అనంతరం యువరాణికి వనవిహారము కు పోవుట అలవాటు. రాజధానియందు ప్రజలందరూ వేడుకలయందుండగా, యువరాణి మారువేషంలో చెలులను వెంటదీసుకొని ఊరూరా జరుగు ఉత్సవము గాంచుచు పాలంపేటచేరి చెరువుగట్టున సేదదీర్చుకొని సద్దులారగించి విశ్రమించుచుండేడిది.

ఒకరోజు వేటముగిసిన పిమ్మట అలసిపోయి పాలంపేటకువస్తూ ఎవరి నోటనో శిల్పముల, శిల్పాశ్రమముయొక్క విషయమును తెలుసుకొనెను. రుద్రమకు శిల్పములనిన, చిత్రములనిన పరవశించి పిచ్చెక్కిపోయేడి మన

స్త్రీత్వంకలదు. రుద్రమకు అలసటయున్నను ఆశ్రమమునకుపోయి శిల్పములను చూడవలయుననెడి కోరిక గలిగి చెలువలతో ఆశ్రమం ప్రవేశించినది.

రామప్ప, అతని శిష్యులు శిల్పములు చెక్కుటయందు నిమగ్నమై యుండిరి. వచ్చినవారిని రామప్ప గమనింపలేకపోయెను. రుద్రమదేవి, చెలికత్తెలు అలసట మరచి తదేక దృష్టితో శిల్ప కళావైభవమును చూచుచుండిరి. అందులో ఒక శిల్పముయొక్క రూపురేఖలన్నియు అచ్చముగా రుద్రమదేవి కవళికలను పోలియుండెను. ఒక చెలికత్తె రుద్రమ శిల్పమును జూపించెను. రుద్రమ ఆశ్చర్యపడి పైకి గాంభీర్యము నటించుచు లోలోన మురిసిపోవు చుండెను. నేరుగాపోయి రామప్పచెక్కుచున్న శిల్పంవద్ద నిలబడితదేక దృష్టితో రామప్ప మన్మధరూపమును గాంచుచుపరవశించిపోయెను.

కాకతీయ రాజులు కళాభిమానులు, కళాపోషకులు, కళలయందు అమితమైన అసక్తిగలవారు కావుననే ఎన్నెన్నో కళాఖండములు వెలసినవి వారి కీర్తి ప్రతిష్టలు తారాస్థాయికి పెరిగి దేశదేశములయందు వారికీర్తిని యినుమడింపజేసినవి, రుద్రమ ఆ రక్తమునే పంచుకొని పుట్టిన ఆడపడుచు, కావున మూర్తీభవించిన కళాకౌశలముగల రామప్పయొక్క కళకు, అతని రూపురేఖలకు అకర్షింపబడుట, అందులో యువతులకు ప్రకృతి సహజమైన కోరికలుండుట ప్రత్యేక విశేషము. కొబట్టి కళాదృష్టిలో రామప్పపై సదభిప్రాయంతో అతనిని మనసారా ప్రేమించియుండుట సహజమైన విషయము. ఇదంతయు పనిలో లీనమైయున్న రామప్ప గమనించలేకపోయెను. తన ప్రక్కవైపు తీలగా కనబడుచున్న వ్యక్తులను తలపైకెత్తి చూచెను. అచ్చముగా ఆనాడు అడవిలో చూచిన ఆ దివ్యమోహన రూపమునేగాంచి, అతని శరీరం పులకించి అనిర్వచనీయమైన విద్యుత్తు శరీరమున ప్రవహింపసాగెను. అవే కళ్ళు. అవే చెక్కిళ్ళు యిన్నాళ్ళుగా తన హృదయమున ఆరాధించుచున్న ఆ దివ్యరూపమును నేడు ప్రత్యక్షముగా మనసార గాంచుచుండెను. రుద్రమ మైమరచి రామప్పనే చూచుచూ స్తంభించిపోయెను. రామప్ప చూపులకు రుద్రమ కలవరపడిపోయి కనుసైగలతో చెలికత్తెలను బయటికి రమ్మని చెప్పి పరుగు పరుగున ఆశ్రమము

అంతట "చక్రవర్తి" వారు తమ తండ్రి తాతలనాడ్ద అమోఘమైన శిల్పా చాతుర్యమును ప్రదర్శించి గౌరవింపబడ్డవారని తలచి ఎంతో ఆనందపడెను.

రామప్పను రాజలాంఛనములతో గౌరవించి, తమవద్ద సిద్ధముచేసి యుండిన దేవాలయ తల విన్యాసపదకమును రామప్పకిచ్చి పునఃపరిశీలనగావించి, పరిసరములను పరిశోధించి, దేవాలయ తుదిస్వరూప తలవిన్యాస పధకమును సమర్పించుటకు అజ్ఞనిచ్చిరి.

రామప్ప హృదయంలో ప్రజ్వరిల్లుచున్న దేవాలయ నిర్మాణ విషయము నకు సదవకాశం లభించినందులకు ఉప్పొంగిపోయి, తన వంశదైవమైన విశ్వ కర్మ భగవానుని మనసారా స్మరించుకొని చక్రవర్తి కోరికను మహాప్రసాద ముగా భావించి వెంటనే పాలంపేటకు చేరుకొనెను. ఈ విషయమును అనంత రావుశర్మకు, తన మిత్రులకు శ్రేయోభిలాషులకు, శిష్యులకు తెలియజేసెను. రామప్ప శిల్పి మాత్రమేకాక సకల శాస్త్రములు నేర్చిన దివ్యజ్ఞాన సంపన్నుడు కావడం ఒక విశేషము.

## ఆలయ స్థల నిర్ణయము వాటి వివరములు

మన దేశములో ముఖ్యముగా ఏకకూట-ద్వికూట-త్రికూట-చతుష్కూట పంచకూట-యుగళ దేవాలయములు కానవచ్చును. మన దేవాలయములు కేవలం మత దృష్టితో కాకుండా సామాజిక శ్రేయస్సుకు భద్రతకుకూడ ప్రాముఖ్యతను సంతరించుచున్నవి. విద్యలు-లలిత కళలు అభ్యసించుటకు, దేవుని సేవకై సంగీత-భరతనాట్యములు అవసరమైనందున ఆలయములందు రంగమండపములు నిర్మింపబడినవి. దీన, అనాదులకు అన్నదానములు జరుపుటకు సత్రములు, అత్యవసర చికిత్సా సౌకర్యమునకు ఆతురాలయములు, యుద్ధ సమయమున ప్రజలకు రక్షణ కల్పించుటకు సొరంగమార్గములు, దుర్భేద్య ప్రాకారములు-ధాన్యాగారములు నిర్మింపబడెడివి. పురాణ శ్రవణములు-హరికథలు-గానకచేరీలు

వసంతోత్సవములు—న్యాయనిర్ణయసభలురాజసన్మానములు-కళ్యాణములు-కర్మలు మొదలుకొని ఆలయములు బాహుళార్థ ప్రయోజనములతోకూడి సర్వతోముఖ వికాస కేంద్రములుగా వెలసినవి.

ఒక దేవాలయంయొక్క వాస్తు నిర్మాణం ఆ దేశస్తుల మేధస్సును, వైజ్ఞానిక సాంకేతిక ప్రతిభను ప్రతిఫలింపజేయును. భారతీయ సంస్కృతికి సారము—ఆధ్యాత్మిక రహస్యముల ప్రతిబింబ రూపకల్పనలే దేవాలయ వాస్తు శిల్పములు—దేవాలయమున వారు శిల్పరూపవిగ్రహమును ప్రతిష్ఠించి, పూజించు పవిత్ర గృహం. ఆలయమును రమణీయ ప్రదేశమునందు నిర్మింపవలెనని వాస్తు శాస్త్రములు చెప్పుచున్నవి.

తీర్థానేతటనీతటే జలనిధేస్తీరే సరిత్సంగమే
శైలాగ్రేదితటే వనోపవనయోరుద్యానదేశేతథా ।
సిద్ధాద్యాయ తనేషుజా గురువరోగ్రామే రేవుపత్తనే
దేశే అన్యత్ర మనోహరమే సుర (వసత్యర్థం) శీతాంకల్పయేత్ ।

పుణ్యక్షేత్ర సమీపమునందున, నదీ తీరమందున, సముద్రతీరమందున నదీసంగమ స్థానమందున, పర్వతాగ్రమునందున, పర్వత పార్శ్వమునందున వనమునందున, రమ్యప్రదేశమునందున దేవాలయం నిర్మించుట యోగ్యమైనది. అందుచే "రామప్ప దేవాలయం" పైన తెలిపిన పర్వత ప్రదేశములు, అరణ్య ప్రదేశములుగల సుందరమైన స్థలములో కలదు.

వాస్తుశిల్పములు సమప్రమాణములోనుండును. కాకతీయ కాళికా దేవా లయ నిర్మాణమునందలి విశిష్టతయని గుర్తింపబడినది.

దేవాలయములు, సంక్షేపంగా పరమేశ్వరుని బాహ్యసృష్టిని దేహాంతర్గతమైన జీవప్రకృతిని, వాస్తుశిల్పముల ఆధారముతో భక్తునకు జ్ఞప్తికలిగించుటకు నిర్మింపబడినవి. ఇది మూర్తి పూజాతత్వము.

సగుణోపాసనయందు, జీవాత్మకు పరమాత్మకుగల సంబంధములను అభ్యాసమొనరించునపుడు చిత్తవృత్తులననుసరించి అధికార బేధములుండుట తప్పదు. అందుచేత పూర్వుపాసకుని అన్నమయ-ప్రాణమయ-మనోమయ-విజ్ఞానమయ - ఆనందమయి కోశములకు ఉత్తరోత్తర సాక్షాత్కారము జేసుకొనుటకు శిల్పరీతులు ఉద్భవించినవి.

దేవాలయ నిర్మాణ పద్ధతికి, యజ్ఞవేదిక నిర్మాణ పద్ధతియే మూలము. వైదిక స్తూప చితులనుండియే బౌద్ధ - జైన స్తూప చైతన్యములను, యజ్ఞశాల నుండియే విహార సంఘారామములుగా ఉద్భవించినవి. ఏ నిర్మాణమునకైననూ దాని తల విన్యాసము (Ground Pian) ననుసరించి ఉపరిభాగము తీర్చబడును.

కట్టడములమీది భాగమును శిఖర-శిఖా-శిఖాస్త-శిఖామణి అని విభజింపబడి మూలమునుండి శిఖరమువరకు చతురస్రాకారముగనుండునది. నాగర రీతి యనియు, షడస్ర, అష్టాంగముగనుండునది ద్రావిడరీతియని, వృత్తాకారముగ నున్నవి వేసరరీతియని చెప్పబడినది.

హిమాలయముల నుండి వింధ్య వరకు సాత్విక దేశము.
వింధ్య నుండి కృష్ణానది ప్రదేశమంతయు రాజస దేశము.
కృష్ణానది నుండి కన్యాకుమారి వరకు తామస దేశము.

సాత్విక దేశమును నాగరమనియు - తామస దేశమును వేసరమనియు రాజస దేశమును ద్రావిడమనియు హర్మ్యములేర్పడినవి.

నాగరము పురుష రూపము-వేసరము నపుంసక రూపము-ద్రావిడము స్త్రీ రూపము, ద్రావిడమునకు బ్రహ్మ-నాగరమునకు విష్ణువు-వేసరమునకు మహేశ్వరుడు అధిపతులు-

ప్రధానముగా హిందూ దేవాలయములు పుణ్యక్షేత్రములనియు, పుణ్య తీర్థములనియు రెండు విధములు. ఇందులో శుద్ధము–మిశ్రమము–సంకీర్ణము అని మూడు రకములు. ఇందులో శుద్ధము శ్రేష్ఠమైనది–

క్షేత్ర (స్థల) ప్రాధాన్యత గలిగి గ్రహప్రభావానికి అనుకూలముగానుండి గ్రహశక్తులను ఆకర్షించగలచోట నిర్మించిన దేవాలయమునకు పుణ్యక్షేత్రము లనియు, జల ప్రాధాన్యత కలిగి ఆ జలములో ఖనిజములు, ఔషధులు మొద లగునవి కలిగియుండి మానవ దేహమునకు ఆరోగ్యమునకు అనుకూలముగా నుండి జలసమృద్ధిగలచోట నిర్మించిన దేవాలయమునకు పుణ్యతీర్థములని ప్రతీతి.

కొన్ని ప్రత్యేక తిధులయందు, కొన్నిచోట్ల గ్రహప్రభావము కేంద్రీ కరింపబడును. వాటిననుసరించే ఉత్సవములు ఏర్పాటు చేయబడును. ఆ ఉత్స వములందు అధిక సంఖ్యలో ప్రజలు పాల్గొని మానసిక పవిత్రత ద్వారా, మానసిక ఏకాగ్రతద్వారా దైవశక్తినిపొంది – శారీరక, మానసిక, బాధలనుండి విముక్తి పొందుటకు మన ఋషులు దినారాత్రములు తపస్సుచేసి పరిశోధించి మనకు ప్రసాదించిన వరములే ఈ దేవాలయములు, సాంప్రదాయములు, సంస్కృతులు మొదలగునవి.

పాపమనగా ప్రకృతి సాంప్రదాయములకు వ్యతిరేకముగా ప్రవర్తించి నందువలన శరీరము విషపూరితమై భయంకర రోగములకు గురియగుట. మానసిక పవిత్రత గలిగి మన సాంప్రదాయానుసారముగా సత్ప్రవర్తనులై సదాచారముతో మెలగుటవలన శరీరమందలి తొలగించబడుటనే "పుణ్యము" వి యందురు.



చుట్టూ పర్వత శ్రేణులు, అడవులు జలసమృద్ధిగల తటాకములు, అధిక శాతం ప్రాణవాయువుగల ఒక ఎకరము నేలను పరిశోధించి ఆలయమునకు యోగ్యమైనదిగా నిర్ణయించి శైవమెక్కువగా భాసించునట్లుగా వైష్ణవము శాక్తికమును కూడా మేళవింపజేసి సర్వ దేవతలకు సమాహారముగా ఏక కూటాలయమునకు ఒక పథకమును సిద్ధముచేసి గణపతి దేవునికి సమర్పించెను.

గణపతి దేవచక్రవర్తులు, శైవ పండితుడూ రాజ గురువు అయిన "విశ్వేశ్వర శివాచార్య"లను ఆస్థాన స్థపతి "కానోజు"ను జ్యోతిషశాస్త్రవేత్తలను ఆగమశాస్త్ర పండితుడు అయిన "విశ్వేశ్వర దేశికు"లను రావించి రామప్ప సమర్పించిన పథకమును పరిశీలనకై వారిముందుంచెను.

సమర్పించిన పథకములో ఆయా ప్రత్యేక తిథులయందు గ్రహనక్షత్రాది కూటమియొక్క ప్రభావము. ఆప్రాంతమున కేంద్రీకరింపబడుటకు ప్రవేశ పెట్టబడిన దైవశక్తుల విధానములు. తద్వారా మానవునికి పాప విముక్తి గలిగి ఆరోగ్యముచేకూరు దైవశక్తుల శాస్త్రీయ రహస్యములు. ఆధ్యాత్మిక చింతన ద్వారా ప్రజలలో నైతిక విలువలుపెరిగి సత్ప్రవర్తనులై ఐకమత్యాలతో పూర్ణజీవితమును పొందు విధానములు పండితుల యొక్క స్వయముగా గణపతిదేవ చక్రవర్తి యొక్క ఊహలను. సిద్ధాంతములను తర్జనభర్జనలు చేసివేసినవి. అందరికి రామప్ప ప్రజ్ఞావిశేషాలయందు రుద్రమ చెప్పిన ప్రతిఅక్షరము యధార్థములను విషయమును జాయప్పరేచర్ల రుద్రుడు చక్రవర్తులు గ్రహించిరి వారి చిరకాలవాంచితమైన ఆలయ నిర్మాణమునకు తగిన శిల్పి దొరికినందుకు సంతసించిరి. ఒక శుభముహూర్తమున రామప్పకు తాంబూలములనిచ్చి. నూతన వస్త్రములనిచ్చి. రేచర్ల రుద్రసేనాని నేతృత్వములో రుద్రేశ్వరాలయము నిర్మించుటకు నిర్ణయముగైకొనిరి రేచర్లరుద్రుడు శివభక్తుడు జాయప్ప వైష్ణవభక్తుడు.

సప్తదేశములయందు శిల్పనిపుణులు. శిల్పశాస్త్రవేత్తలు శిల్పశాస్త్ర విభాగ

ములతో ప్రత్యేక పద్ధతులయందు నిపుణులైన వారినిగుంచి తెలుసుకొని రామప్ప యిష్టప్రకారము రామప్పకు సహకరించుటకు దేశదేశములనుండి శిల్పకళా విభాగములలో అనుభవమున్న నేర్పరులైన 100 మంది శిల్పులను. వారికియిరత్రి సహకరించుటకు 200 మంది శిల్పకార్మికులను. శిల్పకార్మికులను పిలిపించిరి. బరువైనగండశిలలను ఎత్తి తెచ్చుటకు ఏనుగులను. గుర్రములను. ఎడ్లబండ్లను 15, 20 రోజులలో సమకూర్చిరి. ఆలయనిర్మాణమునకు శిల్పులకు, శిల్పకార్మికులకు వలయు ధనమును ప్రభుత్వ ధనాగారమునుండి ఏర్పాటు చేయించెను. వారికి భోజన వసతికై 35 మంది వంటవాండ్రను ఏర్పాటు చేయించెను. శిల్పుల కుటుంబాల సంరక్షణ మరియు ఖర్చులనుకూడ భరించుటకు చక్రవర్తి స్వయముగా అన్ని ఏర్పాట్లు చేయించెను. శిల్పము శిల్పవిభాగము అన్నిరకముల శిల్పులు నిర్ణయించిన గురువు ప్రకారము పాలంపేటకు చేరుకొనిరి.

రామప్ప నిపుణుడైన కాకతీయశిల్పి "త్రిపురారి"ని మరి ఎనమిదిమంది కాకతీయ శిల్పులను ప్రధాన సహాయకులుగా నియమించుకొనెను. త్రిపురారి వయసు మీరిన అనుభవజ్ఞుడు. రామప్పకు సమతుల్యుడు. ఇతడు శిలలను సంధానించుటలోను శాసన స్తంభములపై శాసనములను చెక్కుటలో సిద్ధహస్తుడు పూర్వ కాకతీయుడు. మిగతా ఎనమిదిమంది కాకతీయ శిల్పులను ప్రధాన మండపస్తంభములను చెక్కుటకు కార్యశిల్పములు చెక్కుటకు నియమించుకొనెను.

శిలలను పరీక్షించుటకు మరియు దేవాలయ ద్వారములకు మూడువైపుల యుండు కవచ్ఛేదనములు చెక్కుటకు "భైరవశిల్పి"ని నియమించెను. ప్రధాన మంటపమునకు నంది శిల్పులను అప్పుడుకు నేరదులైన నాగలింగస్వామి భద్రశేఖరస్వామి భుజంగపతి కుమారస్వామి భవభూపతి కాశీపతి మొదలగు దాక్షిణాత్య శిల్పులను సహాయకులుగా నియమించెను.

స్తంభముల విలుగువనులను నగిషిపని ను, చేయుటకు రామారిష్ట

పతి"ముఖ్యుడుగా మారన్న, బసవాచార్యులు, విజయుడు, నాగశిల్పుడు సహాయకులుగా మొదలగు శిల్పులను నియమించెను.

ఆలయ పీఠ భాగమును నిర్మించుటలో "నంది భట్టారకుడు" ఆరితేరిన శిల్పి, ఇతడు హొసల దేశమునకు చెందినవాడు. ఇతనికి సహాయకులుగా కొంత మంది యువశిల్పులను నియమించెను, వీరు శిల్పశాస్త్రములో ఆరితేరినవారు.

సంధాన శిలాఫలక శిలములను. తోరణద్వారములను. గర్భాలయద్వారములను చెక్కుటకు "భైరవు"న్ని అతనితోవచ్చిన చాళుక్యశిల్పులు దేవోజు-కాలనాగు--బమ్మోజు-చిన్నగరాయన్న-జక్కోజు-రాయన్న-పద్మోజు-శుభ్రకీర్తి-మొదలగు యువ శిల్పులను, నియమించెను.

విమానములు-హారములు-పూలమాలలు-పద్మకోశములు-కుడ్యశిల్పములు కామశాస్త్రమునకు సంబంధించిన శిల్పములు మొదలగు నగిషీ పనులుచేయుటకు సిద్ధహస్తులైన 25మంది కాకతీయ శిలులను నియమించెను. యింకా రాతి మూలములను తరవణి పట్టుట నునుపుచేయుట మొదలగు పనులను చేయుటకు అదనముగా కొంతమందిని. ఏర్పాటు చేయించెను.

పైకప్పు శిలాఫలకముల నిర్మాణమును ప్రధాన మంటపం పై భాగమునకు మహాపద్మరాజమును శిల్పించుటకు వృద్ధుడు అనుభవజ్ఞుడు అయిన కాకతీయ శిల్పి "భద్రప్ప"ను నియమించెను.

పైకప్పు మూలములలో తట్టు భాగములకు శివలీలలు. దేవతా శిల్పములు సముద్రమథనము. దశావతారములు. ఆలయ అంతర్భాగమునగల ప్రధానద్వార శిల్పములు. గర్భాలయద్వారము. ద్వారశిల్పములు ఆద్వారమునకు పైభాగమున ఎదురుముఖముగా లక్ష్మీదేవి శిల్పము. ఆలక్ష్మీదేవి శిల్పమునకు అడుగు భాగమున 5-దళములు అష్టకోణములుగల పద్మమును. నందీశ్వరుని శిల్పము

శిల్పశాస్త్రమికులు శిలలను సంస్కరించిన తర్వాత ప్రధాన శిలా పరీక్షకుడు "భైరవాచార్యు"లు ఒకరాతిలోట్టిలో మంచి గంధము యొక్క ద్రవమును నింపి ప్రధానమైన గండశిలలకు గంధమును పూయించి సమానముగా తడియారిన శిలలను యోగ్యమైనవిగాను అక్కడక్కడ తడియారకున్నచో అయోగ్యమైనవిగా నిర్ణయించుచుండెను.

మరికొంతమంది శిలా పరీక్షలు చేయుచుండిరి అవి స్త్రీ శిలలో, పురుషశిలలో, గర్భిణిశిలలో, నపుంసక శిలతో లేక సంకరశిలలో పరీక్షించి యోగ్యమైన వాటిని శిల్పములకు ప్రత్యేక స్థలములయందు చేయసాగిరి.

పురుషశిలలు పురుష శిల్పములు చేయుటకును. స్త్రీశిలలను స్త్రీ మూర్తులు గాయుటకు నపుంసకశిలలను పీఠములు, ద్వారములు చేయుటకు నిర్ణయించుచుండెను.

పురుష శిలలలో నాదము, జ్యోతిని లక్షణములు విశేషముగా నుండును ప్రయోగించుట వలన నాదము తెలియును ఖండించుటవలన నిప్పురవ్వలు వెలువడును అట్టివానిని ప్రత్యేకస్థలములయందు పేర్చసాగిరి.

ప్రకృతి నుండి దైవశక్తులను విడదీయ సామర్థ్యముగల శిలలను విగ్రహములుగా మలచుటకు ఉపయోగింతురు. విగ్రహమనగా విడదీయు తత్వము గలది అనిఅర్థము అలాంటి శిలలలో మలచ బడినదే మూలవిగ్రహముగును.

...నామపర్యాయము చే విగ్రహము శిల్పము చేయుట శిల్పశాస్త్రసమ్మతము కాదు ఇది విగ్రహములు,శిల్పముల యందుగల ప్రధానవ్యత్యాసము.

దేవాలయమునకు సంబంధించిన ప్రత్యేక భాగములను ఆయాశిల్పులు. శిల్పించమొదలు పెట్టిరి.

రామప్ప ప్రతిసాయంత్రము శిల్పులు పనిచేయున్న ప్రాంతమునకు

ఘోంఖపర్యవేక్షణ జరిపి సలహాలిచ్చుచుండెడివాడు.

శిల్పాచార్యులు మందిర నిర్మాణత విషయమై. శాస్త్రపరిశీలన శాస్త్రజ్ఞులు జరుపుతు శాస్త్రానుకూలముగా నిర్మాణము జరుపబడుచుండెను.

ఇది రుద్రేశ్వరాలయము అందులో ఏకకూటాలయమునకు ఒకటే తూర్పు,దక్షిణము మరియు ఉత్తరము మూడువైపుల మూడుద్వారములు. మూడువిభిన్న మతసాంప్రదాయము సారము. ఒక్కటేయను భావమును తెలుపుట. ఈమందిరనిర్మాణము యొక్క ఉద్దేశము శైవము వైష్ణవము,శాక్తేయ-ములను ఒకే ఆలయమందు కేంద్రీకరింపబడినవి.

వేయిస్తంభాల దేవాలయము త్రికూటాలయము ఆలయమునకు ఒకటే మార్గముగలదుగాని.ఒకేఆలయమున మూడుదేవతావిగ్రహములను ప్రతిష్ఠించిరి.

రుద్రోజు ఏకత్వముతో భిన్నత్వమును ప్రవేశపెట్టగా రామప్ప భిన్నత్వములో ఏకత్వమును ప్రవేశపెట్టెను.




రామప్ప శిల్పి చేసి గణపతిదేవునికి సమర్పించిన దేవాలయతలవిన్యాస పథకము

# దేవుడు - దేవాలయము

దేవుడు:- దివుక్రీడా విజిగీషా వ్యవహారద్యుతి
మోదమద స్వప్న కాంతిగతిషు

ఈ ధాతువు నుండి దేవ శబ్దము సిద్ధమగు చున్నది. క్రీడా శుద్ధమగు జగత్తును క్రీడింప జేయువాడును, విజిగీషా = ధార్మికులు జయింప వలయునను ఇచ్ఛ గలవాడును, వ్యవహార = అన్ని ప్రయత్నములకు సాధనోప సాధనముల నిచ్చువాడును, ద్యుతి = స్వయ ప్రకాశ స్వరూపుడును అన్నిటికిని ప్రకాశకుడును స్తుతి = ప్రశంసకు యోగ్యుడును, మోద = తాను ఆనంద స్వరూపుడై ఇతరులకు ఆనందము నిచ్చువాడును, మద = మదోన్మత్తులను తాడించువాడును స్వప్న = అందరి శయనార్థము రాత్రి ప్రళయమును జేయువాడును, కాంతి = జ్ఞాన స్వరూపుడగుటచే పరమేశ్వరునకు దేవుడని పేరు.

యోగులు తపశ్శక్తి సంపన్నులు. దివినుండి వచ్చు ఈ శక్తిని యోగ శక్తిచే సాధించుకొని పరిపూర్ణ జీవితమును గడిపిరి. ఈ దివ్యశక్తి సామాన్యులు సాధించలేరు. కాబట్టి ఈ దైవశక్తిని ఆలయమున ప్రవేశపెట్టి సామాన్య ప్రజలకు సంక్రమింప జేసి విశ్వ మానవ కళ్యాణం సాధించిరి.

## ఆలయము - స్థాపి

ఆలయ గోపురమును విమానమునియు కూడా అందురు. ఈ గోపురము ప్రస్తరము నుండి శిఖరము వరకు వ్యాపించి యుండును. విశ్వ శక్తులు స్థాపి ద్వారా గర్భాలయము యొక్క విమానమును పీటి కంటె తేలికయైన ఇటుకలతో నిర్మాణము చేయబడినది. ఈ ఇటుకలు ఏ పద్ధతితో, ఏ పదార్థముతో చేయబడినదో యిప్పటి శాస్త్రవేత్తలకు తెలియుటలేదు. ఈ రకమైన ఇటుకలు భారత దేశములోని దేవాలయములందే కాక ప్రపంచములోని ఏ దేవాలయమునకు ఈ పద్ధతిలో తయారు చేయబడిన ఇటుకలు వాడలేదు. శిల్ప విజ్ఞానమునకు వాడిన ఇటుకలు శాస్త్ర విజ్ఞా[illegible]నకు మచ్చు తునక వంటిది.



"దేవాలయ నిర్మాణమును గూర్చి సహాయ శిల్పులకు సలహాలిస్తున్న రామప్ప"

ఈ ఆలయ గోపురము గోముఖము వరకు ఆకర్షణ శక్తి కలిగియున్నది. ఈ శిఖరమునకు ఒకస్తూపి అమర్చబడి యుండెను. (ఇప్పుడది శిథిలమై యున్నది) ఈ స్తూపి సాధారణముగా ఇత్తడి, రాగి, బంగారము లేక పంచ లోహములతో తయారు చేయబడియుండును. ఈ స్తూపి శైవ సాంప్రదాయ దేవాలయమునకు, వైష్ణవ సాంప్రదాయ దేవాలయమునకు ఆకారములలో భేదమున్నప్పటికి ధాతు స్తూపి ప్రధానమైన భాగముగా నిర్మాణము చేయబడినది. స్తూపి లేకుండా ఏ రకమైన దేవాలయములు నిర్మించుట శాస్త్ర సమ్మతము గాదు.

ప్రపంచములోని వివిధ సాంప్రదాయములు గల దేవాలయములకై కూడా ఈ స్తూపి కానవచ్చును.

రూపములేదని అంతటను వ్యాపించి యున్నాడని మన ప్రాచీగ్రంధములు తెలిపి యున్నవి. "ఇందు గలడందు లేడను సందేహము వలదు చక్రి ఎందెందు వెతికి చూచిన అందందే కలడు" అనువాక్యములోని భావములో ఎంత శాస్త్రవిజ్ఞానము యిమిడియున్నదో ద్యోతకమగుచున్నది.

కావున ఎఱుపు-నారింజ రంగులమధ్యన వెలువడు "పరారుణ కిరణములు" వీటిని "ఇన్ ఫ్రారెడ్ రెస్" అని ప్రస్తుత శాస్త్రవేత్తలు తెలుపుచున్నారు.

ఈపరారుణ కిరణములను సంస్కృతములో "రుద్రు" అను పేరుతో వ్యవహరించిరి. స్తూపిఈపరారుణ కిరణములను లాగి ప్రస్తరముద్వారా గర్భగృహములో ప్రవేశపెట్టును. ఈసౌరశక్తిలోని పరమాణుశక్తిని పలుపేర్లతో మన వేదములలో వర్ణింపబడినది. "పరమాత్మ" (విశ్వవ్యాపితమైన సౌరశక్తి) విశేష రూపములో యున్నాడు. అతడే నాశరహితుడు, అంతర్యామి. అతడే శుద్ధ చిద్రూపుడు అతడే "స్వరాట్"

దే.తా॥ దేవాలయము మానస్తూప్యగ్రభాగము సూక్ష్మాతి సూక్ష్మముగా గ్రహించుగును. పరమ అనగా సూక్ష్మాతి సూక్ష్మమైన శక్తి ఆశక్తి యొక్క భాగము జీవులలో వ్యాపించియున్నది. దీనినే ఆత్మయని అందురు. సూక్ష్మాతి సూక్ష్మముగా ప్రస్తరమార్గము నుండి బయిల్వెడలిన అగ్నిజ్వాల స్తూప్యగ్రము నుండి బయల్వెడలి విశ్వవ్యాపితమైన దివ్య శక్తులను గ్రహించును.

"శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మన విద్యతే స్మృతి అను ప్రమాణము ఇటువంటి ఉపపత్తుల నుండి ఆవిర్భవించినదై యున్నది.

ఈ విధముగా అనగా దేవాలయము విమాన స్తూప్యగ్ర భాగము నందు "పరమాత్మ" ప్రకాశించుచుండెను. అను ప్రమాణము అన్ని దేవాలయములకు వర్తించును.

మొత్తము దేవాలయము యొక్క మహిమ విశేషము-అంతయు. స్తూప్యగ్రభాగమునకు చేరును. శాస్త్రీయమంతమైన కాలము, వర్తియను దేవాలయముండగా ధ్యానము, అర్చనలును అగ్నితో దీపము వెలిగించినపుడు ప్రకాశము వివ్వగలదని ఆలోక్తి.

విశేష వివరణ—శబ్ద ప్రాధాన్యత. స్వర ప్రాధాన్యతగల స్వర తరంగములు. విశ్వవాపితమైన సౌరశక్తిని గ్రహించి శరీరమందు చేర్చుటకు కూడా ఒక ప్రత్యేకవిధానము గలదు ఇవిశాస్త్రబద్ధమైన మంత్రముల ద్వారా జరుపబడు ప్రక్రియయైయున్నది. మంత్రములందు దహరించిన ఈశ్వరుడే అవ్యాకృత స్వరోపుడుగా చెప్పబడుచున్న "శివలింగము" నందు ప్రవేశించునని స్మృతి ప్రమాణముగలదు. శివ లింగమునగా ఇచ్చట దేవాలయమందు కనబడు శివలింమేకాదు అఖిలాండకోటి బ్రహ్మాండములకు మూలప్రకృతికి మూలకారణము అని తెలియవచ్చెను. దీని చిహ్నమే శివలింగము వేదములలో చెప్పబడిన శతరుద్రీయ మంత్రములందు మహేశ్వరునియొక్క విశ్వరూపము అంతయుచెప్పబడినది.

ఈ మహేశ్వరునే "నారాయణుడు" అనిచెప్పెదరు మిగిలిన విషయములన్నియు దాదాపు సమానమని తెలుసుకొనవచ్చును.

మంత్రములందుదహరించిన మహేశ్వరుడేశైవ సందర్భమున శివుడును నారాయణుడు అనితెలుకొనవచ్చును.

శైవ మతగ్రంథములో విష్ణువు యొక్క నామమును. గౌణముగా గ్రహించి సర్వం విష్ణుమయం జగత్—సర్వం శివమయం జగత్ అను విధానమున సిద్ధాంతములను చేసిరి.

శివ, నారాయణ, రామ, కృష్ణా అనుపదములయందు ఉత్పన్నమౌతున్న శబ్ద తరంగ దైర్ఘ్యమునమసరించి సూర్యభగవానునిలోనుండి వెలువడు సప్తవర్ణములయొక్క కిరణ దైర్ఘ్యమునకు సంబంధించియున్నవి. క్రమబద్ధమై శాస్త్రబద్ధమైన ఈ శబ్ద తరంగములు సౌరశక్తిని పొందుటకే ఏర్పరచబడియున్నవి. వైదికాగమ శాస్త్రముల యందు ఇటువంటి భేదసిద్ధాంతములు కనుపించవు వేదములందు పరమాత్మ లక్షణములు గల శివ, కేశవనామలన్నియు ఆకార, వికార, రహితుడైన పరమాత్మనే తెలియజేయు చున్నవి.

ఈ విషయము ॥ స్కాంధోపనిషత్‌లో ఈ క్రింది విధంగా చెప్పబడింది.

మంత్రం:- శివాయ విష్ణురూపాయ విష్ణవే ।
శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చహృదయగల శివః ॥

గోపురము యొక్క అగ్ర భాగమున గల స్థూపి గర్భాలయములో నిక్షిప్తపరుచబడిన వజ్ర, వైడూర్య, సువర్ణాది ధాతువుల ద్వారా కూటమి వలన ఉత్పన్నమైన విశ్వశక్తులు, దైవశక్తులు,గర్భాలయములోనికి ప్రవేశ పెట్టబడును; ఇది అతిరహస్యమైన ఆకర్షణ ప్రక్రియా విధానము.

## స్థూపి – శిఖరము – కంఠము – ప్రస్తరము

సూర్యుని రథమునకు సప్తాశ్వాలుగా పేర్కొనబడినవే ఈ సప్త వర్ణములు ఊదా, నీలం, ఆకుపచ్చ, పసుపు, నారింజ, ఎరుపు, ఈ దేవాలయమునకు రుద్రేశ్వరాలయముగా నిర్మాణము చేయుట లోని శాస్త్రీయ రహస్యమునకు మూలము కాకతీయులు 'రుద్ర' అను పదమునకుఅధిక ప్రాధాన్యత నిచ్చి వారి పేర్లలో రుద్ర శబ్దమును వాడినారు. వారు నిర్మించిన ఆలయమునకు రుద్రేశ్వరాలముగా నామకరణం చేసిరి.

ఎరుపు వర్ణమునకు ప్రక్కన నారింజరంగు మధ్యన ఉన్న పరారుణ కిరణాలకు (ఇన్‌ఫ్రారెడ్ రేస్) ప్రాముఖ్యత నివ్వడమే, ఈపారారుణ కిరణము నకు రుద్ర అని పేరు రుద్రుడు లయకారకుడు అనగా నాశనంచేయడం అనిఅర్థం గాదు, కాలుష్యనివారణ చేయువాడని అర్థము. కలుషితమైన బంగారమును కరిగించి స్వచ్ఛమైన బంగారంగా ఎట్లుమారునో ఈ పరాయణ కిరణములు మానవుల శరీరముపై ప్రసరించినప్పుడు శరీరములోని విషమును హరింపబడును. ఈ విషమును పాపముగా మన పూర్వీకులు పేర్కొన్నారు. కాలుష్య నివారణ జరుగుటను పుణ్యమని గూఢార్థమునలను వాడినారు.

ఈ కిరణాలు ముఖ్యముగా ఉబ్బసం, గుండె నొప్పులు, లైంగిక అసమర్థతలను నివారించు శక్తిగలది.

బొంబాయిలో 1978న ప్రపంచ వైద్య మహాసభయందు భారత దేశ

వైద్య మహాసభయందు భారతదేశ వైద్యశాస్త్ర సంఘ సభ్యుడు డా॥ బ్రిజేంద్రలాల్ ఖన్నా ఈ విషయాలను అద్భుతముగా నిరూపించినాడు.

మందులు సెక్స్‌హార్మోనులు, మానసిక వైద్యం, మత్తుపదార్థముల వినియోగం కన్నా ఈ పరారుణ కిరణములు గుండెనొప్పి, లైంగిక అసమర్థతల వంటి భయంకర రోగాలు మొదలుకొని చిన్న గాయాల చికిత్సలకు కూడా ఎంతో ఉపయోగపడతాయి. ఈ కిరణాల్లో శరీరానికి బలాన్నిచ్చే విటమిన్ D2 ఉపయోగాన్ని ఆ కిరణాలు అధికం చేస్తాయని ఇండియన్ సొసైటి ఆఫ్ ఎలక్ట్రో కార్డియాలజీ ఉపాధ్యక్షుడైన డా॥ ఖన్నా తెలియజేసారు.

మన శిల్పులు, శైవ సాంప్రదాయములో చవిలునైన పరారుణ కిరణాలు గర్భాలయము ద్వారా దైవదర్శనార్థము వచ్చిన భక్తులకు సంక్రమింపజేసి అమోఘమైన ఫలితాలు సాధించారు. ఇది కొన్ని వేల సంవత్సరాల క్రితం 'సౌరశక్తి'ని పరిశోధించి ప్రవేశ పెట్టబడిన ప్రక్రియ.

ఈ దేవాలయములో లైంగిక అసమర్థతలను నివారించుటకు శాస్త్రవిన్యాస శిల్పభంగిమలు ప్రవేశ పెట్టబడియున్నవి.

నగ్ననాగిని శిల్పముపై నాగుపాములు మలుచబడినవి. నాగుపాములు ఉదయ కాలమందు సూర్యుడుదయించుచుండగా లేచి సూర్య నమస్కారము ద్వారా ఈ పరారుణ కిరణము సేవనచేయుట వాటిముఖ్యమైన కర్తవ్యము. ఆ కిరణ సారమే విషము ప్రపంచ వైద్యశాస్త్రవేత్తలు ఈ విషముచే అద్భుతమైన చికిత్సలు చేయుచున్నారు.

లైంగిక సామర్థ్యము లోపించిన నిర్వీర్యుడైనవాడు శవముతో సమానము రజ, వీర్యముల సంబంధమైన ప్రయోజనమునకు రూపకల్పనే యోని, లింగాలు కేవలం రూపకల్పనయే కాక ఈ లింగాకారము నుండి పరారుణ కిరణాలు ఉత్పత్తి వాటి ప్రసార విశేషాలు కూడా ఇందు ప్రవేశ పెట్టబడినవి.

లింగము:- మహాశివరాత్రి రోజున లేక ప్రత్యేక సమయములందు

రోదసి నుండి పరారుణ కిరణములు స్థూపాకృతిలో భువికి చేరుచుండును. ఇవి ముఖ్యముగా లైంగిక అసమానతలను నివారించును. ఈ స్థూపాకృతినే లింగ'మని యందురు.

శంకరుని లింగము దివినుండి భువికి వ్యాపించి యుండగా బ్రిహ్మ విష్ణువులు దీనికి కొన మొదలు లేనట్లుగా చూచి ఆశ్చర్యపోయిరను విషయములు అనేక శయువ గ్రంథములయందు వ్రాయబడి యున్నది. కాని ఖగోళ పరిజ్ఞానము, శాస్త్రదృష్టిలేని అనేక రచయితలు, కవులు, శంకరుని లింగమనియే వర్ణించినారు కాని ఇది యదార్థము కాదు నిజముగా ఈ వెలుతురు కిరణములు స్థూపాకృతిలో దివినుండి భువికి వ్యాపించి యుండుటగాంచి ఆశ్చర్యచకితులైనారనుటలో సందేహములేదు

సోమవారంనాడు శివునికి పూజ జరుపుట మన ఆచారము శాస్త్రసమ్మతము కూడా ఆరోజు చంద్రకిరణములు సూర్యునిలోనికి పరావర్తనముచెంది సౌరశక్తిలోని అణుకిరణములనుండి సంగమంనొంది తిరిగి భూమిపై ప్రసరించును ఈ అణుశక్తి కిరణములకు "మరీచులు" అని శాస్త్రీయనామము గలదు. శైవ సాంప్రదాయములో చంద్రునికి అధిక ప్రాముఖ్యత నివ్వబడినది ఆరోజు విడుదల చేయబడు "మరీచుల"ను శివశక్తినీ పూజా కార్యక్రమము ద్వారా ప్రార్థన ద్వారా శరీరము లోకి చేర్చుకొనుటయే ఈ ప్రార్థన యొక్క ఉద్దేశ్యము.

స్థలము యొక్క ఆకర్షణ ప్రభావము వలన లింగాకారపు పరారుణ కిరణములు ముఖ్యంగా మనదేశమున శ్రీశైలము, ద్రాక్షారామము. కాలేశ్వరము అను తావులయందు ఈ ఆకర్షణశక్తి లింగములుగలవు కావున మన తెలుగు గడ్డ లింగారాధనకు పేరుగన్నది.

ప్రకృతి సిద్ధముగా ఆకర్షన లోపములుగల తావులయందు పరారుణ కిరణ శక్తిని ఆకర్షించుటకు కృత్రిమ లింగములను చేయవలసి వచ్చేడిది. చందనము, దేవదారు, జువ్వి, రావి, చండ్ర, మారేడు మొ॥ వీటిచే నిర్మించిన లింగములను దాయపుష్ప లింగములు అందురు.

బంగారం, వెండి, రాగి, ఇత్తడి, కంచు, ఇనుము, సీసము, తగరము ను ఎనిమిది లోహములతోను లింగములను నిర్మించవచ్చును. అష్ట శక్తులను ఇది గ్రహించును. ఇంకను తాత్కాలికముగా ఇసుక, గోమయము, పిండి అన్నము, బెల్లము, పండు, వెన్నతో కూడా తయారు చేయవచ్చును. వీటికి క్షణిక లింగములని పేరు.

కాశ్మీరములోని అమరనాథ గుహయందు ఒక అద్భుతమైన లింగమున్నది ఈ అమరనాథలింగము చంద్రుని వృద్ధి క్షయములను అనుసరించి శుక్ల-కృష్ణ పక్షములయందు క్రమముగా పెరుగుచూ తగ్గుచూయుండును.

గాయత్రి శబ్ధరూపమైన ఓంకార ప్రణవంగా చంద్రుని ద్వారా రక్షణ కల్పిస్తున్నది. శబ్దరూపం చంద్రుని వలన జన్మించిన శంఖంగా శబ్ధప్రధానంగా శంఖమైనది. వెలుతురు అనగా విశ్వకర్మ వెలుతురుకు సూర్యునికి ప్రతీకగా చక్రమైనది అవియే శంఖు, చక్రంలుగా రూపకల్పన చేయబడినది.

## లింగాకారము - పానవట్టము

ఈ ఆలయమునందుగల లింగాకారము స్ఫటికజాతికి చెందినదని ప్రతీతి ఇది స్థూపాకృతిగలిగి నునుపుదేరి అద్దమువలె తళతళ మెరియుచున్నది. పాన వట్టము 54 దళములు కలిగి చతురస్రాకారముగా నున్నది.

శంకరుడు అర్ధనారీశ్వరుడు. అర్ధనారీశ్వరుడను భావమును చూపుటకు శక్తి భీజాలైన 108లో సగము 54 దళములు చూపబడినది. లింగాకారము ఊర్ధ్వముఖముగా మలుచబడియున్నది దీనియెత్తు 6 అడుగులు

విలువైన స్ఫటికములలో 32 జాతులు గలవు ఇది 6 లేక 7 విధము లుగా వర్గీకరింపబడి యున్నవి వీటికి ఊష్ణవాహకశక్తి అన్ని వైపుల సమానము గా ఉండగలదు ఘణముల జాతికి చెందిన స్ఫటికములకు (రిఫ్రాక్షివ్ ఇండెక్స్) ప్రకాశ వక్రీభవనము కూడా సమానముగా ఉండగలదు.

స్ఫటికములలోవుండే కుడి ఎడమవాటాలు తేజోకరణాల ప్రసార ప్రాభా

వమును వ్యక్తము చేయును తేజోకిరణము చెరుకు ద్రావణము ద్వారా ప్రసరింప బడినప్పుడు ఒక కిరణము రెండుగా విభజితమై తేజాన్ని ప్రసారము చేయగలవు (సర్ సి. వి. రామన్ సిద్ధాంతము ప్రకారము) అందుకే లింగాకారమును తేజో లింగమనియు, ప్రకాశలింగమనియు, స్వయంభూలింగమనియు వ్యవహరించు టలో సర్ సి. వి. రామన్ తెలిపిన లక్షణములై యున్నవి.

ఇది అలనాటి స్ఫటిక జ్ఞానులయొక్క విజ్ఞానశాస్త్ర ప్రతిభను తెలియజేయు చున్నది. వేల సంవత్సరాల క్రితమే భారతీయ ఋషులు శాస్త్రవేత్తలు స్ఫటిక శాస్త్రములో అద్భుతమైన పరిశోధనలు గావించి వాటి ద్వారా ఎన్నెన్నో సత్ఫ లితములను విశ్వమానవ శ్రేయస్సు కొరకు ప్రసాధించిరి. వాటి ఆధారముతో నేటి శాస్త్రవిజ్ఞానులు ప్రయోగాలను చేయుచున్నారు.

వైష్ణవ, శివాలయంలయొక్క గర్భాలయములు చీకటిగా నుండుట గమ నించదగిన విషయము.

గర్భాలయమునగల లింగాకారము ముందు భాగమున కేవలము "గో" ప్లుతముతో వెలుగు రెండు జ్యోతులను ప్రత్యేక కోణములలో అమర్చుట అదారము అణుకిరణములకు "గో" అని పేరు. ఇది సంస్కృత పదము.

సహజముగా ఈ అణుకిరణములు ఉదయకాలమందు సూర్యునిచే విడుదల చేయబడును. తపస్సుచేత, సాధన బలముచేత, సంస్కృత శ్లోక పఠనము జపము, తపముల ద్వారా సాధించినవారి పేర్లలో 'గో'అనుబీజము గోచరించును ఇది సామాన్య మానవులకు ఉచ్చారణ దోశమువున్నవారికి అసాధ్యమైన విషయము. కాబట్టి ఈ అణుశక్తిని దేవాలయము ద్వారా సామాన్యులలో సంక్ర మింప చేయుటకు కనిపెట్టబడిన సులభ మార్గము. అందుకే విగ్రహారాధన సామాన్యమైనదైనను అత్యంతావశ్యకమైనది.

పౌరశక్తి లేక ఈ అణుశక్తి ప్రత్యేకముగా గోపురలయందు ఇమిడి యున్నది. ఆలయమందిలనగా సూర్యకిరణములని ఋషులు వారి భావనను తెల్పియున్నారు. ఈ శక్తిని సాధించి దైవత్వమును పొందిన దివ్యపురుషుల

పేర్లలతో "గో" అను బీజము గోచరించును. గౌతముడు, గోవిందుడు, గోపాలుడు మరియు శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనమునకువెళ్ళువారు గోవిందా! గోవిందా!! యని ఎలుగెత్తి పిలుచుచుండుటలో "గో" అను పదమును గమనింప వచ్చును.

గోవును స్పర్శించిన వారికి, గోమాత పూజచేసిన వారికి ఈ దివ్యశక్తులు సంక్రమించి శరీరమందలి కాలుష్యమును నివారించి పుణ్యమును ప్రసాదించినవి మన దేవతలు దివ్యమూర్తులు ఏ దోపరూపులో గోవులనుసేవించి అతీత దైవ శక్తులనుపొంది దేవతలైనారు. కృష్ణుడు, శ్రీ వేంకటేశ్వరస్వామి, శంకరుడు, (పశుపతి) గురునానక్ మొదలగు వారివారి మనస్సునందలి తపన వలన వారికి కావలసి శక్తులు సమకూరినవి. పశువులకాపరిగా వుండి ఒకేసారి మహాకవియైన కాళిదాసు భూతభవిష్యత్ వర్తమాన కాలములను తెలుసుకొనెను కాలజ్ఞానమును వ్రాసిన పోతులూరి వీరబ్రహ్మంగారు, బాల్యములోనే సమాధిస్థితుడైన ముమ్మడివరం బాలయోగి మొదలగు వారందరూ పశువుల కాపరులే. వారివారి దీక్ష పట్టుదల, మానసిక పవిత్రతయే ఈ యోగమునకు కారణము. వీరందరూ అతీత మానసిక శక్తులను, ఆధ్యాత్మిక శక్తులను పొంది మానవ కళ్యాణమునకు, మానవ సౌభాగ్యమునకు వారి దివ్యశక్తులను ధారపోసిరి.

గోయిల్, కోయిల్, లేక కోవెల, అను తెలుగు పదములకు దేవునియిల్లు అని అర్థము. కోమారి, కోహరి అనునవి దైవమునకు సంకేతములై యున్నవి.

భారతీయులకు గోమాత పూజ ఎంతో పవిత్రమైనది. గోపూజ వలన భయంకరమైన రోగములు కలుగజేయుశరీరమందలి కాలుశ్యం నివారణమై ఆరోగ్యమునుపొంది తరించినారు. అందుకే భారతీయులకు గోమాతను తల్లితో సమానముగా పూజించుట పరమ పవిత్రమైన ఆచారమైయన్నది.

ఈ ఆలయములో లింగాకారమునకు ఊర్ధ్వభాగమున గోముఖ పాత్ర వ్రేలాడదీయబడియున్నది. చమకములో వ్రాయబడిన ప్రకారము ఇందులో పంచామృతములు అనగా ఆవుపాలు, ఆవు పెరుగు, ఆవునెయ్యి, తేనె, పంచదార



లేక చెరుకు ద్రావనమును ఆయాగ్రహ నక్షత్రముల ప్రసారశక్తి వివరాలనను సరించి పోయుదురు ఈ ద్రావణము ఒక్కొక్క బిందువులుగా గోముఖినుండి లింగాకారము పై ప్రసరించి పరావర్తనము చెందునప్పుడు చేరుకుద్రావణముచేత ఒక కిరణమే రెండుగా విభజిత మగును. గర్భాలయము నల్లరాతితో చేయబడి చీకటిగా నుండుట వలన అణుకిరణం మానవ శరీరమునకు భరించగల స్థాయి మారిపోయి గర్భాలయములోగల పరాణ కిరణశక్తికి తోడ్పడి ద్వారముల వైపు పరావర్తనము చేయబడును. ఇది శైవ సాంప్రదాయములోని అణుశక్తి ప్రసార ప్రభావము.

ఇక వైష్ణవసాంప్రదాయములలో మూల విగ్రహమునకు తిలకములలో కనులలో లేక అభరణములలో విలువైన వజ్రపు రవ్వలు, కెంపులు రహస్యముగా అమర్చబడియుండును. వజ్రము మన కంటికి చాలా గట్టిగా కనబడును. కాని ఇందులో అణువులు సతతము అతి భయంకరముగా తిరుగుతూ ఉంటాయి. జ్యోతుల వెలుతురు కిరణములు వజ్రములో ప్రవేశించగానే అవి అణుకిరణములుగా మార్పుచెంది ముందుకు పరావర్తనము చేయబడును. వస్తువుయొక్క విలువ దానియొక్క చర్యనుబట్టి పలుకుచుండును. వజ్రము ఒక క్యారెట్ ధర రు 5,000 లు వరకు విలువ చేయును. అదే విధముగా కెంపులో ప్రవేశించిన కిరణములు లేజర్ కిరణములుగా మార్పు చెందును.

Light Amplification by Stimulated emission of radiation అను పదములలోని మొదటి అక్షరములను కూర్చడంచేత LASER అను పదము ఏర్పడినది. అతిసూక్ష్మ దైర్ఘ్యము గలిగి ఒకే రంగు కాంతిని ప్రసారం చేసే ఈ కిరణములు అమిత శక్తివంతముగా ఉండును.

# కెంపు

అల్యూమినియాన్ని క్రోమియం ఆక్సైడ్‌తో సంయోగ పరచడం వలన ఈ కెంపు తయారగు చున్నది. స్ఫటికాకారములో ఉండే ఈ కెంపునకు ఒక వైపున దట్టముగా మరొక వైపు స్వల్పముగాను కలాయి పెట్టబడును. ఇట్టి కెంపును జెనెన్ వాయువుతో నింపిన గ్లాస్‌లో ట్యూబ్ నుంచి విద్యుత్తు ప్రసారాన్ని ఆ ట్యూబ్‌లోని వాయువుద్వారా పంపబడినప్పుడు కెంపుద్వారా బలీయమైన లేజర్ కిరణములు బహిర్గతమగును.

ఐదుఘంతుల హీలియం ఒకవంతు నియాన్ వాయువుల మిశ్రమంద్వారా విద్యుత్తును ప్రసారము చేయడంద్వారా కూడా బలమైన లేజర్ కిరణాలు సృష్టించబడతాయి.

శస్త్రపరికరములతో అవసరం లేకుండా శరీరములోని భాగములను ఈ లేజర్ కిరణములతో కోయవచ్చును. లేజర్ కిరణములు సూక్ష్మమైనవి కాబట్టి సరిగా కావలసిన మేరకే అవసర భాగాలను నిర్మూలించ వచ్చును. ఈ కిరణములు అతి ఉష్ణవంత మైనవి కావడం వలన తెగిన రక్తనాళములను మూసివేసి రక్తప్రసారమును అరికట్టగలవు. ఆపరేషన్ చేసిన భాగములను త్వరగా మాన్ప గలము. కంటి ఆపరేషన్‌లలో ఈ కిరణాలను విరివిగా వాడుచున్నారు. శరీరములో తెగిన భాగములను త్వరగా అతుకునట్లు చేయుదురు. క్యాన్సర్ టిష్యూలను దహించి వేయడంలోను, గొంతులోను పేచ్చే వ్రణాలను ఆపరేషన్ చేయుటలోను ఎన్నో విధములుగా ఉపయోగపడుచున్నాయి.

దైవ దర్శనమునకు నిలబడిన భక్తుల శరీరములోని ధాతువులు ఈ కిరణములను గ్రహించి రక్తప్రసరణ మండలములో ప్రసరింపజేయును. అందువలన రక్తశుద్ధి, వీర్యపుష్టి, మేధాశక్తిని పెంచి క్యాన్సర్ లాంటి భయంకర రోగములచే తెగిన శరీరములోని భాగములను అతికించి వ్రుండ్లను మాన్పి ధాతువుల లోపములను సరిచేయుదురు.

దైవ దర్శనమునకు ముందుగా పుష్కరిణిలో లేక చన్నీటిలో స్నానమాచరించి

శుచిమైన కటి వస్త్రమును మాత్రమే ధరించి శరీరముపై ఎలాంటి అచ్ఛాదన లేకుండా వుండవలెనను ఆచారము గలదు. ప్రతి ఆచారములో ఏదో కీలకమైన రహస్యము దాగియుండుట యదార్థము.

సాధారణముగా దైవ దర్శనమునకు వెళ్ళువారు శారీరిక, మానసిక బాధ లుగలవారై యుందురు లేదా ముందు జాగ్రత్త చర్యగానైనా వెళ్ళుతూవుందురు.

కోపము వలన శరీరములోని ధాతువులు, ధాతుశక్తి ధ్వంసమైపోయే ప్రమాదము గలదు అందుచేతనే 'తన కోపమే తనకు శత్రువు' అను ఆర్యోక్తి ఏర్పడినది. మనస్సుకు శరీరమునకు అనిర్వచనీయమైన అవినాభావ సంబంధం గలదు. మనస్సు వికలమైనప్పుడు శరీరములోని ధాతువులు - సూక్ష్మభాగములు ధ్వంసమై అల్సర్లు, పుండ్లు మొదలగు రోగములు కలిగే అవకాశముగలదు అందు చేత దేవాలయములో ప్రవేశించగానే ఆనందముతో పవిత్ర భావముతో నిర్మల మైన మనస్సుతో మానసిక ఏకాగ్రతతో ఉండవలయునను నియమము గలదు. అప్పుడే ఈ శక్తికిరణాలు శరీరములో ప్రవేశించి దోషనివారణగావించును.

మనస్సు ధనవిద్యుత్తుగను, శరీరము ఋణవిద్యుత్తుగను ఏకాగ్రిత పవి త్రిత ఈ రెంటిని కలిపి దైవశక్తి లేదా విశ్వశక్తి లేదా సౌరశక్తి త్వరగా శరీరము యందు వ్యాపింపజేయును.

రేడియోముల్లును సరియైన సంఖ్యపై కేంద్రీకరింప జేసినప్పుడే కావల సిన శబ్దతరంగాలను లాగుటలో అంతరాయ మేర్పడును. అస్తవ్యస్తమైన శబ్దములు వినిపించును. ఆందువలన ఉద్దేశ్యము నెరవేరదు.

అదేవిధముగా భక్తుడు దైవదర్శన సమయములో మానసిక పవిత్రిత, మానసిక ఏకాగ్రిత లేక నానా బాధలకు గురియగు చున్నారు. రోగము మీరిన తర్వాత ఎంత గొప్పడాక్టరయినా ఎన్ని అధునాతన సౌకర్యాములున్నా ఫలితము సూన్యమేకాగలదు.

కాబట్టి చిన్నతనము నుండి పిల్లలకు భక్తి భావము ఏర్పరచి అధ్యాత్మిక

చింతనకు ప్రోహదము చేసిన ఎడల భవిష్యత్తులో వారికి క్షేమమే జరుగును.

## -: కొబ్బరికాయ నీళ్ళయొక్క ప్రాశస్త్యము :-

దైవదర్శనమునకు పోయెడి ప్రతివారు విధిగా టెంకాయ తీసికొనిపోయి మూల విగ్రహమునకు ముందు కొట్టుట ఆచారము.

కొబ్బరికాయ శీతలముగ చేయును, పొత్తికడుపు శోధించును, దేహపుష్టి శుక్రమును వీనిని వృద్ధిజేయును.

వాతము, పిత్తము, రక్తదోశము, తాపము వీనిని హరించును. దంత రోగము, వాతరక్తము వీనియందు హితకరి గుల్మము, శూల, అరుచి, కాసము, హృదోగ్రము వాపు వీనినిహరించును. ప్రత్యేకంగా హృదయమునకు మేలు చేయును. మన భారతీయులు ఋషులు, ప్రకృతి సంపదను మానవ కళ్యాణము నకు ఉపయోగించి అద్భుతమైన ఫలితములను సాధించినారు.

కొబ్బరినీళ్ళకు తులసీదళమును చేర్చుట, అందులో కర్పూరము వేయుట, ఈ సమ్మేళనమును రాగి పాత్రలో పోయుటలోని ప్రత్యేకత ఏమిటో వివరించ బడినది.

## తులసి:- (వైష్ణవ మతములో)

తులసీ కటుకాతిక్తా హృద్యోష్ణా దాహపితకృత్।
దీపనీ కుష్ఠ కృచ్ఛ్రా స్రపార్శ్వరుకఫ వాతాజిత్॥

కుష్ఠువు, మూత్రకచ్ఛము, రక్తదోషము, పార్శ్వపీడనము, కఫము, వాతము వీనిని హరించును.

గౌరి, సురసా, భూతాగ్ని, బహుమంజరీ, తులసి మొక్క పేర్లు. తులసి దోమలకు ప్రబల శత్రువు. ఇప్పుడు ఎన్నెన్నో వ్యాధులు నయము చేయుటకు తులసిని ఆశ్రయిస్తున్నారు. మలేరియాను అరికట్టుటకుకూడా తులసి దోహదకారిగా

ఉపయోగపడుతున్నాయంటే నేటి వైద్య విధానానికి దీనియొక్క అవసరము ఎంతగా ఉన్నదో అర్థము చేసుకొనవచ్చును. గొంతులో కఫము పెరిగినప్పుడు తులసి రసం తగుమోతాదులో సేవిస్తే ఉపశమనం కలుగుతుంది.

పిల్లలలో మూత్రవిసర్జన పెంచడానికి, చెమట ఎక్కువగా బయటకు పోవడానికి, శరీరములో సూక్ష్మజీవుల పెరుగుదలను అదుపులో వుంచడానికి, హృదయకోశ వ్యాధుల నివారణకు తులసి పనికి వస్తుంది. నిర్ణీత కాలములో నిరంతరం శరీరాన్ని పీడించే కొన్ని భయంకర వ్యాధుల నివారణకు కూడా ఇది పనిచేస్తుంది.

పిల్లల కడుపులో వాయువు ఏర్పడుతున్నపుడు వారిలో కాలేయ సంబంధ మైన వ్యాధులకు తులసీ రసంతో చికిత్స చేయవచ్చును. ప్రతీరోజు 180 గ్రా యినోల డోసేజ్ ప్రకారము తులసీరసం ఇస్తే క్రానిక్ జ్వరాలను, అజీర్ణాన్ని, అతిసారవ్యాధిని నివారించవచ్చు.

తులసిని ఉపయోగించి వాంతులను ఆపవచ్చును. శరీరమందలి పురుగుల కు వేరాన్నజీవులైన సూక్ష్మరోగజీవులకు ప్రబల శత్రువు నులిపురుగుల బాధ నుండి విముక్తి కావడానికి సున్నపు తేటతో తులసీ రసాన్ని తగు మోతాదులో సేవిస్తారు. దురదలు మొదలగు చర్మవ్యాధుల నివారణకు కూడా తులసీరసాన్ని సున్నపుతేటతో కలిపి వాడవచ్చును. తులసీ డికాషన్ మామూలు జలుబులపాలిటి మంత్రజలం.

స్టీమ్ డిస్టిలేషన్ పద్ధతిద్వారా దళాల నుంచి తయారుచేసే 0.7% ఎస్సెన్షియల్ ఆయిల్‌లో 71.3%, యూజినాల్ 3.2%, కేర్వాక్రోల్ 21.4%, మెథిల్ యూజినాల్ 1.7%, కేర్యోఫిలిన్ ఉంటుంది. ఈ తైలం సూక్ష్మజీవుల వ్యాప్తిని నిరోధించే గుణన కలిగియుంటుంది. ఈ తైలానికి స్ట్రెప్టోమైసిన్ శక్తిలో 10% వంతు శక్తి వుంటుంది. ట్యూబర్ క్యూలసిస్ నివారణకు పనికి వచ్చే వేసోనియా సిద్ధ్ (E.6, H.7, N. 3.0) శక్తిలో ఇది నాలుగవ వంతు శక్తిని కలిగి వుంటుంది. 1800 మీటర్ల ఎత్తుగల హిమాలయాల్లో కూడా ఇది అగుపిస్తుంది. ఆధునిక వైద్యానికి మరింతగా పెరిచడానికి అందరూ కృషి చేస్తే

ఎంతో బాగుంటుంది.

హిందువులు ఎంతో పవిత్రంగా భావించి పూజించే తులసి వలన ఎన్నో శాస్త్రీయ ప్రయోజనాన్నాయని వేల సంవత్సరాల క్రిందనే మన భారతీయ ఋషులు పరిశోధించి మానవ కళ్యాణానికై దైవాలయముల ద్వారా ప్రయోగించి అద్భుత విజయాలు సాధించారు.

ఇటీవల తులసీచెట్టుపై జరిపిన విస్తృత పరిశోధనల వలన ఎన్నో ప్రయోజనములు వున్నాయని కనుగొనుచున్నారు. ఇంటిలో ఒక తులసీచెట్టువున్నట్లు అయితే యం.బి.బి.యస్, డాక్టరువున్నట్లే తులసీచెట్టు వేళ్ళనుండి ప్రతి అంగుళం మన ఆరోగ్యరక్షణకు పనికివస్తుంది.

ఈ బ్రహ్మాండమైన ఔషధమును దేవాలయంలలో పూజారి కొబ్బరి నీళ్ళతో కలిపి కొలుత ప్రకారం 3 చెంచాలు తీర్థం ఇస్తాడు.

## రాగిపాత్ర - రాగిగుణం

శ్లో॥ తామ్ర సరం లఘు స్వాదు శీతం పిత్తక ఫాప హమ్ ।
దోషణం పాండుకు ష్ఠార్శ శ్వాయదుశ్వాసకాస జిత్ ॥

తా॥ రాగి వేగము గలది, తేలిక నిచ్చును, రుచినిచ్చును, శీతలముగ నుండును. వ్రణములనార్చి కుదురు కట్టించును. పిత్తము, కఫము, పాండువు, కుష్ఠువు, అర్శస్సు-వాపు-శ్వాసము-కాసము వీనిని పోగొట్టును.

## కర్పూరం

శ్లో॥ కర్పూర శ్శీతలో వృష్య శ్చక్షు ష్యోలేఖనో లఘుః ।
కఫ దాహస్య వైరస్య మేధ శ్శోధవిషాపః ॥

తా॥ కర్పూరము చలువ చేయును, శుక్లము వృద్ధిచేయును, నేత్రములకు మేలుచేయును, లేఖనము చేయును. లఘువుగ నుండును. కఫము, తాపము జిహ్వకు రసజ్ఞానము లేకుండుట, మేధస్సు, వాపు, విషము వీనిని హరించును.

# సూర్యుడు, సౌరశక్తి లేక దైవశక్తి

బ్రాహ్మీ ముహూర్తమున వెలువడు ఉదయకాల మందలి దైవశక్తి మానవ దేహముపై గల ప్రభావమును గురించి హార్వర్డ్ మెడికల్ స్కూల్‌కు చెందిన శాస్త్రజ్ఞులు పరిశోధనలు జరిపి దీని ప్రకారము సూర్యకాంతిలో సంచరించే వారికి ఉదములో క్యాల్షియం ఎక్కువ అగుతుంది. సూర్యరశ్మి ద్వారా 'డి' విటమిన్ లభిస్తుంది. దాని మూలాన పెరుగుదల జరుగుతుంది. క్యాల్షియం దేహనమునకు ఎంతో అవసరమని అందరికి తెలిసినదే. జాన్ ఓట్ అనే శాస్త్రజ్ఞుడు కాంతిని ఆహారముతో పోల్చినాడు. ఆహారము మాదిరిగానే ఉదయకాల మందలి మంచి కాంతిఆరోగ్యమును పెంచుతుంది చెడు కాంతి అనారోగాన్ని స్తూంది అని తన హెల్త్ మరియు లైట్ అను గ్రంధములో వ్రాసినారు.

సూర్యుని నుండి ఆరోగ్యాన్ని పెంచే అల్ట్రావాయిలెట్ కిరణములు ప్రసారం చేయబడతాయి సంపూర్ణమైన సూర్యకాంతి శరీరము పై ప్రసరించబడుట వలన దేహం సక్రియంగా పనిచేయునని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

భారతీయ ఋషులు; మునులు సూర్యునిలోని శక్తిని పరిశోధించి విశ్వ మానవ శ్రేయస్సునకు ఉపయోగించి ఎన్నెన్నో పద్ధతులను ప్రవేశ పెట్టియున్నారు ఆహార రూపములో సౌరశక్తిని గ్రహించగల గుణములుగల ఇంకా అనేక రూపములలో ప్రవేశ పెట్టి అద్భుత ఫలితములను సాధించినారు.

అందుకనే బ్రాహ్మీ ముహూర్తముననే మేల్కొని, చన్నీళ్ళలో స్నానం చేసి సూర్యనమస్కారము చేయవలెననెడి సాంప్రదాయమునకు అధిక ప్రాధాన్యతనిచ్చి ఆచరణలో పెట్టియున్నారు. ఉదయమే మేల్కొనుట వలన జ్ఞాపక శక్తిని, ఆయుష్షును, ఆరోగ్యాన్ని పెంచి నిత్యయవ్వనులుగా సంపూర్ణ జీవితము ను అనుభవించు చక్కని మార్గమును కనిపెట్టినారు.

సూర్యకాంతి దేహాంతర్గముగా జరిగే రసాయనిక ప్రక్రియను క్రమబద్ధచేస్తుంది. ఎంతో ప్రధాన కార్యక్రమంలను నిర్వర్తించే గ్రంధుల చర్యలను ఇవి సరిచేస్తాయి డా॥ వర్ట్‌మన్ ప్రకారం కాంతి కంటికి తాకగానే "హైపోథాల

పస్"ను అనగా మెదడులోని ఒకముఖ్యమైన భాగమును స్పందిపజేస్తుంది. దీని మూలముగా పిట్యూటరీ గ్రంథి హార్మోనుల ఉత్పత్తిని ప్రారంభిస్తుంది. సూర్య కాంతి సరిగా వాడుకొనని వారికి హార్మోనుల ఉత్పత్తిలో అసమానతల్లు ఏర్పడి క్యాన్సర్, అతిమూత్ర వ్యాధి గొంతు సంబంధమైన వ్యాధులు వచ్చే అవకాశ మున్నది. కాంతి తగిన విధముగా ప్రసారం చేయబడడం వలన కీళ్ళవాతం, కామెర్లు, సారీయాసిడ్ వంటి వ్యాధులను కుదుర్చుట సాధ్యమౌతుంది.

ఈ కిరణశక్తి ప్రతి ఇంటిలో ప్రసరించుటకు ఇంటి ప్రధాన ద్వారము తూర్పు ముఖముగా వుండవలయుననే ఆచారమున్నది. పైన తెలిపిన శాస్త్రవిధా నమంతా సౌరశక్తిని ఉపయోగించుటకై ప్రత్యేకమైనది. కొబ్బరినీళ్ళ తులసీ దలం, కర్పూరం సమ్మేళనంతో రాగిపాత్రలో పోసి ఉదయకాలంనందు వెలు వడు సౌరశక్తిని మేళవింపజేసి సేవింపు అద్భుతమైన ప్రయోగం మన భారతీయ ఋషులు, మునుల, శాస్త్రజ్ఞుల పరిశోధన మేధాశక్తికి దర్పణం వంటిది. రాగి పాత్రకు సౌరశక్తిని గ్రహించి కొబ్బరినీళ్ళకు సంక్రమింపచేయు తత్వంగలదు.

## తీర్థము

బ్రాహ్మముసనే మేల్కొని అర్చకుడు మేళతాలములతోగాని, వేదధ్వనితో గాని బయలుదేరి తీర్థపు బిందెనుతెచ్చి మూలవరులకు, పరివారదేవతలకు అభిషే కము చేయవలయును. అరుణోదయ కాలమునందు తెచ్చిన జలమందు మహ త్తర సౌరశక్తి, చంద్రశక్తి ఇమిడియుండును. ఇది వైద్యశాస్త్ర సమ్మతమైనది

సూ. 25. తత్ర సర్వేశమేవ బామాణాం గ్రహణకు ప్రత్యూషసి తత్ర హ్యామలత్వం శైత్వం చాధికం భవతి, సఏవ చాపాంపరో గుణఇతి.

శ్లో॥ దివార్క కిరైర్జుష్టం నిశాయమిందు రశ్మిభిః।
ఆరూక్ష మనభిష్యంది తుల్యం గగనాంబునా॥
(సుశ్రుత సంహిత-అ. 45)

తా॥ పగలు సూర్యరశ్మిచే కాగబడి, రాత్రియందు చంద్రుని కిరణంలచే చల్లదనము కాబడిన ఉదకములందు "వృక్షల" గాని "అభిష్యంది" గుణముగాని

లేక యుండుటయే గాక ఆకాశగంగలో తుల్యముగా నుండును. వీటిని హంసో దకమని యందురు.

ఉదయమే చన్నీటి స్నానము చేయుట వలన శరీరమునకు దైవశక్తులు చేకూరి ఆయుస్సు, ఆరోగ్యమును పెరిగి సంపూర్ణ జీవితమును గడిపెదరు.

★ అభిషేక స్నాన ద్రవ్యములు :- గంగోధకము, పచ్చకర్పూరము, కస్తూరి, గోరోజనము, కుంకుమ పూపు మొ॥ కలశము, బంగారము, వెండి, రాగి, శంఖము.

★ అర్ఘ్యద్రవ్యములు:- కుశలు, కుంకుమపువ్వు, మారెడుపత్రి,పుష్పము, లు, పెరుగు, గరికెపోచలు, చిలలు, అక్షతలు, తామర పద్మములు.

★ నైవేద్యము :- మహా నైవేద్యము, నేయితో వండిన అన్నము' పెరుగు, పాలు, తేనే, పండ్లు.

★ దీపము :- నువ్వులనూనే, ఆవునెయ్యి.

★ అచమనము :- యాలకాయలు, లవంగములు, ఉశిరికచూర్ణము, కక్కోలము, స్వర్ణయజ్ఞోపవేతము, మంగళసూత్రము, శుభ్రముగానున్న వజ్రములు.

★ పుష్పములు :- మారెడు పత్రి, తులసీదళము వివిధ పుష్పములు.

★ ధూపములు :- జలూమంసీ, గుగ్గులు, దేవదారు, సింహ్లాక, అగరు, పచ్చ కర్పూరం.

★ పూజా ద్రవ్యములు :- పసుపు, సర్వత్రి ఉపయోగ కుంకుమ, వరిపిండి, పుష్పములు, అక్షతలు, గోమయము, గోమూత్రం, ఆవుపాలు, ఆవు పెరుగు, ఆవునేయ్యి, తేనె, చందానీ పై కార్యములకు పైనుద హరించిన ద్రవ్యములన్నియు సౌరశక్తి యొక్క వివిధ తత్వములకు సంభం ధించిన ఔషదులు కావడము విశేషముగా ఎరుంగవలయును.

# బొట్టును తయారుచేయు పదార్థములు

## పసుపు

శ్లో॥ హరిద్రా కటుకాతిక్తా రూక్షోష్ణా శ్లేష్మపిత్తానుత్ ।
వర్ణ్యా త్వగ్దా మహాశాస్త్ర శోఫ పాండువ్రణాపహా ॥

తా॥ పసుపు, కారముగా, చేదుగ నుండును తపము నిచ్చును. ఉష్ణముగ నుండును శ్లేష్మము, పిత్తము, త్వగ్దాహము, మేహము, రక్తదోషము వాపు, పాండువు, వ్రణములు, దీనిని హరింప జేయును. శరీరమునకు కాంతి నిచ్చును.

## నిమ్మకాయ

శ్లో॥ జంబీరమమ్లం శూలఘ్నం గురూష్ణం కఫవాతజిత్।
ఆసవైరస్య హృత్పీడావాహ్ని మాంద్య క్రిమీన్ జయమేత్॥

తా॥ నిమ్మకాయ పుల్లగా నుండును శూలకఫము, వాతము వీనిని హరించును. గురుత్వము జేయును, కాకజేయును. నోటి అరుచి హృద్రోగము అగ్ని మాంద్యము వీనిని హరించును.

## గారసున్నము

శ్లో॥ సుధాక్షరో 2 గ్ని సంకాశః పాకేక్లేది విదారణః ।

తా॥ గారసున్నము అగ్నితో తుల్యముగా నుండును. పాకకారి, క్లేదకారి, ఛేదము చేయును.

పసుపు + నిమ్మకాయ + గారసున్నములలో పైన వివరించిన గుణములు కలిగి యుండును. వీటితో బొట్టును తయారు చేయుటకు ఉపయోగింతురు.

## గంట

శ్లో॥ ఓం శన్నో మిత్రః శంకరణః భవత్వర్యమా ।
శన్నొ ఇన్ద్రో బృహస్పతిః శన్నో విష్ణు రురుక్రమః ॥

బ ౧-౫౦-౯

ఓంకారము పరమ పవిత్రమైన పరమేశ్వర నామము ఇందు అ+ఉ+మ, అను మూడు అక్షరములు కలిసి ఓం సముదాయమైనది. ఈ నామము నుండి అనేక నామములు పొడముచున్నవి. 'అ'కారము విరాట్ అగ్ని, విష్వాదినాములును. 'ఉ'కారము హిరణ్య గర్భ వాయుతైసాది నామములకును; 'మ'కారము ఈశ్వర ఆదిత్య ప్రాజ్ఞాది నామములకును వాచకములును గ్రాహకములై యున్నవి. ఇట్లే వేదాది సత్య శాస్త్రములు స్పష్టముగా వ్యాఖ్యానించియున్నవి. కావున ప్రకరణానుకుల మీ నామములన్నియు పరమేశ్వరునియే.

ఈ స్వరోచ్ఛారణచేత వెడలు శబ్దతరంగాలు చెవులలో ప్రవేశించినప్పుడు ప్రకృతిలో వాతావరణములో ఇమిడియున్న సౌరశక్తిని తత్సంబందమైన గ్రహశక్తులను శబ్దరూపమున శరీరమందు ప్రవేశింపజేసి అంతర్వాహినిగా పనిచేయును

శబ్దప్రధానమైన ఈ ఓంకారమును గురుముఖముగా తెలుసుకొన్నవారు మాత్రమే స్వరయుక్తముగా ఉచ్చరించి సత్ఫలితములు పొందవలయు ననెడి వేధ నియమము గలదు. సామాన్యుల సూత్రము అనగా మధు, మాంసముల సేవించువారు ఉచ్ఛరించుట వలన మేలుకన్న కీడు కలుగుచుండన్న ఉద్దేశ్యముతో వారికి కూడా ఓంకారము యొక్క శక్తిచే మేలుగలిగించుటకు ఎన్నెన్నో స్వర ప్రయోగములుచేసి వాటి ఔన్యత్యమును గ్రహించి సర్వ సామాన్యులకు ఉపయోగపడుటకు ఓంకార ప్రణవమును స్వయంగా ఉచ్ఛరించుట వలన కలుగు ప్రయోజనమునే నేరుగా గంట నుండి పొందుటకు ఆలయములందు 'గంట'ను ఏర్పాటు చేసియుండిరి. శైవాలయములో, వైష్ణవాలయముతో ఈ గంటను తప్పనిసరిగా అమర్చియుండును.

ఈ గంట ఓంకార నామము. ఈ గంటను తయారు చేయుటకు ప్రత్యేక ధాతువులను తగు నిష్పత్తిలో మిశ్రమ పరిచెదరు ఈ మిశ్రమముచే సప్తస్వర సమ్మేళనమైన ఓంకార నాదమును సృష్టించి మా నవ శరీరములో అంతర్వాహినిగా ప్రవహింప చేయుటకు మన పూర్వీకులు అద్భుతమైన ప్రయోగములు చేసి యుండిరి. ప్ర=శ్రేష్ఠమైనది, ణవము=క్రొత్తది అని అర్థము. ఈ స్వరతరంగములపు విజ్ఞాన శాస్త్రసంభందమైన లలితకళలకు అవినాభావ సంబంధముకలదు ఈ విషయము నేటి ఆధునాతన శాస్త్రవేత్తలకు మొన్నమొన్నటి వరకు విదితము

కాలేక పోయెను.

వ్యాధి నిరోధానికి గంట నుండి వెలువడు శబ్దతరంగాలకు అధిక ప్రాధాన్యత గలదు. దేశముపై శబ్దానికి గల ప్రభావమును గురించి శాస్త్రజ్ఞులు జరిపిన పరిశోధనలు ఎన్నో ఆసక్తికరమైన విషయం వెల్లడి అగుచున్నది. వాద్యసము దాయముతో శబ్దతరంగాలను బట్టి నాడీ వేగం పెరుగుతుందని శాస్త్రజ్ఞులు రుజువు చేయగలుగు చున్నారు.

రకరకాల రాగములలో రసానుభూతితో, స్మృతులలో, లయలో సంగీత తరంగాలు శరీరములో రక్త పరిమాణము పైన, రక్తపీడనము పైన, జ్ఞానేంద్రియాలపై ర. రకాల ప్రభావములను కలుగజేయు చున్నవి.

ఇవి వాయువు ద్వారా చెవులకు చేరునప్పుడు శబ్దతరంముల ప్రయోగము నుబట్టి,స్థాయినిబట్టి ప్రకృతిలో యిమిడియున్న సౌరశక్తులను, గ్రహశక్తులను. కర్ణేంద్రియాల ద్వారా శరీరములోని దాతువులకు శరీర భాగములకు చేర్చి లోపాలను సవరించి అతీత శక్తులను పెంచిశరీర రుగ్మతలను నివారింప గలవు.

కడుపులో వ్రణములను ఔషదములద్వారా, శస్త్రచికిత్సలద్వారా కాకుండా సంగీతముద్వారా సులువుగా కుదుర్చ వచ్చునని జర్మనీ పరిశోధకులు నిరూపించి యున్నారు.

ఈ విధముగా శబ్ద,స్పర్శ,రూప,రస, గంథములశక్తులను పంచేంద్రియంల ద్వారాశరీరములోప్రవేశ పెట్టుటకు ఎన్నో సంవత్సరములలు కృషి చేయవలసి ఆంధ్రప్రభ ది. 21–6–1979. జర్మనీ మ్యూనిచ్ విశ్వవిద్యాలయంవారు అతిధ్వనుల ప్రయోగములద్వారా మూత్రపిండములలోని రాళ్ళను కరిగించుటకు ప్రయోగములు చేసి విజయమును సాధించినారు.

ఈ అతి ధ్వనుల సహాయముతో ఛాయా చిత్రములను తీయుటకు ఉపయోగించుటకు అమెరికాలో 'స్టాన్ ఫర్డ్' విశ్వవిద్యాలయంవారు ప్రమాద వశాత్తు నేత్రములు పోయినవారు, కంటి వ్యాదులవారికి కారణములను తెలిపి వైద్యులకు

సరియైన నిర్ణయంను తెలుపుటకు ఈ అతి ధ్వనులను ఉపయోగించి అసలు చికిత్స నిమిత్తమై ఉపయోగించుచున్నారు.

అయితే ఏరకం వ్రణానికి ఏరకం శబ్ధ ప్రాధాన్యత గల సంగీతం విని పించ వలయుననెడి విషయం నేటి శాస్త్రవేత్తలు పరిశోధించి నిరూపించ వలసి యున్నది.

రకరకాల వ్యాధులన్నింటికి ఉపయోగపడే విధంగా గంటపు ఆలయంలో ప్రవేశ పెట్టి యున్నారు.

## ధ్వజ స్థంభము

ఒక పీఠముపై ఎత్తుగా నిలబెట్టబడిన భాగంనకు ధ్వజ స్తంభమని పేరు. శిరభాగంన గల స్థూపి దైవశక్తులతో పిడుగులాంటి ప్రకృతి శక్తులను కూడా గ్రహించే ప్రభావం కలదు. అందువలన ఆలయంనకు ప్రమాదమేర్పడ వచ్చు ఈ విషయము దృష్టిలో యుంచుకొని ప్రతి దేవాలయములో ధ్వజస్తంభము నుంచవలయుననెడి నియమము గలదు ఇది ప్రత్యేకముగా ఆలయముయొక్క భద్రతకు ప్రాధాన్యత వహించుచున్నది.

అప్పుడప్పుడు సంభవించే భయంకరమైన ప్రకృతి భీభత్సవములచే ఈ అద్భుత నిర్మాణములకు ఎలాంటి ప్రమాదము వాటిల్లకుండా పిడుగు మొ॥ వాటి ఇతర భయంకర శక్తులను ఆకర్షించుకొని ఆ శక్తులను భూమిలోనికి ప్రవేశింప జేయును.

మిక్కిలి ఎత్తైన ఇత్తడితో చేయబడిన ఈ ధ్వజ స్తంభమునకు ఆలయ మువైపు వాలియున్న మూడు మేకలములు కొన్ని వందల చదరపు గజముల ఆవరణములో ఎచ్చట పిడుగు పడునో ఆ పిడుగును ఆలయము పైబడి ధ్వంస ము కాకుండా వెంటనే ఆకర్షించుకొని భూమిలోనికి చేర్చును.

ఆలయరక్షణయే ధ్వజస్థంభము యొక్క ముఖ్యమైన ధర్మముగా శిల్ప శాస్త్రములో చెప్పబడినది. దక్ష యజ్ఞములో ఆదిశక్తి 51 భాగములుగా విభ

జింపబడినది. అందులో ఒకభాగమే ఈ రుద్రేశ్వరాయలముగా వెలిసినదని ప్రతీతి. శక్తిరూపాలు 108, 54, 27. ఒక్కొక్క నక్షత్రమునకు నాల్గు పాదాలు. కాబట్టి 27 నక్షత్రములకు $27 \times 4 = 108$ రూపాలైనవి. ఈశ్వరుని అర్థనారీశ్వరునిగా చెప్పబడినది. అర్ధభాగం శివ లింగంగా, అర్థభాగం పాణవట్టముగా రూపకల్పన చేయబడినది. పాణవట్టముపై పాణలింగము స్థాపింపబడినది. చతురసాకారము గల్గిన పాణవట్టముపై స్థూపాకృతి కల్గిన స్ఫటిక లింగమును ఊర్ధ్వభాగముగా స్థాపింపబడినది.

రుద్రుడు ఊర్ధ్వరేతసుడు, రుద్రుడు తన అమూల్యమైన వీర్యమును దాంపత్య జీవితమునకేగాక అధ్యాత్మిక శక్తులను (సౌరశక్తి)ని పొందుటకు ఓజశక్తిగా మార్చి ప్రయత్నముచేత సుషుమ్న మార్గమున కుండలినీ ద్వారా సహస్రారమునకు చేర్చబడుటచేత శిఖయందు అయస్కాంత క్షేత్రమేర్పడి సుధూర శబ్దతరంగాలను భక్తులయొక్క రూపాలను గ్రహించ గల్గును. వీనినే దివ్యశ్రవణము, దివ్యదృష్టియని అందురు. ఓజస్సు శక్తివంతమై దివ్య దృష్టి కలుగుటకు లైంగిక సంభంధమునందు పార్వతియొక్క రజశ్శక్తి ఎంతగానో తోడ్పడి-నది. అవివాహితులకు ఈ స్త్రీ రజశక్తి సంక్రమించదు. కాబట్టి దివ్యదర్శనము, దివ్యదృష్టి మరియు అతీతశక్తి సాధ్యమగుట అసంభవము. రుద్రునియొక్క జ్ఞానశక్తికి నిదర్శనముగా జ్ఞాన నేత్రమును ఫాల భాగమున మూడవ నేత్రముగా సృష్టించ బడినది.



ఆధ్యాత్మికదృష్టిలో ఆది దంపతుల కొలవాలమైన ఈ రుద్రేశ్వరాలయములోని ప్రాణవట్టము, లింగాకారము పవిత్రమైన సృష్టికార్యమునకు ప్రతిరూపముగా రూపకల్పనచేయబడినది. సరియగు శరీరతత్వము లేనప్పుడు పుట్టినసంతానము అంగవైకల్యముగనో ఏదో శరీర సంబంధమైన బాధలు కల్గునను భావము ప్రాణపట్ట లింగాకారమునందు యిమిడి యున్నది.

స్త్రీ పురుషుల రజో వీర్యముల కలయికే సంతానోత్పత్తికి కారణము. ఆరోగ్యవంతమైన, బలవంతమైన మేధాసంపదగల సంతానము కల్గుటకు యోని లింగ పారిశుద్ధ్యము తత్సంబంధమైన శారీర దాతు తత్వములు సరియైనవిగా నుండవలయుననెడిదే యిందులోని రహస్యము.

రజోవీర్యముగా పరస్పర మార్పిడివలన స్త్రీరజశక్తి పురుషునికి పురుషుని వీర్యశక్తి స్త్రీకి సంక్రమించి ఆరోగ్యం ఆయుస్సు పెంచును. స్త్రీరజశక్తి 7.5% పురుషుని వీర్యశక్తి 25%గా ఉండుటవలనపురుషునికే ఎక్కువ శక్తిచేకూరును. అందుచేత పురుషుని వయస్సు ఎక్కువకాలము జీవించుటకు తోడ్పడగల మహాత్తరశక్తివంతమైన స్త్రీ రజశక్తి యిదే మగవానికి అమూల్యమైన ధన సంపత్తి.

మహేశుడు అర్ధనారీశ్వరుడు అని, స్త్రీని అర్ధాంగియని, ప్రాణేశ్వరియని వ్యవహరించుటలో పురుషుని ప్రాణరక్షణకు స్త్రీ రజస్సు ఏ విధంగా తోడ్పడుచున్నదో మహేశుని శరీరములో ఎడమ బాగమున స్త్రీ ఆకృతిని కుడి బాగమున పురుషాకృతిని రూపకల్పన చేయుట ప్రత్యక్ష నిదర్శనము.

ఏ ఋషికైన, ఏ మునికైన అతీత శక్తులు ఆధ్యాత్మిక శక్తులు సంక్రమించి దేవతలైన వారందరు వివాహితులే. భార్యలేని వారికి ఈ శక్తులు సంక్రమించుట అసాధ్యమైన విషయములు.

ఈ అమూల్య శక్తిని సిరియని, ధనమని చెప్పబడినది. వరునికి అమూల్యమైనది స్త్రీ శక్తియేకాని ధనమును కట్నముగా భావించరాదు. కాని నేటి సమాజములో వరకట్నము దబ్బుకును అర్థముగా మారినది. కృష్ణుడు, రాముడు, అర్జు

నుడు మొదలగు మహనీయులు తమ శక్తిసామర్థ్యములను ప్రదర్శించి తమ అర్ధాంగిని పరిణయ మాడినట్లు పురాణ గాథలలో గలదు.

రూపవతిని, గుణవతిని వివాహమాడి వెలలేని రజశ్శక్తిని పొంది సంపూర్ణ జీవితమును గడపవలెను.

స్త్రీ అయిష్టతతో వున్నపుడు రమించుట వ్యర్థమని వాత్స్యాయన కామసూత్రములలో తెలిపి యున్నారు.

ఈ ఆలయంయొక్క అంతరాళములో ఎనిమిది చిన్నచిన్న గుహాలయము లుగలవు. ఇవి అష్టశక్తులకు, నిలయములు. అష్టసిద్ధులు అష్టశక్తులు, స్త్రీ శక్తులుగా శిల్పములలో ప్రదర్శించిరి.

ఈ ఆలయమునకు నాలుగువైపుల యందుగల చిన్నచిన్న దేవాలయము లయందు ప్రత్యేక లింగాకారములే వాటి అమూల్యమైన విలువను గ్రహించిన వారే దొంగిలించి యుండవచ్చుననుటలో సందేహములేదు.

ఈ ఆలయమునకు పునాదులు లేకపోవుట ఒక ప్రత్యేక విశేషము. చదునైన నేలపైననే యిసుకనుపేర్చి ఆ యిసుకపైననే ఆలయనిర్మాణము గావించినారు. ఈ పద్ధతిని ప్రవేశపెట్టినవారు హోయసల శిల్పి నందిభట్టు ఇతడు పీఠ భాగములను అమర్చుటలో నేర్పరియైన శిల్పి.

నీలి శిలలు కఠినముగా నుండి అతిసున్నితమైన శిల్ప భాగములను తీర్చి దిద్ది అద్దమువలె మెరియునట్లు చేయుటకు వీలైయున్నది. నునుపుచేసి అద్దము వలె మెరియునట్లు చేయడమన్నది అతి ఖర్చుతోకూడిన పని. మొదట పలుగు రాళ్ళు పలుగురాళ్ళ పొడితో ఆతర్వాత వజ్రపు రజతముతో రుద్దడము వలన శిలలు నునుపు దనముతోపాటు మెరియునట్లు చేయును. సున్నితమైన భాగము లను ఉలితో చెక్కినట్లుగా వజ్రముతో కోసి తీర్చిదిద్దిరి. ఇది రహస్యమైన వాస్తు శిల్పశాస్త్రము. ఆరోజులలో దేవాలయనిర్మాణమునకు ఎంతో ధనమును ఖర్చుచేసె డివారు. అందుచే'రాజుల పైన రాళ్ళపాలు'అనుసామెత ప్రచారములోనికివచ్చింది,

ఎంతో కృషిసల్పి ధనమును వెచ్చించి ఎంతో మంది శిల్పులు శ్రమించి ఈదేవాలయము నిర్మించుటవలన విలువైన ప్రయోజోపకరమైన సత్ఫలితములేవి ఇందు దాగియున్నవో ఈ నాటి విద్యావంతులు తెలుసుకోవలసి యున్నది.

ఆలయములో అందమైన కళాత్మక శిల్పములను, రసాత్మకమైన శిల్పము లను తీర్చిదిద్ద వలయుననెడిదే ప్రధానమైన అంశము.

## రసానుభూతి ద్వారా మానవ శరీరమునకు శక్తిని పంపిణీ చేయుట

మన మనస్సునకు, శరీరమునకు అనిర్వచనీయమైన అవినాభావ సంబం ధము కలదు. నేత్రములు, ఆనంతమైన ఆకృతిని గాంచినప్పుడు రసానుభూతి చే హృదయం ద్రవిస్తుంది. కళాకారుడు, శిల్పి, సంగీత కారుడు, కవి, రసాత్మ కమైన ప్రయోజనముకై అధిక ప్రాధాన్యత నిచ్చి ప్రయోగాలు చేసినారు.

ఆనందముతో హృదయము వికసించినప్పుడు ప్రకృతిలోని తత్సంబంధ మైన శక్తులు హృదయములోనికి శరీరములోనికి వివిధ ధాతువులకు నేరుగా శక్తి రూపమున పంపిణీ చేయబడు చున్నవి. ఇది గుండెయొక్క అత్యంత ప్రధాన మైన ధర్మము. గుండె చెడురక్తము ఊపిరితిత్తుల లోనికి పంపడముచేత ఊపిరి తిత్తులలో మనము పీల్చే వాయువులోని ప్రాణవాయువు రక్తశుద్ధిని ఇతర మిశ్రమ వాయువు బయటికి నెట్టివేయబడును. దీనికి తోడుగా రసానుభూతిచే గుండెకు ప్రకృతిలో దాగియున్న శక్తి చేర్చబడి అక్కడి నుండి ఆ శక్తులు ఇతర శరీరములోని భాగములకు చేర్చబడి రోగనిరోధక శక్తి ఏర్పడును. ఈ శక్తి శరీరములోని అతి కీలకమైన సూక్ష్మమైన భాగములను కాపాడును. మనిషి బ్రతకడానికి కేవలం ఆహారం, నీరు, గాలి మాత్రము సరిపోదు. రసానుభూతి ప్రతి మానవునిలో కలిగించుటకు నయనానందకరమైన శిల్పములతో దేవాలయ ములే ప్రముఖ పాత్ర వహించినవి. ఈ రసానుభూతిని పొందే ప్రవృత్తి మనుషులకే కాకుండా పశువులు, పక్షులలో కూడా నిక్షిప్తమై యున్నది. మాన వుడు తన ఆహారములో ప్రకృతి శక్తులచేత సృష్టించబడిన వివిధ వస్తువులను సేకరించి తగు పాళ్ళలో మిశ్రమ పరచి జీర్ణమగుటకు వండుకొని తినుటవలన

జీర్ణకోశములో ఈ మిశ్రమములు విడదీయబడి శక్తి రూపమున శరీరములోని వివిధ భాగములకు పంపిణీ జేయబడుటచేత శరీరము సక్రమముగా పనిజేయును.

ఇదే తత్వముగల లలిత కళలను సృష్టించి ప్రకృతిలో ఇమిడియున్న శక్తిని పంచేంద్రియముల ద్వారా నేరుగా శరీర భాగములకు పంపిణీ చేయ బడుతుంది. ఇది కేవలం రసానుభూతిద్వారాచే సంక్రమించుట జరుగును.

మనస్సు వికలమైనప్పుడు గుండె ద్రవించదు. గుండె ద్రవించనప్పుడు శక్తి ప్రసారం కాదు. అందుకే " మనోవ్యాధికి మందు లేదు " అను సామెత ఏర్పడినది. ఔషధాలచే కాని పని రసానుభూతి ద్వారా జరుగుతుంది. కళాకారులు, శిల్పి, సంగీత విద్వాంసుడు, కవి, ప్రకృతిలోని సుందర ఆకృతులను తమ విషయమునకు మాతృకలుగా చిత్ర రచనకు ఎన్నుకుంటారు. చిత్రకారులు చిత్రించిన అందమైన ఆకృతి ద్వారానే రసానుభూతి కలుగజేస్తాయి. అంద మైన యువతి కనబడగానే పురుషుడు రసానుభూతిచే పరవశమై పోతాడు. వికృతమైన రూపమును గాంచుటకు నేత్రములు అనుమతించవు. సౌందర్య ప్రధానమైన ప్రయోగము ద్వారా శరీరములోని ధాతువులు సవరించబడి ఆరోగ్యము చేకూరును.

మనకు తెలియకుండా ఈ కార్యక్రమము మనసే నిర్వహిస్తుంది. ఇందుకు మనస్సునకు పంచేంద్రియములు సహకరిస్తుంటాయి.

ఆలయములోని శిల్పముల భారస్వామ్య ప్రమాణముండిన యెడల ఆ అందమైన శిల్పమును చూచినప్పుడు హృదయములో రసం జనిస్తుంది. అప్పుడు వాతావరణంలో ఇమిడియున్న దైవశక్తి నేత్రముల ద్వారా హృదయము నకు, హృదయము నుండి రసానుభూతి ద్వారా ఈ శక్తి సంక్రమిస్తుంది. అందుకే ఆలయంలో రసాత్మకమైన శిల్పములను శిల్పించవలెనను బలమైన కారణమైనది.

శ్రీనివాసుడు అనగా లక్ష్మీ లేక సిరిని హృదయములో చేర్చుకొన్న వాడని అర్థము, శ్రీనివాసుని విగ్రహమునకు హృదయ భాగమున పద్మావతి ప్రతిమయు మరియు అలివేలుమంగ యొక్క ప్రతిమయు ఉండుట గోచరిస్తుంది లక్ష్మీదేవి కమలములపై యున్నట్లు అగుపిస్తుంది. పాదములవద్ద కమలమే లేకుంటే లక్ష్మి దేవి కాదని చెప్పవచ్చు. నగా స్త్రీలకు మరియు కమలములకు, లేక పుష్పములకు అదినాభావ సంబంధముగలదు. పుష్పముల సువాసన స్త్రీ రజశక్తి పెంచే గుణము కలదు. మగవానిని ప్రేరేపించే తత్వము గలదు. ఈ శక్తి పుట్టబోవు సంతానమునకు, భర్త ఆయుష్షునకు ఖర్చుచేయబడుతుంది గుడిలో పూలనువేయుటలో అంతర్యము ఇదియే అయిఉన్నది. సన్మానితులకు, పెద్దలకు పూలదండలతో సన్మానించుట భారతీయుల ఆచారము. అనగా అవ్యక్తి పూలసువాసనలచే చాలాకాలము బ్రతికి సమాజమునకు సేవచేయవలె నని అర్థము ఇమిడి యున్నది.

తెలంగాణా ప్రాంతములో "బతుకమ్మ" పేరుతో పూల ఉత్సవములు జరుపుట ఆచారము. స్త్రీ తనరజశక్తిని పెంపొందించుకొని ముత్తయిదువుగా సౌభాగ్యవతిగా వర్ధిల్లుతూ భర్తయొక్క ఆయుష్షును ఆరోగ్యమును పెంపొం దించుటకు కనిపెట్టబడిన సువాసన ప్రక్రియ, స్త్రీ ద్వారా పురుషునికి సంక్రమించే అమూల్యమైన ధనరాశి సిరి లేక లక్ష్మియని, సంపదయని వేదములందు చెప్ప బడినది.

స్త్రీ శక్తిస్వరూపిణి యనుటకు కాళిమాతకు సింహమును వాహనముగా గజలక్ష్మిగా, ధాన్యలక్ష్మిగా, సంతానలక్ష్మిగా మొదలగు ఎనిమది రకములుగా శక్తిరూపములు చెప్పబడినవి. అవియే అష్ట అయిశ్వర్యములు. అవియే అష్ట సిద్ధులుగా వర్ణించబడినవి.



ఒక యోగి చేతిలో ఆహారము. స్త్రీచేతిపై చిలుక ఇద్దరిమధ్యన బంధించిన మర్కటము న్నది. 'కామిగానివాడు మోక్షకామి కాడు' అనెడి భావము గోచరించును.

"కామిగానివాడు మోక్షకామి కాడు". కామము ధర్మయుక్తముగా నున్నపుడే మోక్షము కలుగుతుంది. ఈశక్తిని మితముగా వాడుకున్నప్పుడే సంపూర్ణ జీవితము పొందగలరు.

గర్భాలయమునగల ముఖద్వారమునకు లక్ష్మీదేవి విగ్రహములను ప్రముఖముగా మలచబడినవి. శివాలయ్యములో లక్ష్మీదేవి ప్రతిమలను మలచుటచే లక్ష్మి అనగా స్త్రీశక్తి అని తెలిపోయెను.

రామప్ప ఈ ఆలయములో శక్తి బీజాలను స్త్రీరూపములో అనేకముగా చెక్కియున్నాడు. స్త్రీ శక్తి యొక్క వివిధరకముల తత్వములను స్పష్టముగా విశ్వసించి యున్నాడు. ద్వారముయొక్క లక్ష్మీదేవి విగ్రహమునకు పీఠభాగమున 54 దళములు గలిగిన పద్మము మలచ బడినది. దేవాలయములందు ఇవి చాలా అరుదుగా అగుపిస్తాయి. అష్టకోణాకృతిలో అష్టశక్తులుగా చండీ, చాముండీ, కాత్యాయిని, కళ్యాణి, భద్రకాళి, బాగా నిర్మించబడి శిల్ప రూపములో ప్రదర్శింప బడినవి. ఈ చక్రమునకు 'హ్రీం' బీజము ప్రధానమైనది.

## శ్రీచక్రము - దాని వివరములు

అష్టదళ పద్మ పూజితుడైన ఉత్తరకవులు ప్రత్యక్ష యోనిపూజ, రతులు, వామచారులు, దుర్వాసకృతమైన సౌభాగ్య చింతామణి ననుసరించి దేవిపూజ నిర్వర్తించినారని తెలియుచున్నది. కాకతీయులు వామాచారులు. కావుననే భైరవి, భైరవ దేవతలను భైరవ, యామల ప్రామాణ్యముననుసరించి పరుశు

రామ, దత్తాత్రేయాది కల్పసూత్రములను గురించి ద్వ్యక్షర మంత్రములను పూజించిరి (ద్వ్యక్షర మంత్రములకు కర్తవ్యమని పేరు). కాని మంత్రమును ద్వ్యక్షర మానమున ఉపాసించుటచే కాకర్త్య అని వంశము పేరు ఏర్పడినది. కాక + త్తె = కాకత్య. అదియే కాకతీయగా మారినది.

అష్ట కోణముల మధ్య సహస్రారము దాని మధ్య లక్ష్మీదేవి శిల్పమును ప్రతిష్టించుట వలన లక్ష్మిని పొంది తరించవచ్చు.

శ్రీ తుమ్మలపెల్లి రామలింగేశ్వరరావుగారు "శ్రీచక్ర విలాసము" అను శాక్త్య గ్రంథమున మన శాస్త్ర మన శాస్త్ర గ్రంధములందు గల సాంప్రదాయము సాంప్రదాయము సాంకేతిక విధానము పైననే భావాతీతమైన చిత్రకళ, శిల్పకళ, సంగీతకళ, సాహిత్యకళ, ఆధారపడి దివ్యముగా వికసిచి పారభ్యకల్లోలిత కకుప్తటములైనవని వ్రాపి శ్రీచక్రము నుండి వికసించిన ఆయా కళల గురించి కొంత వివరెంచెను. దేవాలయ నిర్మాణ ప్రతిష్ట ఇత్యా ర్యలన్ని శిలరచనలందు శ్రీచక్రమెట్లు ఉపయోగించ బడినదో శ్రీచక్రమునకు మానవ శరీరమునకు కూడా సామ్యముండునని ప్రమాణముండుటచే దేవాలయ నిర్మాణమున మానవ శరీరమున ఎట్లు చూపబడినదో వివరింపబడును.

ఈ సందర్భమున రామప్ప దేవాలయములోన ప్రతిష్టించ బడినట్లు గమనింప వలెను. చంద్రికకావిద్యలకు వాహాంతరముగల శ్రీ విద్యయందు చంద్రికకా కిరణములు 360 దినములుగను దేవీచరణారవిందములైన ఆ మరీచులే, సృష్టి, స్థితి, లయకారులుగాను అవియే షోడశ నిత్యములగను చూపబడి యుండుటచే కళాత్మకమైన దేవి స్వరూపము గూడా శ్రీచక్రకృతి ఇమిడియున్న దని నిరూపింపబడినది. అష్టమి, నవమి, దశమి, చతుర్దశి మున్నగు తిధుల

హరింప బడుటచే శివా శివులకు అభేధము కావున శివ స్వరూప నిర్మాణార్చనలు శ్రీ విద్యార్జనయే ఆగును.

మూల ధనమునసున్న పనసున్నవాడిని(కుండలిని) వికసింప జేయుటకై బిందు, పతనము నిరోధించ వలెనని సూచించుటకే వీర్యమునకు చిహ్నమైన వృషభమును, కందర్ప బీజమున నందీశ్వరుని శివుని వాహనముగా నిర్ణయించిరి. మధ్య స్థానమున నున్న అపానమును అనగా కామ వాయువును ఉద్ఘాటన చేయుటకు అది సూచనయగును. అట్లు పానమును నిరోధించు, కామ వాయువు సుషుమ్న మార్గముగా ప్రయాణింప జేయునని శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి కదర్ప బీజ ఉఘాటన ప్రధానము కనుకనే ఉత్తరముఖ ద్వారము ఉండవలెనని శాస్త్రమున్నను సహస్రారమున తూర్పు దిక్కున సద్బుద్ధి ఉండుటచే యిందు ప్రవేశించిన సద్బుద్ధి కలుగవలెనని ఉద్దేశించి అలయద్వారము తూర్పు ముఖ మేర్పరచిరి.

సుషుమ్న మార్గమున ప్రవేశించు కామవాయువు బ్రహ్మగ్రంధిని దాటు చున్నదను సూచనకు బ్రహ్మగ్రంధి స్థానమున గణపతిని సూచించుటకే నృత్య గణపతినిగాని నృత్య తాండవముగాని యేర్పరిచిరి.



'మధ్యేబైందవసింహపీఠిల లితేత్వం బ్రహ్మవిద్యశివే'

అష్ట కోణాకృతిగల నక్షత్రరూపము మధ్యభాగమున 54 దళములు గల పద్మము అష్టశక్తులకు మూలం "హ్రీం" బీజము ప్రధానమైనది.

విభిన్న యోగాలను భిన్నత్వంలో ఏకత్వంను ప్రదర్శించ గలుగునది ఒక్క స్త్రీ మాత్రమే. ఇందుగనుగుణంగా ప్రధాన అంతరాళములో ఎనిమిది చిన్న చిన్న గుహాలయములుగా నిర్మింపబడి అష్టశక్తులుగా, అష్టసిద్ధులుగా రూప కల్పన చేయబడినవి. ఇప్పుడు ఇందులోని మూలరూపాలు గుప్తమై గుర్తుపట్ట రాని శిథిల శిల్పాలు గోచరిస్తాయి.

కాకతీదేవి కరుణతో ఆముష్మిక వైకరిని ఐహికసుఖాన్ని ప్రచారము గావింప వలెననెడి చక్రవర్తిగారైన శ్రీ గణపతి దేవుల అభిప్రాయమునకు స్త్రీశక్తులకు సరియగు రూపకల్పన గావింపబడి కాకతీయ శిల్పాన్ని ప్రత్యేక రూపములో లోకానికందించిన రామప్ప శిల్పకళా ప్రతిభకు కళాజగత్తు జోహార్లు అర్పించుచున్నది.

బహిష్ఠ సమయములలో, ప్రసవ సమయములలో స్త్రీలు అనేక రకాలుగా బలహీలపడు సందర్భములలో ప్రాణముల కాపాడి రక్షించెడివే స్త్రీల ఆచారాలు, బొట్టు, మంగళసూత్రం, వసుపు, కుంకుమ, రంగురంగుల వస్త్రములు, సాంప్రదాయసిద్ధమైన ఆచారములన్నియు ప్రకృతికి అనుకూలముగా స్త్రీల రక్షణకు మన పూర్వులు అనేక ప్రకృతి పరిశోధనలు గావించి శాస్త్రబద్ధముగా ఆచారరూపములో ప్రవేశ పెట్టినారు. కాని నేటి సమాజములో విదేశీ ఆచారములకు అలవాటుపడి శాస్త్రబద్ధమైన మన ఆచారములను పాటించనందున ప్రాణాపాయకరమైన పరిస్థితులను ఎదుర్కొంటూ శస్త్రచికిత్స (ఆపరేషన్) సహాయముతో ప్రసవములను జరుపవలసిన దుస్థితికిదిగజారవలసి వచ్చుచున్నది.

"సర్వమానవాళికి సుఖశాంతులు ప్రసాదించే అమృతమూర్తి
ఆ జగజ్జనని" అని చాటిచెప్పండి.

సూక్తి

—శ్రీ వివేకానందుడు

ప్రకృతి సిద్ధముగా జరుగవలసినవన్నియు కృత్రిమముగా జరుగుటవలన అనేక రోగములపాలై పుట్టిన సంతానము బలహీనముగా అనేక రకాలైన వికృత రూపములకు గురియై మందులు లేనిదే దినము గడుచుట కష్టమగుచున్నది.

పశుపులు, జంతువులు, పక్షులు మొదలగునవి ప్రకృతికగుణముగా సంచ రించుటవలన ఏలాంటి వైద్య సహాయములేకనే సంతానమును కనుచున్నది.

రామప్ప "రుద్రమదేవి" అందచందాలను తనివితీరా ఆస్వాదించి ఆమె రూపమునే ప్రతి శిల్పములో చిత్రించు చుండెను.

రుద్రమ వీరనారియేకాక మహాతెలివైనది, చురుకైనది. ఎన్నెన్నో క్లిష్ట రాజకీయ సమస్యలను తృటిలో పరిష్కరించి పలువురిని ఆశ్చర్యపరచు



చుండెడిది. తండ్రికి యుద్ధ తంత్రి విషయములను తెల్పుచూ ఎన్నెన్నో విజయములకు చేయూత నిచ్చినది. మహామంత్రులకు కూడా తోచని అనేక సమస్యలకు చక్కని సలహాలిచ్చెడిది.

సమకాలికుడైన హోయసల మహాశిల్పి జక్కనాచార్యుడు హోయసల రాకుమారి అందాలసుందరియైన సౌసరిని ప్రేమించి పెళ్ళి చేసుకొనిన విషయము మహారాజులకే కాక కాకతీయ ప్రముఖులందరికీ తెలిసియుండెను. వీరి పెండ్లి విషయము ఓయుసులకేకాక పొరుగు రాజ్యములవారు ఆక్షేపించిన జక్కన సౌసరినియొక్క పవిత్రప్రేమ బంధమును విడదీయజాలక పోయిరి. ఒక దేశపు రాకుమారి శిల్పిని వివాహమాడుట క్రొత్త విషయము కానప్పటికి పలు పురికి క్రొత్తగానే తోచినది. ఈ విషయము గణపతి దేవుల వారికి అప్పుడప్పుడు మనసున మెదలు చుండెడిది.

భిల్లుని భుజముపై తలనానించి వయ్యారము లొలకబోస్తూ నిలుచున్న భిల్లీ శిల్పములు, పార్వతీపరమేశ్వరుల, కళ్యాణ ఘట్టములు, దశావతారములు, వామన కృష్ణావతారములు రామప్ప రమణీయముగా మలుచు చుండెను. గంగావతరణ గాథ మహిషాసుర మర్దిని శిల్పము, శివపార్వతులను భిల్లులరూపంలో దివ్య మోహనముగా మలచెను. ఆలయ కుడ్యములకు అష్టవిధ నాయికలను భావయుక్తముగా తీర్చిదిద్దెను.

పలురకములైన రాగములకు లయబద్ధమైన నాట్యములకు రూపకల్పన గావించుచూ తన ఉలులపై అమృతమునుజల్లి శిలలకు ప్రాణము పోయించెను. అపరబ్రహ్మ రామప్ప బహువిధములైన చెవిరెలు-తాటంకములు, తీసరాలు కంకణములు-కడియములు ధరించిన ఆ ప్రాంతపు అలంకార విశేషములను శిలలలో విన్యసించు చుండెను.

ఈవిధముగా తిరిగి ఆలయశిల్పములు ఆలయపనులు ప్రారంభమాయెను. వెడల్పయిన కర్ణభూషణములను ధరించినవారి మెడలయందు ప్రతిగొళ్ళు హారములుగా ధరించెడివారి రూపములకు తగిన శిల్పములను ఆ ప్రాంత ప్రజానీకమును ప్రతిబింబించు భంగిమల ఆకృతులను శిల్పములతో విన్యసించుచుండెను.

ఒక భిల్లుడు వాడియైన శరమును సంధించి పరుగిడుతున్న సూకరమును కొట్టగా అది దిక్కులు పిక్కటిల్లునట్లుగా అరుచుచున్న తీరును ఆ కదలికలను పిల్లలుకూడా సునాయాసముగా అర్థము చేసుకొను విధముగా మలచెను. ఒక రాజపురుషుడు మునివేషధారియై వేటకు వచ్చినట్లుగా శిల్పములను మలచెను. ప్రతి శిల్పములో రుద్రమదేవి యొక్క పోలికలు ఆమెయొక్క అంగసౌష్ఠవమునే ఆధారముగా తీసకొని మలచెను. గాయత్రి విశ్వకర్మల ఉపాసనతో గాయత్రి కృపాకటాక్షంతో నాట్యరాణిని ప్రత్యక్షము చేసుకొనుచుండెను.

రుద్రమదేవి హృదయములో రామప్ప మన్మథాకారము వివిధ ఆలోచనలకు పురికొలుపుతూ మతిభ్రమింప చేయుచుండెను. బయటి వెన్నెలబాధ భరించలేక విరహవేదనచే రామప్పను చూడదలచి చెలులను వెంటతీసికొని గుఱ్ఱములపై పాలంపేట చేరెను. సద్దులారగించిన తర్వాత చెలులను అక్కడే ఉండమని చెప్పి రామప్ప పర్ణశాలకు వచ్చెను. సెలవురోజు కాబట్టి శిల్పులందరు వారి, వారి పర్ణశాలలలోనే ఉండిరి. రామప్ప పర్ణశాలలో లేనందున దేవాలయ నిర్మాణ ప్రాంతాలకు వచ్చెను. రామప్ప పని చేసిచేసి, అలసిపోయి కునుకు తీయుచుండెను.

రుద్రమ నెమ్మదిగా గుఱ్ఱముదిగి గుఱ్ఱమును దూరముగా ఒక చెట్టుకు బంధించి నిద్రించుచున్న రామప్పను సమీపించెను. వెన్నెల వెలుగులో తళ తళ మెరియుచున్న మకర కుండలములు, జరియంచు పట్టువస్త్రములు ధరించిన అపర మన్మదుని రూపుగాంచి శరీరము పులకరించి నెమ్మదిగా సమీపించి తట్టి లేపెను. రామప్ప కనులు తెరచి ముందునిలిచిన రతీదేవిని మించిన ఆ దివ్య మోహన రూపమును గాంచి కలవరపడి ఇది కలయా నిజమా అని ఆశ్చర్య పడెను. రుద్రమ నెమ్మదిగా నవ్వుచూ రామప్పకు చేతిని అందించెను. రామప్ప శరీరములో విద్యుత్తు లాంటిది ప్రవేశించి శరీరము వేడెక్కెను. రామప్ప మారుమాటాడలేక పోయెను. చమవుతో రుద్రమదేవి గుర్రము వద్దకు తీసుకొని వచ్చి గుఱ్ఱముపై నెక్కించి తర్వాత రుద్రమదేవి ఎక్కి తటాకము వద్దకు తీసికొని వచ్చెను. రుద్రమదేవి మృదుమధుర శరీరస్పర్శచే

రామప్ప శరీరము వేడెక్కిపోయెను. ఆ వెన్నెలలో ఇరువురు భరింపరాని కా తాపమననుభవింప సాగిరి. రుద్రమ మైమరచి తాపము భరించలేక అర్ధవివస్త్రయై నీటిలో మునిగి లేచి రెండుచేతులు యెత్తి రామప్పను ప్రేమపూర్వకము ఆహ్వానించెను. రామప్ప శరీరము పులకరించి ఆమెను సమీపించి పెనవేసుకొనెను



రామప్పకు స్త్రీస్పర్శలోని స్వర్గసుఖమేమిటో ఆనందమేమిటో అప్పుడర్థమాయెను రామప్ప ఆమెను అర్ధనగ్నముగానే రెండు చేతులు పైకెత్తి తన శిల్పములకు కావలసిన కొన్ని ఆకృతులను చిత్రించుకొనెను. యిరువురికి ఇది మొదటి స్పర్శానుభూతియై విడరాని బంధమేర్పడెను. ఇరువురు ఆ వెన్నెల వెలుగులోనే అన్నిరకముల అనుభూతులను పొందిరి. తెల్లవారక మునుపే చెలులను చేరుకొని మారువేషములను ధరించి ఏకశిల నగరమునకు చేరుకొనెను.

ఆనాటి నుండి రుద్రమదేవి ప్రదర్శించిన చనువు, ఆప్యాయత, ప్రేమ లైంగిక సుఖము రానుప్ప శిల్పరచనాశైలికి భీజముపోయ నారంభించెను. ప్రతి శిల్పములోను స్త్రీ సహజమైన పంపుసొంపులు, వయ్యారములు, పొట్టక్రింది మడతలు, కాళ్ళ మదముల మలుపులు, కనుబొమ్మల తీరు ఒకటేమిటి అన్నివిధ ములైన ఆమె అంగాంగముల చూప సౌందర్యమును ప్రతి శిల్పములో శిల్పిం చుచూ కావ్యములకు చక్కటి రూపకల్పన చేయుచుండెను.

దేవతలు - ఉత్తమ స్త్రీలు - పద్మ నేత్రములు - పద్మహస్తము - పద్మ పీఠములు - పద్మమాలా విరాజితులుగా చెప్పబడినవి. కావున సాంప్రదాయ సిద్ధముగా ఒక్కొక్కటే నయనానందకరముగా మలచుచుండెను.

అరచేతిలోను, అరికాలిలోను, కిరీటములలోను భూషణములలోను, పీఠ ములలోను, మకర ద్వారాముపైనను, పద్మముల అలంకారములను తీర్చిదిద్దు చుండెను. కావున పద్మము అనునది శిల్పములకు ముఖ్యముగా చిత్రింపదగిన విషయము ( Subject ) లలో ఒకటి

ఈ రుద్రేశ్వరాలయము నాట్యశాస్త్రమునకు ప్రత్యేక రంగస్థలముగా తీర్చిదిద్దుతూ శిల్పములను వాటి కళలు, వాటి వెనుక వస్తుసముదాయము, భంగి మలు, విద్యావంతులకే కాక చదువురాని వారికి, పిల్లలకు కూడా తాటి ఆకులతో పొందుపరచిన కావ్యములయొక్క భావములకు సునాయాసముగా అర్థముచేసు కొని అనుభూతి పొందే పద్ధతిలో జోడించి శిల్పరచన చేయసాగెను. ఈ శిల్ప ములు సాటిశిల్పులకే సంభ్రమాశ్చర్యములను కలుగునట్లుగా గోచరించుచున్నవి.

నాట్యభంగిమల శిల్పములద్వారా నాట్యశాస్త్రములోని మెలకువలనుచూచి అర్థము చేసుకొను విధముగా శిల్పములను రూపొందించినాడు. రుద్రమకు జాయప్ప సేనానియొక్క నృత్యశాస్త్రముకరతలామలకము. రుద్రమ భరతనాట్య ములో ఆరితేరిన దిట్ట నాట్యశాస్త్రములోని ప్రతి ముద్రను ప్రతి భంగిమయొక్క ఉపయోగములకు, లాభములను అర్థముజేసుకొని రుద్రమదేవినే నమూనాగా నిలుపుతూ నాట్యశాస్త్రమునకు భాష్యముగా మలుచుచుండెను.

భరతనాట్యం, స్వరపల్లవులు. సాహిత్య పల్లవులు, పదాలు, తుమ్మెదపదం, ఆనందపదం, బృందములో నందికోమల నృత్యం, గర్భనృత్యము మొదలగు నృత్య సాంప్రదాయములను శిలలలో విన్యసించుచుండెను. జాయప్ప నృత్య శాస్త్రములోని ఘట్టములను దృశ్యకావ్యములోనికి తెచ్చుటకు కొంత సంస్కరణ అవసరమాయెను. భరతశాస్త్రమును కళ్ళారా చూడవలెనంటె భారతదేశము సందర్శించే విధముగా చేయడమే రామప్ప ధ్యేయము.

గంధర్వ, కిన్నెర, కింపురుషాదులకు, వాత్స్యాయనుని కామసూత్రములకు ప్రతిబింబములు శిల్పరూపమున విన్యసించెను.

కామసూత్రముల శిల్పములు పూర్తి అయిన తర్వాత రుద్రమ ఒకసారి ఆలయము చూచుటకు ఆలయ ప్రదేశమునకు వచ్చెను. అందులో విన్యసింప బడిన శిల్పములను, శిల్ప చాతుర్యమును గాంచుచూ రుద్రమ ఒడలుమరచి పోయెను. తన సహచర్యము వలన స్త్రీ సౌందర్యము యొక్క లోతుపాతులు తెలుసుకొని స్త్రీ యొక్క ఏ భాగము ఎంత మేరకు విన్యసింపవలెనో అందు వలన చూపరులకు ఎలాంటి చలనం కలుగవలెనో ఆ మేరకు శిల్పించ గలిగెను. సాయంసమయము వచ్చెను. వానజల్లుపడిన బయటి శిల్పములు మంచి ముత్యములు చల్లినట్లుగా గోచరించెను. రామప్ప తీర్చిదిద్దుతున్న శిల్పము నీటి బిందువులచే మెరియుచుండెను. రామప్ప ఆలయముఖ ద్వారమునకు తీర్చిదిద్దుతున్న శిల్పము పాము పడగవిప్పిన విధముగా ఆ చేతులు పైకెత్తి ఆ మృదువైన చేతులలో బలమైన సర్పమును లేపునట్లుగా మగవాని శరీరములోని పురుషోత్తమమును ప్రకోపింపజేయు తత్వములో మరియు శరీరమందలి కుండ లినీ తత్వమునకు సంబంధించిన సంబంధములు నాగుపాములో అద్భుతముగా రూపకల్పన జేసెను.

రుద్రమ కోయ వేశములోనుండి తదేక దృష్టితో చూడనారంభించెను. రామప్ప రుద్రమ రాకను గ్రహించక పోయెను. రుద్రమ దృష్టి నాగిని శిల్పముపై బడెను. రుద్రమ ఆ శిల్పమును చూడగానే ఆడతనము ఉట్టిపడి నిలువున సిగ్గు ముంచుకొచ్చెను, సిగ్గుతో ఆశ్చర్యపడుచు మూతిపై చెయ్యివేసుకొని పరవశించి పోయెను.

అచ్చముగా తన లింగసౌష్టవమును తానే చూచుకున్నట్లు ఆ శిల్పములోని ప్రతి అంగము స్పష్టముగా తీర్చబడెను ఆ శిల్పమును చూడగానే కోపము, ఆశ్చర్యము కలిగెను. విశ్వకళ్యాణముకొరకై నిర్మింపబడుచున్న ఈ మంది రమునకు ఇలాంటి శిల్పమే ఇచ్చటనే ఏర్పాటు చేయవలెననెడి నిర్ణయము ప్రకా రమే మలచబడినది కాబోలు, అయినా ఈ విషయమును రామప్ప నడిగి తెలు సుకొనవలెనని నిశ్చయించుకొనెను. ఇది దైవసంబంధమైన నిర్మాణము. దేవుని దృష్టిలో భేదభావముండదు. తరతరాలకు, యుగయుగాలకు మానవా రోగ్యము కాపాడే ఈ కుండలిని యోగరహస్యపు శిల్పము రుద్రమనే గిలి గింతలు పెట్టెను. వెన్నెల రాత్రులయందు చెరువుగట్టుపై మైమరచి ప్రద ర్శించిన భంగిమలన్నియు శిల్పరూపములుగా వెలిసినట్లు గ్రహించెను. ఆనాటి మధురకలయిక సారమే శిల్పసుందరిగా పూర్ణరూపము దాల్చుచున్నవి. అని తల్చుచూ అనుభూతి పొందెను.

శిల్పములను వదలి రాఘప్పను రామప్ప దివ్యసుందర మూర్తిత్వమును చూడనారంభించెను. రామప్పతన సమీపంలో ఎవరు నిలిచినదికూడా గ్రహిం చలేని పారవశ్యముతో శిల్పములు తీర్చిదిద్దుటయందు విలీనమయిపోయెను. రామప్ప వెన్నెల రాత్రులయందు ఏకాంతముగా తనలో స్త్రీ స్పర్శ సుఖమును గుర్తు చెప్పినవిషయములన్నియు శిల్పములుగా రూపునంతరించు కొనుచుండెను. పరవశించినమత్తులో రామప్పరూపము అపరమన్మదుడి ఆకారముగోచరించెను.

రుద్రమను రామప్ప చూడకపోవుటచే కోపముతో పరుగుపరుగున గుర్ర ముపై నెక్కిన విషయము లీలగా గోచరించెను. ఇద్దరు చెరువుగట్టున చేరు కొనిరి. రుద్రమ మూతిబిగించి ఒకరాతిపై కూర్చునెను. రామప్ప రుద్ర మను సమీపించి ఎన్నెన్నో విషయములుచెప్పి సంతోషపరచెను. రుద్రమనుండి స్త్రీల రహస్యములను ఎన్నింటినో సేకరించెను. రామప్పకు ప్రతివిషయములో ఎంతో సహకరించి కామ సూత్రముల రూపకల్పనకు తోడ్పడినది.

రామప్ప కనులారగించిన రుద్రమ ప్రతి అవయవమును దృష్టియందుం చుకొని శిల్పముగా రూపకల్పన చేయుచుండెను. అష్ట విధ నాయికలను అచ్చ

ముగా రుద్రమదేవి నాట్య సమయమున ప్రదర్శించిన ముద్రలను ఆకృతులను సృష్టించుచుండెను. రాగమునకు తగిన ముద్రలను అద్భుతముగా శిల్పరూపమున విన్యసించుచుండెను.

నెలకు నాలుగయిదు పర్యాయములు రామప్పను కలుసుకొని లైంగిక అనుభూతిని పొంది శ్లోకానుగుణమైన భంగిమలను ప్రదర్శించి రామప్పకు కావలసిన భంగిమలిచ్చి క్రొత్త క్రొత్త రచనలకు తోడ్పడుచుండెను. రామప్ప రుద్రమల మధ్య విడదీయరాని బంధమేర్పడెను. రామప్ప పేరు చెప్పిన త్వరాతనే రామప్పను గురించి పరితపించిపోయేది స్థితికివచ్చినది రుద్రమ.

వాద్యధారణులు, నాట్యగత్తెలు వారి శరీరములపై వివిధరకముల ఆభరణములు చేతులయందు నగిశీ పనిగలిగిన మద్దెలలు పిరుదు భాగమున వాటిపై వ్రేలాడు జడగంటలు సమకూరములైన చేతి వ్రేళ్ళకు ముద్దుటుంగరములు తీర్చి దిద్దెను. సముద్ర మథన ఘట్టము అప్సరగణములు, కౌస్తుభము, చింతామణి, ఉచ్చైశ్రవము, ఇంద్రుడు, త్రిపుర సంహార ఘట్టములు, మార్కండేయుని గాథలు శివ నృత్యముక్రింద సమాధినున్న శివుడు త్రినేత్ర విన్యాసము మొదలగు శిల్పములు రామప్ప అమోఘముగా చిత్రించెను.

రతీదేవి భంగిమలను ప్రేక్షకుల్లను గిలిగింతలు పెట్టువిధముగా శిల్పించగలిగిన శిల్పములు ప్రత్యేక కోణములలో మలిచెను. ఈ శిల్పములలో రతీదేవి కరడ్లలో కామదహనమును అతిస్వేచ్ఛగా ప్రదర్శించి తీర్చిదిద్దెను, అది రామప్పలోని కామదహనమును తెలియజేయుచున్నది.

నాగిని శిల్పము సాక్షాత్తుగా రుద్రమదేవినే నగ్నముగా నిలిపెట్టినారా అనే అనుభూతి కలుగుంది. ఆమె అంగ ప్రత్యంగముల సోయగములు, గాంచుచు స్పర్శించుచు రామప్ప ఎన్నో భంగిమలకు రూపకల్పన గావించుచుండెను.

రుద్రమ ఏకాంతములో అంతఃపుర మందిరములో ఉన్నప్పుడు దేవాలయమందు గాంచిన ప్రతిమలను ఊహించుకొని రేయని అనుభూతి పొందుతూ పరవశించి పోయెడిది.

వివస్త్రయై స్నానమాచరించి తడిగా నిలిచినప్పుడు రామప్ప తన మృదుమధుర మైన కోమల శరీరభాగములను స్పర్శించుచున్నప్పటి తీయనిస్పర్శ సుఖము జ్ఞాపకమువచ్చి ఉక్కిరిబిక్కిరయ్యేడది.

రామప్ప తనకు కావలసిన భంగిమలను నిలిపి తదేక దృష్టితో చూస్తున్నప్పుడు తనకెందుకు సిగ్గనిపించలేదు. తన ఊహకందెడిదిగాదు. తనకి తెలియని తన అంగ ప్రత్యంగసౌందర్యములను ప్రదర్శించినందుకు సిగ్గుతో మురిసిపోయెడిది.

కోయవేషములో వెళ్ళినప్పుడు రామప్ప తుదిమెరుగులు దిద్దుతున్న నాగిని ప్రతిమ రూపురేఖలన్నియు అచ్చు గుద్దినట్లు తనదే తనభాగములే. రామప్పను రామప్ప శిల్పములను గాంచి రుద్రమ ఒళ్ళుమరచి పరవశించిపోయెడిది. తరువాత ఒకరోజు కుమారినను భావముకలిగి విచారించుట పరిపాటైనది. రామప్ప ఆ నగ్న నాగిని ప్రతిమ రహస్యభాగములను స్పర్శించినప్పుడు కలిగెడి కామ దహమును ఎలాఅణుచుకొనెడివాడో ఆ అడవులలో ఏకాంతముగా ఎలారాత్రులు గడిపెడివాడో రుద్రమ ఊహకందెడిదికాదు. దేవాలయములో ఇలాంటి శిల్పములను ఎందుకు ప్రతిష్ఠించుదురో రామప్ప చెప్పుచున్నప్పుడు విని పరవసించి రామప్ప పెనవేసుకొనెడిది. ఆసమయములో రాకుమారినను విషయమే మరచిపోయెడిది.

అప్పుడప్పుడు రుద్రమ రామప్పతో అవదులు దాటుతున్నప్పుడు ఆమె అంతరంగిక చెలుకత్తెలు నీవు రాకుమారివను విషయము గుర్తుచేసెడివారు. ఆమె ఆనందానికి రాచరికాలు అడ్డుతగిలెడివి. వెంటనే రాజదర్పములో దూరము నిలిచి ముసిముసి నవ్వులతో నగరమునకు వెళ్ళిపోయెడిది.

శివుని వాహనము నంది ఈ నందియొక్క అర్థము తెలుసుకోవలసియున్నది. శివశక్తి అనగా సూర్యుని నుండి ఉదయకాలమందు విశ్వమంతా వ్యాపించు ఒకానొక ప్రత్యేక శక్తికి' శివశక్తి' అని పేరు ఈ శివ శక్తికే "గో" అని పేరు ఈ శక్తి గోవుల యందు. గోసంతయైన

లక్ష్మీతత్వమును ప్రబోధించు 54దళములు కలిగి అష్టకోణాకృతిలో శ్రీచక్రం మలచబడినది. శైవాలయమునకు లక్ష్మీనుశిల్పలము మలుచుటలో శ్రీశక్తి నందులయందు వ్యాపించి ఉండును. అనగా "ఈ శక్తిని తీసుకొనివచ్చును" అను అర్థముతో శివునికి వాహనమని ప్రచారమైనది. శంకరుడు, విష్ణువు, బ్రహ్మ, కృష్ణుడు. రాముడు మొదలగు దేవతలు స్వతంత్రులుకారు. వీరు కూడా ఒక నిష్ఠతో ఒక ప్రత్యేక విధానముచే, యోగాభ్యాసముచే సూర్య భగ వానుని దివ్యశక్తులను సాధించి దేవతలైనారు. శంకరుడు నిత్యజీవితంలో యోగముద్రలో కూర్చుండి తపస్సు చేసుకొన్నట్లుగా మనందరికీ తెలుసు అనగా శంకరుడు ఈ సౌరశక్తియొక్క ప్రత్యేకమైన శివశక్తిని సాధించిన వాడుకావడంచేత శివుడని పేరు వచ్చినది. శివునికి వాహనము నంది అనున ప్పుడు శివశక్తి ఈ నందులద్వారా వ్యాపించునని తెలుసుకోవలసియున్నది. ఆ గుర్తు సూచించుటకే శివునికి వాహనముగా ఆలయమునందు నందిని ప్రతి ష్ఠించుట శాస్త్రయుక్తమైనది. నందిని. అవుని స్పర్శించిన మనకు సంక్రమించి మన శరీరమును శుద్ధిచేయునని భావము. శివుడు లయకారుడు. అనగా నాశ నము చేయువాడని అర్థముకాదు. శరీరమందలి విషమును తీసివేసి ధాతు లోప ములను సరిచేసి ఆరోగ్యమును ప్రసాధించువాడని అర్థము. ఈ కార్యమునే 'లయ' యని అందురు.

ఈ రుద్రేశ్వరాలయములో నాలుగు స్థంభముల మధ్యభాగమున ఉండ వలసిన ఈ నంది ఆలయమునకు తూర్పుగా ప్రవేశమార్గమున ఉండుట ఒక విశేషము సాధారణముగా ఇతర ఆలయములలో బలిపీఠముయొక్క స్థానమందే నందిని ఉండుట చూచెదము. కాని కాకతీయుల ప్రధాన ఆలయములైన వేయి స్థంభాల దేవాలయమందునూ స్వయంభుదేవాలయమందును, ఈరామప్ప దేవాల యమందునూ విడివిడిగా ప్రత్యేక స్థానములయందు ఉన్నట్లు చూచెదము.

ఈ నంది శిల్పము ఒకే నీలిశిలలో మలచబడినది. ఈ నంది నన్నని జిలుగు నగిశీ పనులలో శిల్పకళాశోభితమై నునుపు తేరి అద్దమువలె మెరియు చున్నది. మెడకు, కొమ్ములకు వీపుపైన ఈనాటి స్కాటు ముడులు కలిగి గజ్జెలు, మువ్వలు, హారములు, గొలుసులు, ఆకర్షణీయమైన పనితనముతో మలచబడి మూపురముచుట్టు కళ్ళకు శిల్పకళా ప్రతిభను ప్రదర్శించి చిన్నచిన్న గజ్జెలు, మెడలో గంట సహజసిద్ధముగా భూమిపై అనినట్లు చెక్కబడినది.

వీపు పైన అద్భుతమైన పనితనముతో అలంకార శిల్పములు నషము క్రిందికివాం సట్లుగా చక్కని పనితనముతో ఎంతో నేర్పును ప్రదర్శించి తీర్చిదిద్దిరి. నంది పండుకొనిన భంగిమ అద్భుతము.

రామప్ప దీని అలంకారవిషయమై ఎంతో ఓర్పును, నేర్పును ప్రదర్శించి నట్లు గోచరించును. రామప్ప ఈ నందిని శిల్పించుటకు రోజు బసవమంత్రిం పఠించెడివాడు. ఈ నంది ముఖకవళికలు గమనించినచో ఒక ప్రత్యేకత గోచరించును. కనుబొమ్మలు లేపి, చెవులు నిక్కరించి ఏదో శబ్దమును వినుచు లేచుటకు సిద్ధముగా నున్నట్లు గోచరించును. కనుగుడ్లపై వెలుతురు ప్రసరించు విధానము ప్రత్యేకమైనది. నందికి ముందు భాగమున మనము ఏ వైపున నిలబడినా కనుగుడ్లు మనవైపే త్రిప్పి చూస్తున్నట్లు గోచరించును. తనస్వామి యైన శంకరుని పిలుపు వినుచు లేచునట్లుగా ప్రత్యేక కోణములలో మలచబడి నది. చీకటిలో ఆకస్మాత్తుగా లైటువేసి చూపిన ముందుకాలు పైకిలేచినట్లు చలనం గోచరిస్తుంది. ఇలాంటి అద్భుతమైన శిల్పకళా చాతుర్యమును ప్రద ర్శించి చలనత్వం కలుగచేసిన రామప్ప యొక్క అసమాన ప్రజ్ఞకు ఈ నంది ఒక నిదర్శనం. ధీని యెత్తు దాదాపు 6 అడుగులు.

ఇలాంటి కళాఖండములు సృష్టింప జేయుటకు తగు ప్రోత్సాహము, పోషణ భారము వహించి, తన కళాప్రియత్వమును నిరూపించుకొనిన గణపతి దేవచక్రవర్తి ధన్యజీవి.

కాకతీయుల దేవాలయములయందే కాక భారతదేశ దేవాలయములందు గల నందులన్నింటిలో ఉత్తమమైన, సునిశితమైన పనితనము గలిగివున్నది.

దీనియొక్క అద్భుతమైన పనితనమును, శిల్పచాతుర్యమును గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము చలన చిత్రములలోని ప్రముఖులకు బహుమతి నిచ్చుటకు వెండి పలకముపై ఈ నందిరూపమునే చెక్కనము చేయించి ప్రధా నము చేయుట నిజంగా ప్రభుత్వముయొక్క కళాప్రియత్వమునకు మచ్చుతునక.

రామప్ప ఈ నందిని తీర్చిదిద్దుటకు దాదాపు 6 నెలలు కష్టించవలసి

వీపుపైన అద్భుతమైన పనితనముతో అలంకార శిల్పములు నడుము క్రిందికివాం నట్లుగా చక్కని పనితనముతో ఎంతో నేర్పును ప్రదర్శించి తీర్చిదిద్దిరి. నంది పండుకొనిన భంగిమ అద్భుతము.

రామప్ప దీని అలంకారవిషయమై ఎంతో ఓర్పును, నేర్పును ప్రదర్శించి నట్లు గోచరించును. రామప్ప ఈ నందిని శిల్పించుటకు రోజు బసవమంత్రం పఠించెడివాడు. ఈ నంది ముఖకవళికలు గమనించినచో ఒక ప్రత్యేకత గోచరించును. కనుబొమ్మలు లేపి, చెవులు నిక్కరించి ఏదో శబ్దమును వినుచు లేచుటకు సిద్ధముగా నున్నట్లు గోచరించును. కనుగుడ్లపై వెలుతురు ప్రసరించు విధానము ప్రత్యేకమైనది. నందికి ముందు భాగమున మనము ఏ వైపున నిలబడినా కనుగుడ్లు మనవైపే త్రిప్పి చూస్తున్నట్లు గోచరించును. తనస్వామి యైన శంకరుని పిలుపు వినుచు లేచునట్లుగా ప్రత్యేక కోణములలో మలచబడి నది. చీకటిలో ఆకస్మాత్తుగా లైటువేసి చూపిన ముందుకాలు పైకిలేచినట్లు చలనం గోచరిస్తుంది. ఇలాంటి అద్భుతమైన శిల్పకళా చాతుర్యమును ప్రద ర్శించి చలనత్వం కలుగచేసిన రామప్ప యొక్క అనమాన ప్రజ్ఞకు ఈ నంది ఒక నిదర్శనం. ధీని యెత్తు దాదాపు 6 అడుగులు.

ఇలాంటి కళాఖండములు సృష్టింప జేయుటకు తగు ప్రోత్సాహము, పోషణ భారము వహించి, తన కళాప్రియత్వమును నిరూపించుకొనిన గణపతి దేవచక్రవర్తి ధన్యజీవి.

కాకతీయుల దేవాలయములయందే కాక భారతదేశ దేవాలయములందు గల నందులన్నింటిలో ఉత్తమమైన, సునిశితమైన పనితనము గలిగివున్నది.

దీనియొక్క అద్భుతమైన పనితనమును, శిల్పచాతుర్యమును గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వలన చిత్రములలోని ప్రముఖులకు బహుమతి నిచ్చుటకు వెండి పలకముపై ఈ నందిరూపమునే చెక్కనము చేయించి ప్రదా నము చేయుట నిజంగా ప్రభుత్వముయొక్క కళాప్రియత్వమునకు మచ్చుతునక.

రామప్ప ఈ నందిని తీర్చిదిద్దుటకు దాదాపు 6 నెలలు కృషించవలసి

౦క్ష్మి తత్వమును ప్రబోధించు 54 దళములుకలిగి అష్టకోణాకృతిలో శ్రీ
చక్రము మలచబడినది. శైవాలయమునకు లక్ష్మి శిల్పమును మలచుటలో శ్రీ
క్తిని పలురకాలుగా భిన్నప్రయోజనాలుగా నిరూపించబడినది. ఈ
క్ష్మి శిల్పము ఈ ద్వారమునకు ఒక ప్రత్యేక అందమును ఆకర్షణను కలుగ
జేయుచున్నది గోడపై ఒక విప్పారిన పద్మము మలచబడినది.



లక్ష్మిని విష్ణుమూర్తికి భార్యగను, లక్ష్మిని నరసింహస్వామికి
భార్యగా లక్ష్మినరసింహస్వామిగా మరియు లక్ష్మియొక్క అంశమే సీతాదేవిగా
లక్ష్మిని గణపతికి భార్యగా లక్ష్మిగణపతి అనియు తెలుపబడినది. మరి లక్ష్మి
యనగా ఏమిటనుభావము కలుగవచ్చు? లక్ష్మియనగా స్త్రీయే అవుతుందిమరి
పద్మమునకు లక్ష్మికి పద్మమునకు సూర్యునికిగల సంబంధము రహస్యమైనది

కమల బాంధవుడు సూర్యుడు సూర్యునినుండి కమలము శక్తి సేకరించి స్త్రీల రజశ్శక్తిని పెంచుటయే ఇందులోని రహస్యము. ఈ జన్ను ఎనిమిదిరకాలుగా వర్గీకరించిరి అవియే అష్టశక్తులు పెద్దలకు పూలదండలువేయుట స్త్రీలు అధికముగా పుష్పములను కోరుట దేవునిగుడిలో పుష్పములతో పూజలుచేయుట అందులోని సువాసన మానవ జీవితమును కాపాడుటయే ఈ సువాసన ద్రవ రూపములోకిమారును. ఈ ద్రవరూపమునే తేనెటీగలు గ్రోలును. ఈ తేనె అమృతముగా చెప్పబడినది. ఇదియే మగవానికి అమూల్యమైన దసరా శిగా పేర్కొనబడినది. అదియే వరకట్నము రాముడు సీతను వివాహమాడినది డబ్బులగురించి ఈ దసరాశిగురించియే.

## సప్తస్వరములు పలికే శిల్పము:

గర్భాలయబయటి ద్వారములోనికిరువైపులా ద్వారశిల్పాలు నాట్య భంగిమలతో అభినయిస్తు సాక్షాత్కరిస్తాయి. ఈ ద్వారమునకు కుడివైపున శబ్దస్తంభముగలదు. సరిగమలను తృప్తిచేయుటకు ఈ స్తంభమును ఒకలత అల్లుకొనినట్లుగానుండి స్తంభమునుండి వేరువేరు స్వరములను వినిపించుచున్నది స్తంభ మధ్యభాగమును వేలితోతట్టినచో ప్రత్యేకధ్వనులు సృష్టింపబడు చుండును. ఈ స్తంభమును మలచుటలో రామప్ప తన శిల్ప చాతుర్యమునే గాక రాతినుండి శబ్దములను సృష్టించు మహత్తర ప్రయోగంచేసి ఓహో అనిపించుకున్నాడు ఈ స్తంభమునుండి వెడలు స్వర తరంగములకు అనువైన వివిధ హావభావ ముద్రలు భంగిమలు శిల్పరూపమున వ్యాఖ్యానించి తన ప్రత్యేక శిల్ప చాతుర్యమును నిరూపించుకున్నాడు.

ఈ ద్వారమునకు చుట్టూ చక్కని పనితనముగలిగిన శిల్పములు గోచరిస్తాయి. ద్వారమునకు ఊర్ధ్వభాగమున శివుడు దేవగణముతో పరివేష్టించియున్న శిల్పములు మలచబడి ద్వారమునకు అందము చేకూర్చుచున్నది ఈ నాట్య భంగిమల శిల్పములను పైభాగమునకు చిన్నసైజు శివతాండవశిల్పములకు చుట్టు వాయు బిళములుగలిగి గాలి తెరగా మలచబడినది. ఈ బిళములద్వారా

వెలుతురు గాలి ప్రవేశించుటకు చక్కని అవకాశముకలదు. గర్భాలయములో శీతలీకరింపబడి ప్రాణవాయువుగా మార్చబడినది ఈ వాయువులు అంతరాళము లోనికి ప్రవేశించి అందులోని వాయువుయొక్క కాలుష్యమును నివారించి భక్తులకు ప్రాణవాయువు అందజేయు ప్రత్యేక ఏర్పాటుగలదు.

కాకతీయ శిల్పులు వారి శిల్పశైలిలో ఉభయ ప్రయోజనాలను ప్రవేశ



పెట్టి అద్భుత ప్రయోజనాలను కలుగజేసినారు. ఈ వాయుతెరలు నాట్య శిల్పములు నీలి శిలలోనే మలచబడినవి. ఈ నీలి శిలకు వాతావరణ కాలుష్యమును హరింపజేయు ప్రత్యేక తత్వముగలదు.

లోకవ్యవహారం తెల్పు శిల్పం :-

ఈ ద్వారమునకు కుడివైపున లోకవ్యవహారములోగల భావమునకు రూపకల్పన చేయబడినది. అప్పు ఇచ్చినవాడు పుచ్చుకొనినవాని భావములను చమత్కారముగా మలచినాడు. అప్పు ఇచ్చినవాడు పుచ్చుకున్నవానిది కుడుస్తున్న లఘు శిల్పము చూపరులకు సంభ్రమాశ్చర్యములను కలుగజేయుచున్నది. గోపాలుడు వేణువును ప్రయోగించుచున్నట్లుగాను పూలహారములతో రతీమన్మధ శిల్పములను చక్కగా మలచినారు. వాయు శిఖములనానుకొని అరువది భంగిమలు వృత్తాకారములో మలచబడినవి. ఈ మధ్యవరుసలో పది భంగిమలలో తొమ్మిదిమాత్రమే పేరిణీనృత్య సాంప్రదాయమునకు అనుకూలమైనవి. మిగత శిల్పములు మృదంగ వాయిద్యకుల శిల్పములు.

శివుడు పంచముఖ దీని ఆధారముగా ఐదుజతులు కూర్చబడినవి పేరిణీలో అంగములు ఐదు. నృత్యము కైవారము ఘర్ఘరము, వికటము గీతము, ఇవి జాయప్ప తన నృత్యరత్నావలిలో పేర్కొనబడినవి.

శుద్ధ, దేశి. పేరిణీ ప్రేంఖనణములు ప్రదర్శించే ఆచారముగలదు. ఈ పేరిణి నృత్త, నృత్య అభినయదలతో గూడిన దానిని నేనర్తమిలనియందు

శైవ ఆగమ సిద్దాంతం ప్రకారం వీర శైవులు పశుపతి సాంప్రదాయములో నృత్యంచేస్తారు. ఆగమ పద్ధతిలో నృత్తముండును. అటుపై స్తోత్రగీతములు, వర్ణనగీతములు గీతప్రబంధములు ఆడుదురు. స్త్రీలరీతి శృంగార భరితమనపేరు.

ఆయతము పుష్పాంజలి తహానము యితి నర్తనము మహాసీమ వినాయకులకు కౌతములు శివ పార్వతులకు కైవారనృత్యములకు అటుపై యిరువదిఐదు విధమ్ములైన భ్రమణములతో కూడిన భ్రమర నర్తనము అర్ధనారీశ్వర నర్తనము పరమేశుడు పర్వత శిఖరముపైచేయు శృంగనర్తనము నవరస అంగహార నర్తనము. గంగావతరణము, శివలీలలు ప్రదర్శితమగును. అటుపై పృధ్వాప్ తేజోవాయువు ఆకాశ శివమూర్తులకు కైవారముల ఏకాకార రుద్ర నర్తనము దశవిధ శివలీలలు ప్రదర్శింపబడును. ఆఖరు వనర్తనము శివ పంచముఖశక్తి నర్తనము ఈ నర్తనములు శక్తిప్రధానమైనవి.

మాఘే కృష్ణ చతుర్థశ్యాం అదిదేవో మహానిశి,
శివలింగతయో ద్భూతః కోటి సూర్య సమాప్రభః ।
తస్మాచ్ఛివ సమారాత్రిః సమాఖ్యాతా శివప్రియా
తస్యాం సర్వేషు లింగేషు సదా సంక్రమతే హరః ॥

పరమ శివుడు మాఘకృష్ణ చతుర్దశినాడు నిశీధి సమయములో కోటి సూర్యులకాంతితో లింగ రూపంలో ఆవిర్భవిస్తాడు. ఒక ప్రత్యేక స్థూపాకృతి అనగా ఆ తేజః పుంజము స్థూపాకృతిలో నుండుటచే ఆతేజస్సుకు రూపకల్పన యేస్థూపాకృతి.

శివ ప్రియా తదుపాసనార్థా రాత్రిః శివరాత్రిః
మాఘేకృష్ణ చతుర్థశ్యా రాత్రేణి శివపూజన
వ్రతాదికం క్రియతే ఇది తస్యాం రాత్రేః తత్ప్రియత్వః

అని అంటారు నవరాత్రి గురించి ఏవిధముగా వ్రత పరమైన అర్థాన్ని స్తుందో అలాగే లాక్షణికంగా శివరాత్రి శబ్దం కూడా శివరాత్రి వ్రతం అనే అర్థాన్నిస్తుందని నిర్ణయశింధ వ్యాఖ్యాత పేర్కొన్నాడు.

స్కాందపురాణం శివరాత్రి వ్రతాన్ని నాలుగు రకాలుగా చెప్పింది. ఎప్పుడు ప్రతి అహమురాత్రి నాలుగు యామాలు శివారాధన చేయడం మాసశివ రాత్రి వ్రతమని సోమవారంతో అమావాస్య తిథి కలిపిన రోజున ఉపవాస ముండి శివున్ని పూజిస్తే దానిని యోగిక శివరాత్రి వ్రతమని పేరు.

పేరిణిలో ఐదు జతులు విడివిడిగా ఐదుసార్లు నృత్యం చేయబడును. ఈ వాయు తెరలో మధ్యవరుసలోని తొమ్మిది భంగిమలు ఈ ఐదు జతులు $9 \times 5 = 45^\circ$ కోణాకృతి కలిగిన చేతులను చేతి ముద్రలను కాళ్ళ కాళ్ళ భంగిమలు $90^\circ$ల తర్వాత $180^\circ$లుగా వృత్తరూపం దాల్చగా $360^\circ$లు అగును ఇది పేరిణి శివతాండవములో చేయబడు నృత్యరూపము ఈ ముద్రల భంగిమల ఆధారముగా బలిపీఠముపై తాండవనృత్యము చేయబడును.



పేరిణి శివతాండవ లఘుశిల్పములు గాలిగోపుర

శివుణ్ణి ప్రేరణ
ఈనృత్యానికి "పేరిణి
తాండవము" అనిశాస్త్రీ
నామము కలదు. "శ
అనగా-ఉదయ కాలమం
విడుదల చేయబడు సౌ
శక్తిలోని ప్రత్యేక అ
కిరణశక్తి కిరణము
యుక్తముగా ఒక ప్రత్యే
పరిధిలో చేతులను కళ్ళ
త్రిప్పుతూ మహావేగము
నృత్యము చేయుటవల
శివశక్తి శరీరమందు ప్ర
శించి శరీరము శక్తివం
ముగా తయారుచేయబడి
ఒక్క పెట్టుతో మదగజ
మును సంహరించగలిగే
బలము చేకూరును. ఇప్పటి
కరాటే పద్ధతిలోని విధానముకంటే లక్ష రెట్లు శక్తిని కలుగజేయును. ఈ సౌర
శక్తినే "శివశక్తి" అందురు.

నృత్యము చేయునప్పుడు నృత్యమాడువాని అసలు రూపముమారి శివ
శక్తి చేకూరుటవలన శివుడే అతనితో చేరి తన్మయత్వముల్లు తాండవము
చేయించును. చేతులను, చేతిముద్రలను, నలుబదిఅయిదు డిగ్రీల కోణములో
తొంబయి డిగ్రీల కోణములో కాళ్ళను ఎత్తి మడుచుకుంటూ త్వరగతముగా
చేయుట ప్రస్తుతం ప్రచారములోనున్న కరాటే పద్ధతికిసరిపోవును.

నృత్యమువలన శరీరము వేడెక్కి చమట పట్టును. - శివుని నాట్య
శిల్పములను కాంస్య ప్రతిమలను గాంచుచున్నపుడు శివుని భంగిమచుట్టు అగ్ని

జ్వాలతో మండుచున్న గోళము కపిపించును. మరియు కాళ్ళదగ్గర రాక్షసుని రూపముగల ప్రతిమ గోచరించును.

అంగికం, భువనం యస్య వాచికం సర్వ వాఙ్మయం
ఆహార్యం చంద్రతారాదితం వందే సాత్వికం శివమ్॥

దక్షిణోర్ధ్వ భుజముననున్న ఢమరుకము సృష్టిక్రియాసూచకము వామోర్ధ్వ భుజముననున్న అగ్ని సంహారసూచకము, దక్షిణహస్త పతాకము విజయసూచకము, వామహస్తభయముద్ర వరప్రదాన సూచకము, ఊర్ధ్వ ప్రసారితమగు పాదము శాంతి, భవ, బంధ విమోచన సూచకము క్రింద నున్న రాక్షసరూపము శరీరమందుగల దుష్టపీడన నివారణకు సూచకము.

ఆలయములలో పూజాసమయములలో ప్రదర్శించు సప్త తాండవములు శుద్ధ, దేశీ, పేరిణీ, ప్రేంఖన, దండిక, కుండలినీ, కలశ ఈ నృత్యము పంచ భూతాత్మకమైన ఈ ప్రపంచములోను చేతన, చేతనములయొక్క సృష్టి, స్థితి లయములకు వివిధ విన్యాసరూపములలో ప్రదర్శింపబడునట్టి భావాత్మకమైన నృత్యవిశేషము, మూర్తిత్రయమున కతీతమైన మహాశక్తియే విశ్వరూపము.

శివుని తాండవములు ఏడు విధములు, 1. ఆనంద తాండవము, 2. సంధ్యా తాండవము, 3. కలిక తాండవము, 4. విజయ తాండవము 5. ఊర్ధ్వ తాండవము. 6 ఉమా తాండవము, 7. సంహార తాండవము.

ప్రపంచాభివృద్ధి నిరోధకములగు అజ్ఞానము అవివేకి మొదలగు దుష్ట శక్తులను హతమార్చి అఖండ జ్యోతిని వెలిగించుటకు ఏర్పడినదే కపాలధరుని కలిక తాండవము.

గజాసుర సంహారమే విజయతాండవము అనబడును. పూర్వము ప్రపంచముయొక్క శ్రేయోభివృద్ధులను భంగముచేయగలుగు మంత్రశక్తులను కొందరు ఋషులు కలిగియుండిరి. వారిని వారించి దుష్టశక్తులను సంహరించి వారిని సన్మార్గమున సంచరింపచేయు శక్తికల్గి అర్ధనారీశ్వరుడు ఋషిరూపము

దాల్చి వారినోడించి గజమును పురిగొల్పగా దానిని వెన్నెము కవిదచెను అప్పుడు దేవతలు ఆనందించిరి.

ఈ నాట్యములు చేయునప్పుడు భావమును ప్రకటించుట క్రమబద్ధముగా చేయుటవలన తాళ, మేళ. శంఖునాధములచే చూచువారికి కూడా ప్రకృతి శక్తులు చేకూరి భయంకర రోగనివారణ చేయగలుగును. అనుభూతి అతి ప్రధానమైన విషయము.

జతుల మూలమున వర్షము కురిపించుట, వేడి సృష్టించుట, మలయ మారుతము వీచునట్లు చేయుట జరుగును. ఈ పేరిణిలో పంచముఖముల శబ్దములాంటి వాటిని జొప్పించి మృదంగ, తాళ, శంఖానములచే సూక్ష్మ శబ్ద తరంగములను సృష్టించి ప్రేక్షకులు నృత్యముద్వారా తన్మయత్వములో రసానుభూతి పొందేవారి గుండెను, గుండెభాగములకు, వీర్యకోశములకు, నాడీ మండలమునకు శక్తి ప్రసారింపబడి ఆరోగ్యవంతులగుట ఎన్నెన్నో వ్యయ ప్రయాసముల కోర్చి కనిపెట్టిన మహత్తరమైన ప్రయోగమే పేరిణి శివతాండవము. ఏ కృషి వెనుకైన ఒక ఆశముండును. ఏ ఆశయసాధన లేకుండా ఇంతటి కృషిఅనవసరము. శివతాండవము శైవారాధనలోచేసే ప్రత్యేకనృత్యం.

శివుని పూజలలో అనేక రకాలైన నర్తనలుండెడివి, శైవవీరులు దినమునకు ఆరు పర్యాయములు శివున్ని (శివశక్తిని) నృత్యనాలతో ఆరాధించేవారు. శివప్రియంవారి ప్రత్యేక నర్తనము. శివరాత్రి రోజున నాగలింగార్చన కాలమున ఊర్ధ్వ తాండవమునకు ప్రత్యేముగా ప్రదర్శించినారు. మాఘ బహుళ త్రయోదశినాడు, మహాశివరాత్రి నాడు ఉత్సవ వేడుకలు, ఉత్సవము ఉత్ + సవః ఉత్ అనగా— నివారింపబడును. సవః— దుఃఖము, ఉత్సవముల యొక్క ముఖ ఉద్దేశము శరీరములోని పీడిత శక్తులను నివారించుటయే ఈవేడుకలు ఘనముగా ప్రదర్శింప బడెడివి. ఈ విధముగా శివ లీలలో శివతాండవమునకు సంబంధించిన అనేక నృత్యములు చేసెడివారు.

# శివరాత్రి యొక్క ప్రాముఖ్యతలోని శాస్త్రీయ రహస్యము

శివ
శివ శక్తి
శివ జ్యోతి
శివరాత్రి
మహాశివరాత్రి
శివధనుస్సు
శివలింగం - నాగలింగము
శివ శంకర

శివ అనునది అణుశక్తి కిరణమని తెలుసుకున్నాము. ఈ అణుశక్తి శరీరములోనికి అవాహన చేసుకొనుటద్వారా శివశక్తి చేకూరును.

ఈ శక్తిని ఆవునేయితో వెలుగు జ్యోతులద్వారా ఉత్పత్తి చేయవచ్చును. దీనినే శివజ్యోతి అందురు.

ఈ శక్తి కొన్ని ప్రత్యేక తిథులయందు అనగా చతుర్దశినాడు నిశీధి సమయములో సూర్యుని నుండి వెలువడును. కావున ఆ రాత్రి మేల్కొనుట వలన కనులద్వారా యీశక్తి చేరి భయంకర రోగనివారణ గావించును. ఆరోజు భోజనము చేయకుండా పాలుమాత్రమే (ఆవుపాలు) సేవించి పవిత్ర మనస్సుతో నున్న వారికి ఈ శక్తి చేకూరును.

కొన్ని సంవత్సరముల కొకసారి సూర్యునిలో జరుగు మార్పులవలన యితర గ్రహ, నక్షత్రముల శక్తిని సంతరించుకొని స్థూపాకృతిలో భూమి నుండి ఆకాశము వరకు వ్యాపించు ఒక దివ్య తేజ పుంజమును లింగమని అది విడుదలచేయబడు ప్రత్యేక రాత్రినే మహాశివరాత్రి యని మన శాస్త్రజ్ఞులు నామ కరణము చేసిరి.

ఈ శక్తి ప్రత్యేక పద్ధతిలో ప్రవేశ పెట్టబడిన దనుస్సుకు శివ దనుస్సు యని పేరు.

ఈ అవినాభావ సంబంధమైన శక్తి ప్రసార పాధము గల నీల శిలకు శివ లింగమని శాస్త్రీయ నామము.

ఈ శక్తి నియోగిపుంగవుడైన శంకరుడు ప్రత్యేక కోణములలో ప్రత్యేక సమయములలో శాస్త్రీయమైన శివతాండవముచే సాధించి శరీరమంతా అవాహిన చేసుకొని శక్తి సంపన్నుడై శివ శంకరుడుగా ఖ్యాతి గాంచి లోకకళ్యాణము చేసెను.

మన పూర్వులు ఈ శక్తులను సాధించుటకు కృషి చేయలేనివారికి సంక్రమింప జేయుటకు ఈ దివ్యశక్తి లేదా అణుశక్తి అలయములద్వారా ప్రవేశ పెట్టిరి. ఈ దేవాలయములనే శివాలయములని యందురు. కాని కొందరు ప్రత్యేక సాధకులు ఉదయకాలమందు నాట్యము చేయుటద్వారా ఈ శక్తి శరీరమందు చేరి శివశక్తిగా ప్రసిద్ధేయును.

పంచాక్షరి మంత్రముతో శక్తిని సాధించనచ్చును. ప్రత్యేక జాములలో జాగరణలు చేయుటద్వారా దివినుండి విడుదలైన శివశక్తిని శరీరమందు చేర్చుకొని తరించుటకు శివరాత్రి పండుగకు ప్రాముఖ్యత లభించినది.

మహాశివరాత్రి ఒకమహాతేజం జ్యోతిర్జ్వాలామయమై బ్రహ్మాండము నుండి భూమివరకు ఆవరించి వెలుగుతూ ఉండే ఈ శక్తి ప్రత్యేక నదులయందును, కొన్ని పక్షులందును, కొన్ని ధాతువులందును ప్రవహించును.

## బలిపీఠం, బలిహారం

పూర్వ కారణాహుము పరివార బలిక్రమ విధి పటము నందు.

"అలయ సర్వ దేవానాం మూలాధార ఇతి స్మృతం"
సర్వదేవతలకు అలయము మూలాధారమని చెప్పబడినది.

"యన్త్రం మంత్రమయం ప్రోక్తం మంత్రాత్మా దేవతైవహి"

యంత్రము మంత్రములతో కూడుకొని యున్నది. "మంత్రము" అనగా దేవతయొక్క ఆత్మ అని చెప్పబడినది.

సూర్యునినుండి విడివడి విశ్వవ్యాపితమై యుండే సకల జీవులకు ప్రాణ దానం చేయు వివిధ రకముల శక్తులకు దైవశక్తులని పేరు దీని నుండి విడుదలైన శక్తులను ఆలయమందు ప్రవేశ పెట్టుటచే దేవాలయములైనవి. ఈ శక్తులనే ప్రత్యేక శక్తి బీజములచే ప్రత్యేక శ్రేయస్సును పదములను శాస్త్రోక్తముగా ఉచ్చరించుటవలన కూడా శబ్ద తరంగరూపమున పొందవచ్చు. ఉచ్చారణ దోషముండుటవలన అందరికీ ఈ శక్తులు సంక్రమించ జాలవు. కావున అన్ని రకములవారికి దేవాలయములే శరణ్యమయినవి. ఇది ఒక పద్ధతి శక్తి బీజాలను గురుముఖంగా అభ్యసించవలెనని వేదనియమము కలదు.

## "బలదో బలి ముచ్యతే"

బలము నిచ్చునది కావున బలియని చెప్పబడినది. వాద్యములతో కర్ణానందకరముగా, నయనానందకరముగా చేయబడు నృత్యములవలన ఈ దైవశక్తులు కర్ణేంద్రియములద్వారా నేత్రములద్వారా గూడా సంక్రమింప జేయుటకు ఇది కూడా ఒక మార్గము.

ఈ దేవాలయములో బలిపీఠము స్థానములో నందీశ్వరుడు ఉండవలసినది కాని నాలుగు స్తంభముల మధ్య విశాలమైన వర్తులాకారము బలిపీఠము నిర్మింపబడుట ఒక విశేషము. ఇది అద్దమువలె నునుపుదేరి యుండెడిది. ఈ బలిపీఠమందు నర్తకి అలంకరించుకొనిన అందచందాలు వంపుసొంపులు స్పష్టముగా గోచరించెడివి. నర్తకి యొక్క అంగ సౌష్టవము గాంచి రసానుభూతి పొందెడివారు.

మహామంత్రి, సామంత దండనాధుల సమక్షమున చేయబడు నృత్యము వేరుగా నుండెడిది. నాట్యకర్త లయ విన్యాసములతో తాళ మేళ, యుక్త

ముగా నాట్యమాడుచూ, నిదమెత్తుట, రసికులు, పండితులు, పొడపు ప్రశ్నలు వేయుట నాట్యం చేస్తూ చేతిముద్రలతో ప్రత్యేక భంగిమలతో సమస్యలను విప్పుకుంటూ సభికుల కానందాబ్ధిలో ముంచెత్తె ఆచా శముడెడిది. ఇది రసానుభూతి కలిగించు ఒకానొక ప్రత్యేక విధానము.

## స్థంభముయెక్క శిల్ప శోభ



ఈ బలిపీఠమునకు నాలుగు నాలుగు వైపుల నాలుగు స్తంభములుగలవు. ఈ స్తంభములు మహోన్నతమైన శిల్పశోభితమై హొసల స్తంభ సౌందర్యమును మించి యున్నవి. ప్రత్యేకముగా ఈ స్తంభ శిల్పముపై యేయితరశిల్ప సాంప్రదాయ ప్రభావము పడినట్లు కానరాదు. ఈ శిల్ప శైలి ప్రత్యేకమైనది. కాకతీయ శిల్పియైన త్రిపురారి యీస్తంభముల శిల్పనిర్మాణ బాధ్యత వహించెను. రామప్ప సలహాతో మొత్తము 8 మంది కాకతీయ శిల్పులు తీర్చి దిద్దిరి. కామారిష్టపతి, భైరవభట్టు, మారన్న, విజయభట్టు, నాగశిపుడు, బసవాచార్యుడు, దేవోజు, కాలనాగు, బమ్మోజు, చిన్నన, రామన్న, జక్కన్న, రామన్న, పద్మోజు, కుభ్రివర్తి మొదలగు శిల్పులు అతిసున్నితమైన జిలుగు పనితనమును అవధుల మేరకు తమ ప్రతిభను ప్రదర్శించిరి.

స్తంభమునకు క్రింది భాగమున ఊర్ధ్వ ఘనపుటాకారమున ఘనములకు క్రింది భాగమున నాలుగు ముఖతలముల పై చక్కని శిల్పములు మలచబడినవి. ఒక తలముపై సప్తకన్యలు పూర్తి నగ్నముగా నుండి నాగుపాములను ధరించి నట్లుగాను ఒక తలముపై కోలాటములు, సముద్ర మథనము, నాట్యగణపతి గోపాలుడు గోపికల వస్త్రములు అపహరించిన లఘు శిల్పములు చిత్రవిచిత్ర లఘు శిల్పములు ఎంతో రమణీయముగా మలచబడినవి. క్రింది భాగమున గాజుల కటింగ్ డిజైనులు, నాట్య భంగిమలు, గుండ్రముగా స్తంభముచుంటూ కోలాట శిల్పములు త్రిశూలాకారములో త్రిసరములు వేనోళ్ళ పొగిడినా, కనులారగాంచినా తనివితీరని శిల్ప సౌందర్యము. ఈ లఘు శిల్పములన్నియు పైకుబికినట్లుగా మలచబడినవి. స్తంభము పైభాగమున చుట్టు హంసలవరుస ఈ స్తంభము ఇతర స్తంభము శిల్పములతో పోల్చి చూచినచో ఈ శిల్ప సౌందర్యము భావగాంభీర్యమై ఒప్పుచున్నది. స్తంభ పై భాగమున వ్రేలెడు పొడుగు త్రిసరముల వరుసలు గొడుగు ఆకారములో చెక్కబడినవి. స్తంభ ముల మధ్య భాగములు లేత్ మిషన్ పై సంగడి పట్టినట్లుగా భ్రమ కలుగుతుంది. యీ స్తంభముల యొక్క ఘన చతుర్ముఖ తలములపై 6 అంగుళముల పరి మాణముగల అనేక భంగిమల శిల్పములు మలచబడినవి.

గోపికా వస్త్రాపహరణ శిల్పములలో నగ్నముగా నున్న గోపికా శిల్ప ములు పొంగారు వక్షోజాలు కలిగి లజ్జా భరిత వదనములతో చేతులు పైకెత్తి కృష్ణున్ని చీరెలడుగుతున్న యీ శిల్పకార్యము ప్రేక్షకులను తన్మయత్వము కలిగించును.

ఒక వైపు శృంగారమును ప్రదర్శించుచూ మరొకవైపు భక్తి భావము ప్రదర్శించుచూ శిల్పి తన శిల్పకళా నైపుణ్యమును, చమత్కృతిని ప్రద ర్శించెను, నలుగురు నర్తకులకు 8 కాళ్ళకు బదులుగా 4 కాళ్ళనే మలిచి ఎనిమిది కాళ్ళున్నట్లుగా భ్రమ కల్పించినాడు. పాలంపేట పరిసరములకు సంబంధించిన జాజర పాటల శిల్పములు మనోజ్ఞముగా మలచబడినవి. పొట్టి కాళ్ళు పెద్ద పొట్ట కలిగి నాట్యమాడుచున్న గణపతి శిల్పము చూడముచ్చటగా నున్నది. త్రిభంగి నృత్యము కనులు జిగేలుమనిపించుచు ఉన్నత శిల్ప

ప్రమాణము లందుకున్న ఈ శిల్ప స్తంభములు ఆలయమంటపమునకు ఎనలేని శోభను చేకూర్చుచున్నవి.

ఈ శిల్పకళా వైభవమును గాంచి ఎవరి నేత్రదృష్టి దోషము కలుగునో నని దృష్టి దోషనివారణార్థమై రామప్ప ఒకస్తంభము ముఖతలమున వల్లముగా మలచబడినట్లు మాత్రమే అందరికి గోచరించును. కాని యిందులో ఆలయ ప్రధాన శిల్ప భాగమంతయు లీలగా కనబడునని ఒక వదంతి కలదు.

స్త్రీ కేశాలంకరణ పద్ధతులు అద్దములో తన కేశాలంకరణ శోభను అవయవ సౌష్టవమును గాంచుచు మురిసికోయే శిల్పములు అందముగా గోచరిస్తాయి. కృష్ణుడు వేణువును మ్రోగించుచుండగా పరవశముతో నాట్యమాడు గోపికలు మరొకవైపు నగ్నముగానుండి తపోభంగ మొనరించుచూ సప్త కన్యలు ఈ స్తంభ శిల్పకళా నైపుణ్యమునకు మచ్చుతునకలు.

ఈ స్తంభముల ప్రత్యేక విశేషమేమనగా తూర్పున సూర్యుడు ఉదయించునప్పుడు వెలుతురు గర్భాలయములో ఏ మేరకు ప్రసరించునో సూర్యుడు పడమర అస్తమించునప్పుడు గర్భాలయములో అంతే వెలుతురు ప్రసరించుట గమనిస్తాము. దీనికి కారణమేమనగా స్తంభములు ముందు భాగమున గల నంది ఈ వెలుతురు కిరణములను గర్భాలయములోనికి ప్రసరింపచేయుచున్నవి. గర్భాలయ ముఖద్వారమువద్ద అనగా బలిపీఠము యొక్క స్థానమున నుండవలసిన నందిని ప్రవేశ ద్వారమువద్ద నుంచుటవలన పడమనవైపు కిరణములు నంది ముఖముపై ప్రసరించి గర్భాలయమునకు చేర్చబడుటవలన ఉదయకాలపు వెలుతురువలెనే గర్భాలయము తేజస్సుతో కూడియున్నది.

బలిపీఠమునకు పైభాగమున లోకప్పు భాగమునకు కమ్మలను అమర్చడములో సిద్ధహస్తులైన నాగలింగస్వామి, రుద్రకాళయ్య, భుజంగ స్థపతి కుమారస్వామి, భవభూపతి, కాశీపతి మొదలగు వారందరూ దక్షిణ దేశము

నుండి ఆహ్వానింపబడిన శిల్పులు వీరు శిలలను సంధానించుటలో నేర్పరులు. చతురస్రాకారములో మహాపద్మరాజమును అమర్చిన తర్వాత వాస్తురీత్యా వచ్చిన ఖాళీలను నాలుగు మూలల్లో నాలుగు త్రిభుజాకారపు శిలా ఫలకములను అమర్చినారు. వీటిపై అమర్చబడిన శిల్పములు భావయుక్తముగా ప్రతి అంగుళములో శిల్పకళ గోచరిస్తుంది.

పై కప్పు కమ్మీలపై శివలీలలు, శివుడు నందిపై కూర్చున్నట్లుగా ఇరువైపుల నాట్య భంగిమలు కలిగి, దక్షయజ్ఞములో శివుడు తప్ప దేవతలందరు పాల్గొన్నట్లుగా మలచబడినది. ఈ త్రికోణములో విష్ణుమూర్తి శిల్పముండుట విశేషము. మహావిష్ణువు పాదములవద్ద లక్ష్మీదేవి కూర్చున్నట్లుగా. బొడ్డు నుండి వచ్చిన పద్మములో బ్రహ్మదేవుడు కూర్చున్నట్లుగా మలచబడినది. బ్రహ్మ, సరస్వతి, కృష్ణలీలలు జైన శిల్పములు మొదలగు భారత పురాణ జైనగాధల శిల్పములు అతిరమణీయముగా మలచబడినవి. ఈ శిల్పములను మలుచుటలో శిల్పులు వారి పనితనమును అవధుల మేరకు ప్రదర్శించినారు. కృష్ణలీలలు, శివలీలలు, విష్ణుమూర్తి శిల్పములు. కాకతీయుల మత సహనానికి ప్రతీవగా వెలసినది.

విజయనగర శిల్పములు ఉన్నత ప్రమాణము లనందుకున్నప్పటికివి కాకతీయుల వాస్తు శిల్పస్థాయిని అధిగమంచలేక పోయినది. కాకతీయ శిల్పులు ఆలయములో కావలసిన ముఖ్యభాగములకు సున్నితమైన పనితనమును ప్రదర్శించుటకు నీలి శిలలనే వాడినారు. నల్లరాయి సున్నితమైన శిల్పభాగములను మలచుటకు అనుకూలముగా నుండి శిల్పములు తళతళ మెరియుటకు సహకరించును. నునుపు చేయుట ఎక్కువ ఖర్చుతో గూడిన పనికాబట్టి విలువైన శిల్పములను సూక్ష్మమైన పని తనమును ప్రదర్శించుటకు ఎంతో విలువైనజాతి వజ్రములను వాడినారు. కఠినాతి కఠినమైన నీలి శిలలను వజ్రము రంపము మాదిరిగా కోయుటకు వజ్రపు రజములో నునుపు చేయుటకు వాస్తు శిల్పశాస్త్రములో వజ్రము ప్రముఖ పాత్రవహించినది.



మహాపద్మరాజముచుట్టూ త్రిభుజములలో మలచబడినది. శివతాండవ శిల్పము శివునియొక్క శక్తిని బ్రహ్మ, విష్ణుల తాళ మేళములతో అంజలు లర్పించుచున్న శిల్పము పై భంగిమ-అత్యంత శక్తివంతమై భంగిమ దీనిని "కరాటే"లో జపాన్‌వారు Crame Stance pose అని యందురు. ఈ భంగిమవలన శరీరములోని ఏ భాగము ఎంతవరకు శక్తివంతముగా గలదో ఈభంగిమతో తెలుసుకొనవచ్చును. ఈ శక్తిచేతనే అతి బలవంతులగు రాక్షసులను ఏనుగులను వధించెను.

మానవునిలో బుద్ధిలోపించి పశుప్రవృత్తి పెరిగినప్పుడు హింసాత్మక వాతావరణం స్వైరవిహారం చేస్తున్నప్పుడు చట్టముద్వారా అదుపులోనికి తెచ్చుట అసాధ్యమైన విషయము ఇటువంటి పరిస్థితులలో సమాజమును అదుపులోనికి తెచ్చుటకు ఆధ్యాత్మిక ప్రచారముతోపాటు దేవాలయములనిర్మాణముకూడ విస్తృత రూపములో చేయవలసి వచ్చినది. ప్రజాశ్రేయస్సు దృష్ట్యా ఈ ఆలయము శైవసాంప్రదాయముగల రుద్రేశ్వరాలయముగా నిర్మాణము చేయవలసివచ్చినది ఆధ్యాత్మికము దైవసంబంధమైనది. కావున ప్రజలు మానసికముగా అదుపులో నుండి అకృత్యములు చేయుట మానుటకు, మానసిక పరివర్తనకు అది

అత్యంత ఆవశ్యకమైన విషయము. నృత్యగానముల ద్వారా శివశక్తిని లేక సౌరశక్తిని పొందుటకు ప్రవేశ పెట్టబడిన మహత్తరమైన శాస్త్రీయమైన విధానమే ఈ శివతాండవ స్వరూపము ప్రస్తుతము జరుపబడుచున్న శాస్త్ర ప్రయోగములో చైనా-జపాన్ వారు ఈ సౌరశక్తిని నిక్షిప్తకొనుకొనుటకు పదార్థములు కుళ్ళిపోకుండా ఉండుటకు ఉపయోగించుకొనుచున్నారు.

కాని ఆనాటి బ్రహ్మఋషులు గ్రహనక్షత్ర ప్రభావమును సౌరశక్తిని మానవజాతి ప్రయోజనాలకు విశ్వమానవ కళ్యాణమునకు వినియోగించుకొనుటకై వేల సంవత్సరముల క్రిందనే ప్రయోగములుచేసి విశ్వశాస్త్ర విజ్ఞానములో ప్రపంచ శాస్త్రవేత్తలకు మార్గదర్శకులైనారు.

వారి అసాధారణ శాస్త్ర ప్రయోగముల ఫలితములే లలిత కళలుగా రూపు సంతరించుకున్నాయి. వీటిని దేవాలయములద్వారా ప్రజానీకమునకు సంక్రమింపచేసి అద్భుత ఫలితములను సాధించి అమరులైనారు. భారతీయ ఋషులు ముక్కు మూసుకొని అడవులయందు కూర్చునుటే వీరిపనికాదు వారు సాధించిన దివ్యశక్తులను మానవాళికి బోధించి సమాజమునకు ఎనలేని సేవచేసినారు. కాని విదేశీ ఆచారములకు భాషల ప్రభావమునకు బానిసలై ఆలోచన జ్ఞానం లోపించి మనవారినే అవమానపరుచుట ప్రారంభించిరి.

మన సంస్కృతీ సాంప్రదాయములే ప్రవేశ పెట్టని యెడల సమాజము పశువృత్తి కలిగి నామరూపాలు లేకుండా నశించి పోయేవారు.

దివినుండి వచ్చే దైవశక్తులను సాధనబలంతో యోగసాధనతో తపస్సు ద్వారా తమ శరీరమునకు అవాహన చేసుకొనుట వలన దేవుళ్ళయినారు.

కాని సామాన్య మానవులకు ఇది అసాధ్యమైన విషయము. ఈ దైవశక్తులను ఆలయములందు ప్రవేశ పెట్టబడుటచే దేవాలయములైనవి. ఈ దైవశక్తులను సామాన్యులు అతిసులభముగా పొందుటకు ఆలయములే శరణ్యములయినవి.

ఈ దేవాలయములో స్త్రీని శక్తిస్వరూపముగా చూపుటకు ఆలయము నిండా శ్రీ మూర్తి శిల్పములచే అలంకరించబడినది. ఈ శక్తి తనకు తానుగా

గాక పురుషునిలో ప్రవేశ పెట్టబడినపుడు మాత్రమే ప్రతిభావంతముగా పని చేయును. పెటోర్రిలు తనకు తానుగాగాక వాహనములో ప్రవేశ పెట్టబడిన నప్పుడు మాత్రమే అమిత వేగమును ప్రదర్శించును.

స్త్రీ దేవతలకు వాహనములను చూపునప్పుడు సింహమును, పెద్దపులిని, ఏనుగును, హంసను, పద్మమును చూపుదురు.

ఆలయములోను, ఆలయ ప్రాంగణములోను అష్టదళ పద్మములు వివిధ భంగిమల ఏనుగుల బారులు, సింహములు హంస శిల్పములు విరివిగా మలచబడినవి. ఇది స్త్రీ శక్తికి నిదర్శనముగా రూపకల్పన చేయబడినవి. ఇవి అలంకార ప్రాయముగానే కాకుండా శక్తి ఆలయమును భావనమునుకూడా తెలియజేయుచున్నవి. ఇవి అష్టశక్తులగా, అష్టసిద్ధులుగా ప్రవేశ పెట్టబడినవి.

## స్వాగత శిల్ప సుందరీమణులు, ప్రవేశ ద్వారము

ఈ ఆలయమునకు మూడు వైపులనుండి మూడు మార్గములు గలవు. తూర్పు — దక్షిణము — ఉత్తరమునగల ఈ ద్వారములకు చక్కని స్వాగత భంగిమలో ముదురు గులాబి రంగులో శోభాయమానముగా మలచబడినవి చేతులందు విల్లమ్ములు పుష్పములు ధరించి కొన్ని శిల్పములు అర్ధనగ్నముగా మలచబడినవి. ఇవి అర్ధపూర్వకమైన ఆహ్వాన శిల్పములు ఈ ద్వారముల కిరువైపులయందు ఏనుగుల జంటలు శిల్పవైభవముతో మలచబడినవి. అప్పుడి ఏనుగు శిల్పములను బైరవభట్టు తీర్చిదిద్దెను,

ఆలయ ప్రాంగణము చుట్టుగల శిల్పములకు గోడలను మొత్తం రాయినే ఉపయోగించినారు. ఈ శిల్పములు ఎక్కువ పనితనముతో లేనప్పటికిని భావగాంభీర్యముతో ఒప్పుచున్నవి. ప్రాంగణము చుట్టు అలంకారముగా పై వరుసలో విప్పారిన పద్మములు, ఏనుగుల వరుసలు, యోధులు, యుద్ధవీరులు ముష్టియుద్ధ పద్ధతులు, మైదున శిల్పములు, ధేను బంధనములు, డాలుధరించిన యుద్ధవీరులు, కిటి వస్త్రమును విప్పుకుంట అర్ధనగ్న భంగిమలో విరహమును రేకెత్తించు శిల్పములు, నర్తకీమణులు, ఉగ్ర నారసింహుడు, నాట్యగణపతి శిల్పములు విరివిగా మలచబడినవి.

వాయిద్యకులు, బృందశిల్పాలు, వేటగాళ్ళ శిల్పాలు, ఆలయ ప్రాంగణము చుట్టూ కుడిఎడమలకు అలంకార ప్రాయమై కనులపండుగగా ఆలయమునకు అందమును చేకూర్చుచున్నవి.

క్రిందివరుసలో బుద్ధుడు - వేణుగానము చేయుచున్న శిల్పములు, భైరవమూర్తులు, నాట్యమాడుచున్న విఘ్నేశ్వరుడు - ఢమరుకం చేతబూనిన శివుడు, కొమ్ములూదుచున్న పురుషులు, చేతిపై చిలుకను ధరించిన స్త్రీ ప్రతిమలు, లజ్జా భరితవదనముతో స్తనములు దాచుకుంటున్న స్త్రీలు, పూలదండలు చేతబూని వయ్యారంగా నిలబడి ప్రియుని రాకకై వీక్షించుచున్న స్త్రీ ప్రతిమలు ఈ విధముగా స్త్రీ ప్రతిమలు మలచడంలో శిల్పి హృదయములోని పెల్లుబికిని భావము దాగియున్నట్లు గోచరించును. వాత్స్యాయన కామసూత్రములుగా ప్రచారమవుతున్న ఈ కామశాస్త్ర శిల్పములను గమనించవలసి యున్నది.



ప్రాంగణ శిల్పములలోని కొంత భాగము

వాత్స్యాయన ఋషియొక్క నాలుగు ఉత్తమ పద్ధతులు ప్రాంగణ భాగమున ప్రవేశపెట్టబడినవి. లతా వేష్టితం, వృక్షాధిరూఢం. తిలతండులకం, క్షీరనీరం. ఈ పద్ధతుల ద్వారా దంపతుల స్పర్శసుఖాన్ని ఇనుమడింపజేయుచూ ఇరువురిలో అనురాగబంధాలు పెంపొందింప చేస్తాయి.

లతావేష్టితం :— సాలవృక్షాన్ని లత చుట్టుకున్నట్లుగా ఆమె అతనిని కౌగలించుకొని అతనిముఖాన్ని తనముఖముపైవుకు లాగుకుని అతనిశరీరముతో ఆధారపడి ఏదో తేజస్సును చూచినట్లుసంతోషముతో కేరింతలు కొట్టుటకు లతా వేష్టికమని వాత్స్యాయనుడు తెలిపియున్నాడు.

ఈ భంగిమలను ఊహించి రూపకల్పన చేయుటవలన స్త్రీ సహజ సౌందర్యమును స్త్రీ శరీర భాగములయొక్క వివరములను శిల్పరూపమున సృష్టించుట సహజత్వమునకు బదులు భిన్నత్వమే ప్రదర్శనమగును. కామసూత్రములు సృష్టించు సమయమున రామప్ప వయసు ఇరువదిమూడు సంవత్సరములు, అందునా అవివాహితుడు. స్త్రీ యొక్క సహజత్వమును లోతుపాతులను తెలుసుకొనుటకు ఎంతో అవసరము. కావున ఇంతటి మహోన్నతమైన శిల్ప కళాఖండాలను, వాత్స్యాయన కామసూత్రాలను మలచుటకు రుద్రమదేవియొక్క ప్రత్యక్ష అనుభవము ఇందులకు కారణమై యుండెను.

శిల్పములయొక్క అంగాంగముల రూపకల్పనకు రుద్రమదేవినే నమూనాగా తీసుకొనవలసి వచ్చినది. అలాగా ఇరువురియందుగల అమితమైన ప్రేమనే రసజీవ శిల్ప సౌందర్యాలను ఉత్పన్నించుటకు ప్రబల కారణమై యున్నది.

వృక్షాధిరూఢం :— రుద్రమ, రామప్పల అనుభవ పూర్వకమైన అనుభూతి పూర్వకమైన రూపకల్పనలే వృక్షాదిరూఢ శిల్ప నిర్మాణములు, ప్రియుని పాదముపై ప్రియురాలి పాదమునుంచి ప్రియుని తొడలను హత్తుకొని రెండవ కాలును పెనవేసి, ఒకచేతితో ప్రియుని హస్తమువట్టి రెండవ చేతితో ప్రియుని భుజములను దిగలాగి కేరింతలు కొట్టుటకే వృక్షాదిరూఢం అని పేరు ఈ విధా

స్తనమువల్లన ప్రియునిచే సంపూర్ణసుఖానుభూతిని పొంది అతిశయించిన ప్రేమలో ప్రియుని ఆలింగనమునకు పురికొల్పు ఈ పద్ధతివలన అధిక స్పర్శ సుఖమును ఇరువురు అనుభవించ గలుగుదురు.



కామ సూత్రముల యుద్ధ పద్ధతులు

తలతండులకం :— ఉభయులు ఒకరి ముఖము వైపు ఒకరు తిరి, పార్శ్వములమీద పడుకున్న సమయములో ఒకరినొకరు ఊరువులను బాహువులను పెనవేసుకుని గట్టిగా హత్తుకొని స్పర్శానుభూతిని స్వర్గసుఖములను తేనుభవించుటనే వాత్స్యాయనుడు తలతండులకమని నామకరణము చేసినారు.

క్షీరనీరం :— పెనవేసుకొనిన తర్వాత అద్వితీయమైన ఉత్సాహముతో ప్రపంచము మునిగి ప్రమాదము కలుగునేమోయన్న భయమైనా లేక నీరు, పాలు కలిసినట్లుగా ఒకరిలో ఒకరు పూర్తిగా లీనమగుటను క్షీరనీరం అని వాత్స్యాయనుడు తెలియచేసినాడు.

స్త్రీ స్తనములకు రెండు రకాల పనులున్నాయి. బిడ్డలకు ఆహారము నివ్వడం, భర్తకు స్పర్శ సుఖాన్ని కలుగజేయుట కామసూత్రములో స్తన భూషకాలుకూడా కామకేంద్రాలుగా చెప్పబడినవి. ఈ ప్రాంగణ శిల్పములలో ఒక శిల్పమునకు ఒకవైపు స్తనములు కుడుస్తున్న పసిపాప. మరొకవైపు స్తన స్పర్శవల్ల స్వర్గసుఖాన్ని అనుభవించుచూ లైంగిక వాంఛను కూడా నెరవేర్చు కొంటున్నట్లుగా మలచబడిన లఘు శిల్పములు ప్రేక్షకులకు వింతను కలిగిస్తున్నది.

ఇంకొక లఘు శిల్పము ధేనుకబంధముగా మలచబడినది. ధేనుకమువలె ఉపక్రమించే ఈ లైంగిక విధానమునకు ధేనుబంధమని పేరు. పూర్వము దీర్ఘతమఉనే ఋషి అతని భార్య ప్రద్వేషిణి ఈ విధానమును పిల్లలులేని ఋషుల భార్యలకు, మహారాణులకు, మహారాజులకు నేర్పించెడివారు. ఈ విధానమువలన గొడ్రాళ్ళు తప్పకుండా గర్భవతులగుదురని నిరూపించిరి. సామాన్యముగా పశువులలో ఈ విధానమువలన సంతానోత్పత్తి వందలు వేయిల్లో ఒకటి అర తప్ప మిగతవి తప్పకుండా సంతానము కన్నట్లుగా చూచెదము. ఈ విధా

నమును సూచించు శిల్పములు లఘు రూపమున మలచబడినవి. ఈ విధానము వలన స్త్రీ యొక్క పిరుదు భాగములకు ఎనలేని స్పర్శ సుఖము కలిగి ఆనందములో మైమరచి మత్తుగా భర్తకు లైంగిక సుఖములకు అందజేయునని వాత్స్యాయనుడు తెలిపిన వాటికి రామప్ప సరియైన రూపకల్పన చేసెను. పిల్లలను నిదురపుచ్చుటకు తల్లి పిల్లల పిరుదులపై జొకొట్టుటవలన సుఖముగా నిద్రపోగలరు. ప్రపంచ సాహిత్యమంతా స్త్రీ కుచ సౌందర్యమునకు మార్దనము మునకు విశేష ప్రాధాన్యత నివ్వబడినది. వాటిని వర్ణిస్తూ పద్యాలు చెప్పని కావ్యాలు వ్రాయని కవియే లేడు. అన్నియుగాల పురుషులకు అన్నితరాల యువకులకు అవియే ఆకర్శక కేంద్రాలైన సంగతి విజ్ఞానవేత్తలు మరువకూడదు.

ఈ కామ సంబంధాలను విశాల హృదయములో అర్థము చేసుకొనుటకు వాటి భౌతిక ప్రాముఖ్యతను దంపతులిరువురు లైంగిక సుఖాన్నిపొందేనిమిత్తమై ఒకవైపు భక్తికి సంబంధించిన దేవతా శిల్పములను సృష్టించెను.

రామప్ప ఈ కామసూత్రములను విస్పష్టలాస్య భంగిమలతో ప్రణయారాధన భంగిమలను ఆలయమంతటా సృష్టించినాడు. ఉపగాహన, చుంబన, నఖచ్ఛేద్య, నాడీక్షోభన, ప్రహరణ, సీత్కృతిగ్రహన కేశకర్షణ మర్ధన మొదలగు కామప్రణపాన్ని రేకెత్తించే శిల్పములను ప్రదర్శించి తన కామ శాస్త్ర ప్రతిభను అద్భుతముగా ప్రదర్శించి మహామహులచే ఓహో యనిపించుకుంటున్నాడు.

ఈ భంగిమలను దర్శించునప్పుడు పూర్తిగా లీనమై పడుగువద్దా తెలియవచ్చే స్థితిలో నుండనంత ఆకర్షణీయముగా మలచినాడు. అందుకే రామప్ప దేవాలయమును అన్నా-చెల్లెలు కలిసి చూడకూడదని వదంతి ఏర్పడినది. సృష్టికార్యము భగవంతుని కార్యములన్నింటిలో అతిప్రధానమైనది మరియు పవిత్రమైనది. ఈ దేవాలయ శిల్పముద్వారా విదితమగుచున్నది.

భార్యాభర్తలు తమ జీవితములను ఏ విధముగా తీర్చి దిద్దుకొనవలయునో ప్రబోధించగల శిల్పాలు-శిల్ప రహస్యములు ప్రత్యక్షముగా గోచ

రించును ఈ దేవాలయముద్వారా సంప్రయోగమును ప్రత్యక్షముగా చూపించి సృష్టి కార్యమును సృష్టి రహస్య పరిజ్ఞానమును యువతీయువకులకు అందించే చక్కటి అవకాశమేర్పడినది. ప్రతి శిల్పములో రామప్పయొక్క పెల్లుబికిన కామవాంఛ ప్రత్యక్షముగా గోచరించును. ఈ విధమైన స్వల్పవృష్టికి అదృశ్య శక్తి ప్రేరణకు ఈ శిల్పములే నిదర్శనము.



ఈ కళాదృష్టి ప్రతి మానవునిలో జ్ఞాతవాసముగానో అజ్ఞాతముగానో అనాదినుండి ఉంటూనే వచ్చినది. ఈ కళాదృష్టి లోపించిననాడు మానవుడు అదుపుతప్పి పశుప్రాయుడౌతాడనేది సత్యం. "కార్యేషు దాసి కరణేషు మంత్రి శయనేషురంభా నిజధర్మ పత్నీ" అను ఆర్యోక్తికి అనుగుణమైన శిల్పములు ఈ ఆలయమందు కొట్టవచ్చినట్లుగా ప్రదర్శింపబడినవి. ఈ ప్రణయకళను ఉపాసించి భార్యాభర్తలు సృష్టి కార్యక్రమమునకు కలిసికట్టుగా పవిత్ర హృదయముతో కృషిచేసి బలవంతులుగా మేధావంతులు అయిన సత్ సంతానమును కని దేశశ్రేయస్సునకు దేశ సౌభాగ్యమునకు తోడ్పడి భావితరాలకు ఆదర్శ ప్రాయులు కావలయుననెడి సద్భావన ఇందు దాగియున్నది.

రామప్పను నిర్బంధించుట :— రామప్ప రూపురేఖలకు. ఆతని శిల్ప కళా ప్రతిభకు శారీరకముగా మానసికముగా పూర్తిగా అంకితమైనది. రుద్రమ తాను రాకుమారినని పొరపాటునకూడా బయటపడనీయలేదు. ఒకవేళ రాకుమారియని తెలిసినచో తనకు దక్కకపోగా అద్భుతమైన శిల్పనిర్మాణము వెలసియుండెడిదికాదు. అందుచే వనకన్యయని మాత్రమే తెలిపియుండెను.

అంతఃపురములోని దాయాదులు పురప్రముఖులు రామప్ప ప్రతిభా విశేషాలను ప్రశంసించుచున్నప్పుడు రుద్రమ పరవశించి తబ్బిబై పోయెడిది. రుద్రమ యవ్వనచర్యలన్నియు చెలులు మహారాణిగారితో రహస్యముగాచెప్పెడివారు. మధ్యరాత్రిలందు రామప్పను కలవరించుచు తనలోతాను మురిసిపోవుచుండిన చర్యలన్నియు మహారాణి గమనించి చక్రవర్తులకు చెప్పకుండా తన మనసులో దాచుకొనెను. రామప్పను కలుసుకొనుటకు అర్ధరాత్రిలు వెళ్ళిపోవుటవలన మార్గమధ్యన ఏమిజరుగుతుందోయని భయపడెడిది. ఈ విషయము మహారాణికి చెలికత్తెలకు తప్ప రాజధానిలో యెవ్వరికి తెలియదు.

రుద్రమ వనకన్య వేషములో నుండుటచేత పాలంపేట ప్రజలు ఈ యువతి రుద్రమదేవి యని గుర్తించలేకపోయిరి. మారువేషములో నున్నను ఆమె ముఖములో రాజసం. ఠీవి, గుఱ్ఱముల్లపై చెలికత్తెలతో వచ్చుట గమనించిన ప్రజలు ఆమెను రుద్రామదేవియే యని పసిగట్టగలిగిరి. రుద్రమ రావ

ఉయు అమవంట తీసుకొని పోవడమువలన ఆలయ నిర్మాణములో అంతరాయ మేర్పడుచుండెడిది. శిల్పులకు రామప్పపై అసూయజనించెను శిల్పసూచనలు పెడచెవి పెట్టి చులకనగాచూడసాగిరి. రుద్రమ ధ్యానము రుద్రమరూపురేఖలను దేవతా శిల్పములుగ శిల్పించుట తప్ప తన ఆరోగ్య విషయముగాని ఆహార విషయముగాని పట్టించు కొనెడివాడు కాడు.

రామప్ప రుద్రమ ప్రేమ విహారములు గమనించిన ప్రజలు ఎవరికి వారే నోరు నొక్కుకొని ఊరకుండిరి. కాని కొందరు ధైర్యము వహించి ఈ విషయము చక్రవర్తులకు రహస్యముగా తెలియజేసిరి. అప్పటివరకు రామప్ప రతీ, మన్మధుల శిల్పములను మాత్రము పూర్తిచేయగల్గెను.

అప్పటివరకు దాయాదులు రుద్రమ గురించి చెప్పినమాటలు అసూయతో కూడినవని భావించిన గణపతిదేవుని హృదయము గాయపడెను. వెంటనే గూఢచారులను పంపి రామప్పను రాజధానికి రప్పించెను.

ఆలయ శిల్పములకు భంగిమలకు అంగసౌష్టవము కలిగి అప్సరలాంటి యువతి ఆకారమును రూపురేఖలను ఆధారముగా తీసుకొనవలయునని వాస్తు సిద్ధాంతము తెలియజేయుచున్నది. అందులోను అలాంటి సుందరినే ప్రేమించి ఆమె శరీర మార్దవమును స్త్రీరహస్యభాగముల గొప్పతనమును అనుభవపూర్వకముగా తెలుసుకొనినప్పుడే కామసూత్ర శిల్పములకు అప్సర గణములకు సజీవత్వము, సహజత్వము చేకూరుతుంది. కాని రామప్ప అవివాహితుడు కావడముచేత, ఒక అందమైన యువతిని ప్రేమించి ఆమెద్వారా అన్నిరకముల లైంగిక విషయములను తెలుసుకొనవలెననెడి గురూపదేశము ప్రకారము అడవులయందు, గూడెములయందు వెదకగా, వెదకగా వనకన్య రూపములో దివి నుండి భువికి దిగివచ్చిన అందాల రాశిని వనకన్యయే అని తలంచి మనసారా ప్రేమించుటయు ఆమెకూడా అపరమన్మధుని పోలిన రామప్ప రూపురేఖలను ప్రేమించి అనుకూలముగా నుండుటయు నిజముగా ఆమెను వనకన్యయే యని భావించి ఆరాధించి ఆ రూపములనే శిల్పములయందు విన్యసించుట జరిగినది. కాని ఆమె యువరాణీ యని మాత్రము తెలియదు. ఆమె ప్రోత్సా

హామే ఎక్కువకావడము ఆమె స్వయముగా కలుగజేసుకొని అతని స్వాదీన మైనందువలననే ఇలాంటి దివ్యశిల్పములను శిల్పించగలిగెను. కాని కొంత కాలమునకు ఆమె రాచకన్యయని స్వయంగా ఒక మహాసామ్రాజ్యాదిపతియైన గణపతిదేవుని కూతురు రుద్రమయని తెలిసి ఒడలు చెమటెక్కి పోయెను. రాజద్రోహము అపరాధముగాభావించిన రామప్ప రుద్రమను వెళ్ళిపోవలసిందిగా వేడుకొనెను. కాని రామప్ప సన్నిధిలో స్వర్గసుఖాలు చవిచూసిన రుద్రమ వైఖరి చిగుని విలపించెను. ప్రేమకు రాజు, పేద బేధములేదు. ఇదినాస్వంత విషయమని ఈ అనురాగమును ఈ బంధమును ఎడబాటు చేయ రాదని రామప్పను వేడుకొనెను. దైవసంబంధమైన శిల్పములకు తన రూపు రేఖలను శిల్పించి తనను ఈ ఆలయములో కలకాలము నిల్చునట్లుగా చేయవలె నని పరిపరి విధముల ప్రార్ధించెను. ఈ విషయము తన తండ్రిగారితో సావ కాశముగా తెల్పి నీకు ఎలాంటి అవమానముగాని ప్రాణహానిగా కల్గకుండా జేస్తా నని వేడుకొనిన విషయమును రామప్ప గణపతి దేవునితో చెప్పి ఇందు నాత ప్పేమియులేదని ఇదంతా దైవికముగా జరిగినదని సవినయముగా తెలుపుకొనెను.

కాని ఇది రాజవంశ గౌరవమునకు రాజవంశ ప్రతిష్టకు సంబంధించిన విషయముగా భావించి రామప్పను హెచ్చరించి ఒక రహస్య కారాగారమున నిర్బందించెను. హెచ్చరికలతో భయపెట్టడముతో సమసిపోతుందనుకొన్న సమస్య ఇంకొక విధముగా పరిణమించినది.

రామప్పను నిర్బంధించడముతో ఆలయ నిర్మాణము ఆగిపోయెను. శిల్పులందరు పనులు మానివేసి జాయప్ప కలలుగన్న నాట్య శిల్పముల విన్యా సమూ ఆగిపోయేను. రేచెర్ల రుద్రుని కలలు కల్లలైపోయే పరిస్థితి ఏర్పడి రామప్పను మహారాజు నిర్బంధించినాడని రామప్ప రుద్రమల రహస్య ప్రేమ కలాపములే ఇందుకు కారణమని ఆ ప్రాంత ప్రజలు గుసగుస లాడుకొనుట ప్రారంభించిరి.

దైవకార్యములో అంతరాయ మేర్పడుటవలన అనర్ధములు సంభవించ గలవని ప్రజలు భీతాహులై బాధపడసాగిరి.

రామప్పను బంధించి రహస్య కారాగారమునందుంచినాడను విష యము చెలులు పసిగట్టి రుద్రమకు తెలియజేసిరి, రామప్ప అవమానమే తన అవమానముగా భావించి రుద్రదేవ రుద్రరూపము దాల్చెను. రామప్పను వన కన్యనని నమ్మించినాది తనేయని రామప్ప నిర్దోషియని రామప్పకు పూర్తిగా అంకితమై అతని విషయములో రుద్రమయే స్వయముగా చొరవచేసుకొనెనని అందుకు ఆమెయే అవకాశమిచ్చి నమ్మించుటవలననే రామప్ప పవిత్ర హృద యముతో వనకన్యయని భావించి ప్రేమించినాడని, రుద్రమ తండ్రికి తెలియ జేసెను. చక్రవర్తి ఆశ్చర్యపడెను. రామప్పకొరకు, రామప్ప క్షేమము కొరకు ఈ బంధువర్గమును యీ రాజ్యభోగములను తుదకు తల్లి, తండ్రులను కూడా వదలి ఎచటకైనను పోయి జీవితము గడిపెదనని రామప్ప ఎడబాటును సహించి జీవితము గడపలేనని తన ఖచ్చితమైన నిర్ణయమును తెలియజేసెను. రామప్పను వెంటనే విడుదల చేయవలెనని పరిస్థితులు విషమించి ప్రజల ముందుకు యీ విషయము పోకముందు రాజవంశ గౌరవమును కాపాడుకొన వలెనని హెచ్చరించెను. ఎన్నడు ఎట్టి పరిస్థితులలో రుద్రమ రుద్రరూపమును గాంచి ఎరుగని చక్రవర్తులకు ఆశ్చర్యముగలిగెను.

ఒకవైపు ఆలయప్రాంత ప్రజలు ఒకవైపు సేనానుల కోర్కెలు ఒక వైపు రుద్రమ వాంఛితము చక్రవర్తిని కరుగదీసినవి. రాత్రింతా విచారించు కొని రాజకీయ పన్నాగము పన్ని రామప్పను ఆలయవిషయమై రావించబడినట్లు అందుకు రహస్య సమాలోచనలు జరిపినట్లు తెలియజేసి రుద్రమ రాత్రుల యందు వెళ్ళిపోవుట ప్రమాదమని గ్రహించిన చక్రవర్తి ఆలయ పర్యవేక్షణ భారము రుద్రమకు అప్పగించెను. పగలు మాత్రమే వెళ్ళుటకు ఏర్పాటు చేయించెను.

రామప్ప తిరిగి రాజలాంఛనములతో రావడము ఆలయ శిల్పులకు, ప్రాంత ప్రజలకు ఆశ్చర్యము కలిగి వారూహించిన ఊహలు పటాపంచలు అయినవి. అందరికి రామప్పపై తిరిగి గౌరవభావమేర్పడెను.

రుద్రమ చెలులతో రాజశ్రీవిగా ఆలయ పర్యవేక్షణకు వచ్చినప్పుడు ఆమెను రామప్ప సగౌరవముగా ఆహ్వానించుటయు, ఒక ప్రియురాలిగా కాక రాజకుమారికి జరుపవలసిన మర్యాదలను లాంఛనములను చూపించుచూ, వివరించుట ప్రారంభించెను.

గర్భాలయమునకు వెనుకవైపు ప్రాంగణ భాగములకు ఎలాంటి కామ శిల్పాలు లేకుండా కేవలం ఏనుగుల వరుసలు మధ్యభాగమున దేవతాశిల్పములు రెండు వైపులయందు హంసల వరుసలు మధ్యభాగమున గణపతియో లేక సరస్వతియో లేక యోగియొక్క శిల్పములో మలచి ఖాళీలు లేకుండా శిల్పములతో శోభాయమానముగా చెక్కబడినవి.

గర్భాలయమునకు మూడు వైపులలో మూడు ఎత్తైన వాయు కోష్టములు నిర్మింపబడినవి. ఇవి రంధ్రములు కలిగి మూడంతస్థులుగా నిర్మాణము చేయబడినవి. ఇవి గర్భాలయమునకు అందాన్ని చేకూర్చుచున్నవి. ఈ వాయు కోష్టములు గర్భాలయమందలి శీతలీకరణము చేయుటయు(Air conditioning) శీతలీకరణము చేయబడిన వాయువు వాయు తెరలద్వారా అంతరాళములోనికి ప్రవేశించుటకు ఏర్పాట్లు చేయబడినవి. మరియు ముఖ్యంగా విషవాయువులను హరింపజేసి వాయువును శుద్ధిచేయుట, ఆమ్ల జనీకరణము చేయుట ఈ వాయు కోష్టముల యొక్క ముఖ్యమైన విధియైయున్నది. భక్తుడు దైవదర్శనమునకు మెట్లెక్కునపుడు కాళ్ళు కాళ్ళభాగమునకును పొత్తికడుపునకును శ్రమకలిగి ఉచ్ఛ్వాస, నిశ్వాసములు అధికమై ఆలయములోనికి ప్రవేశించగానే అధికముగా ప్రాణవాయువు లభించి ఊపిరితిత్తులు, ఊపిరితిత్తులలోని సూక్ష్మభాగము శక్తివంతములై రక్తప్రసరణ మండలము శుభ్రమగును. అందువలన గుండెకు ఊపిరితిత్తులకు శ్రమ తగ్గును. ఊపిరితిత్తుల యందలి మలిన వాయువు బయటికి నెట్టివేయబడును.

సాంచీస్థూప శిల్పమును బోలిన ఈ మదనికా శిల్ప సౌందర్యమును తిలకించుటకు మరియు ఆలయముచుట్టు ప్రదక్షిణము చేయుటకు ప్రదక్షిణ మార్గము కలదు. ఆలయ పీఠభాగము 6′,4″ ఎత్తుగలదు. ప్రదక్షిణ మార్గము

10′ వెడల్పు కలిగి వాస్తు శాస్త్రప్రకారము నిర్మాణము చేయబడినది. ఈ పీఠ ముయొక్క ముఖతలము మడతలు మడతలుగా దళములు కల్గి ఆలయముచుట్టు పీఠమునకు ప్రత్యేక శోభను, అలంకారమును చేకూర్చుచున్నది.

ఈ ఆలయ అంతరాళము 51′-8″ × 14′.10″ పొడవు, వెడల్పు గను మంటప స్తంభముల ఎత్తు దాదాపు 15′. ఆలయ అంతరాళముచుట్టు ఉపపీఠముపై బలిపీఠముపై జరుపబడు నృత్యములను తిలకించుటకు 3′ అడుగుల ఎత్తుగల ఆసనవేదిక గలదు.

ఈ ఆలయముయొక్క శిఖరము నీటికంటె తేలికగల ఇటుకలచే నిర్మింప బడినది. ఈ ఇటుకలు మిక్కిలి కఠినముగా యుండి తేలికయైనవి. ఈ ఇటుకలను నీటిలో వేసినచో బెండువలె నీటిలో తేలియాడుచుండును. భారతదేశ మందేగాక ప్రపంచములో ఏ దేవాలయ శిఖరమునకు ఈ విధమైన ఇటుకలు తయారుచేయ బడకపోవుట ఒక గొప్ప విశేషము. ఈ ప్రతిభ కాకతీయ శిల్పులకు దక్కుట అద్భుతమైన విషయము. ఈ ఇటుకలను ఏఏ పదార్థముల మిశ్రమముతో తయారుచేయబడినవో చంద్రమండలము వెళ్ళగల సమర్థులైన ప్రపంచ శాస్త్రవేత్తలకు వీటి రహస్యము తెలియకపోవుట ఆశ్చర్యకరమైన విషయము.

రామప్ప ఇలాంటి ఇటుకల నిర్మాణమునకు నిపుణుడైన అభిరామప్ప అనబడు శిల్పిని నియమించి ఆతనికి నిర్మాణ పద్ధతిని ఆ పదార్థముల మిశ్రమ మును తెలియజేసి ఇటుకలను తయారుజేయించెను.

రామప్ప తెలిపిన సమ్మేళన పద్ధతిలో ఇటుకలు తయారుచేయించి శిఖర నిర్మాణము గావించెను. అయితే అభిరామప్ప యొక్క నిర్మాణ లోపమువలన కొన్ని ఇటుకలు సరియైనవి కానందున శిఖర నిర్మాణ సమయములో ఇటుక విరిగి క్రిందపడుటవలన అభిరామప్ప కాళ్ళు విరిగి కొంతకాలమునకు చనిపో యెను. రామప్ప ఆ లోపమును గ్రహించి సరియగు పద్ధతిలో ఇటుకలను తయారుచేయించి శిఖర నిర్మాణము రామప్ప పూర్తిచేయగలిగెను.

ఈ నిర్మాణ పద్ధతి శ్రీరాముని కాలములో ప్రవేశ పెట్టబడినది. శ్రీరాముడు నీటిపై లంకదాటుట సాధ్యము కాకపోవుటవలన అతని వద్దగల వాస్తు శిల్పులు నీటిపైన తేలికైన పెద్దపెద్ద బండలను తయారుచేసి నీటిలోవేసి వాటి సహాయముతో వానరులందరు సునాయాసముగా లంకచేరగలిగిరి. ఈ సందర్భములో తప్ప భారత భాగవత పురాణములందు ఇలాంటి తేలికయైన విధానమును కనిపెట్టి నిర్మాణములను చేసినట్లు ఎచ్చటను కానరాదు. ఆ పద్ధతి కొన్నియుగాల తర్వాత రామప్ప మరల ప్రవేశపెట్టి ఈ దేవాలయ శిఖర నిర్మాణము గావించెను.

శిఖరము ఇలాంటి తేలికయైన ఇటుకలచే నిర్మాణము చేయబడుటవలన స్థూపేమండి సౌరశక్తి లేక దైవశక్తి గర్భాలయములో సునాయాసముగా చేరగల్గును. ఇది ఈ శిఖర నిర్మాణములో నిక్షిప్తమైయున్న అతికీలకమైన వాస్తు రహస్యము.

ప్రత్యేక కొలతలుగల ఎత్తైన పీఠముపైన ఆలయ ర్మాము చేయుట వాస్తు శాస్త్ర సమ్మతము. అందువలన కాళ్ళు, కాళ్ళ భాగము, పొట్ట పొట్ట లోని నాడీమండలము మరియు రక్తప్రసరణ మండలము వెన్నుపాము, మొదలగు శరీరభాగములకు వాస్తురీత్యా ప్రవేశపెట్టబడిన ఈ ప్రత్యేక క్రియ అత్యంత ప్రభావంకలదై యున్నది. భక్తుడు మెట్లెక్కునప్పుడు కడుపు, కాళ్ళు వెన్నుపాము, భాగములకు వ్యాయామము కలుగుచూ ఉచ్ఛ్వాస నిశ్వాసముల త్వరత్వరగా జరుగుచుండును. ఊపిరితిత్తులకు ప్రాణవాయువు లభించుటయు గుండెలోని సూక్ష్మమైన కేశనాళికల యందుగల క్రొవ్వుకరిగి భయంకరమైన గుండెరోగములు రాకుండాచేయును. రక్త ప్రసరణ మండలములోని ఓడల యందుగల క్రొవ్వుకరిగి రక్తపు ఒత్తడిని క్రమబద్ధము చేయుటవలన శక్తి పీఠభాగ:లు రాకుండాచేయు అవకాశము కలదు.

దేవాలయములో ప్రవేశించుటకు మెట్లెక్కుటయు చుట్టూ ప్రదక్షిణము చేయుటయు శారీరక సంబంధమైన వ్యాయామములేకాని, రామప్ప తన శాస్త్ర పరిజ్ఞానము ఇంకా ముందుకు తీసికొనిపోయినాడు. మదనికా శిల్పములను

అమర్చుటలో అద్భుతమైన నిపుణతను శాస్త్రజ్ఞానమును ప్రదర్శించి పలువురి శాస్త్రవేత్తల మెప్పును బడసినారు.

ఈ మదనికా శిల్పములను స్తంభములకు పైకప్పునకు ఆధారముగా నున్నట్లు భిగించబడినవి. భక్తుడు ఈ శిల్పములను కంటికి సమాన ఎత్తులో అమర్చు: తలపైకెత్తి చూచునట్లుగా ఒక్కొక్క ధ్వారమునకు నాలుగుచొప్పున మొత్తము 12 శిల్పములను అమర్చినాడు. పది అడుగుల పెడల్పుగల ప్రదక్షిణ మార్గములో నిలబడి ఒక ప్రత్యేక కోణములో తలపైకెత్తి చూచుటవలన ఊపిరితిత్తులను, గుండెను అదుపులో నుంచగ: చిన్న మెదడు యొక్క రక్త ప్రసరణ మండలమునకు నాడీమండలమునకు మరియు వెన్నుపామునకు చక్కని వ్యాయామము కలుగుచు మెర పట్టీలుపయోగించు అవకాశము కలుగకుండా అద్భుతమైన ప్రయోగముచేసి అమూల్యమైన ఫలితములను సాధించియున్నాడు.

కాకతీయ శిల్పులు ప్రతి ప్రయోగములో ఉమ్మడి ఫలితములను ప్రసాధించియున్నాడు.

ఆది దంపతుల కాలవాలయమైన ఈరుద్రేశ్వరాలయములో పానపట్టము లింగాకారములను పవిత్రమైన సృష్టికార్యమునకు ప్రతిరూపాలుగా మలచబడినవి.

ఇందులోని లింగాకారము ఊర్ధ్వముఖంగా ప్రతిష్ఠించబడియున్నది. అనగా శంకరుడు ఊర్ధ్వరేతసుడు విలువైన తనరేతసును యోగముద్రలో కూర్చుండి ప్రయత్నముచేత వెన్నుపాముద్వారా సహస్రారమునకు పంపి సహస్రారములో అయస్కాంత క్షేత్రము ఏర్పడి తనకు కావలసిన సౌరశక్తినే కాకుండా భక్తుల యోగక్షేమములు తెలుసుకొని వారిని కాపాడుటకు సులభమార్గముగా భృకుటియందు దివ్యనేత్రమున్నట్లుగా మనము గ్రహించెదము.

కొన్ని కారణములచేత ప్రజలకు సృష్టికార్యక్రమమునకు సంబంధించిన శక్తిలోపించి యున్నప్పుడు అశక్తిని పునఃప్రసాదించుటకు తద్వారాఆయుస్సును

ఆరోగ్యమును కలుగజేసి మానవజాతిని కాపాడే అద్భుతమైన ప్రక్రియ యీ మదనికా శిల్పములయందు అంతర్లీనమై యున్నది. శక్తిహీనమైన పురుషత్వమును ప్రేరేపించే యీ ముఖమంట శిల్పములను పరిశీలించవలసియున్నది. ఉమ్మడి ప్రయోజనములను నృత్యరూపములో, కామశాస్త్ర, శిల్ప, యోగశాస్త్రములను శిల్పరూపములో ప్రయోగించి విశ్వకళ్యాణమునకు తోడ్పడి యీ దేవాలయము మహోన్నతమైన స్థానమునుఆక్రమించి కాకతీయ శిల్పశాస్త్రప్రతిభను కాకతీయుల, కళా ప్రయత్నమును కళా జగత్తులో ఆ చంద్ర తారార్కము వెలుగునట్లుగా తీర్చిదిద్దినారు.

తరతరాలుగా కలలుగన్న కాకతీయుల కలలపంట యీ రుద్రేశ్వరాలయము.

కామిగానివాడు మోక్షగామికాదు. యీకామంలేనినాడు యీసృష్టియేలేదు యీ సృష్టికంతకూ మూలం కామము. మానవుని కామపరమైన సంపూర్ణ సుఖసంతోషములకు మూలమైనది. సామాన్య సుఖాలు శరీరమునకు, మనస్సుకు సంబంధించి ఉంటాయి. కాని యీ లైంగిక సంబంధము శరీరానికి, మనస్సుకు రెంటికికూడా పోషణనిస్తుంది.

ఆధ్యాత్మిక దృష్టిలో వెన్నుపాముకు, దగ్గరి సంబంధము కలదు. యోగులు యోగాసనములో కూర్చుండి తమ వీర్యశక్తిని, బలశక్తిగా మార్చి ప్రయత్నముచేత యీ వెన్నుపాముద్వారా సహస్రారమునకు పంపి, దివ్య శక్తులను పొంది లోకకళ్యాణము చేసిరి.

నాగిని :— ఆబాలగోపాలమును ఆశ్చర్యచకితులనుజేయు ఈ నగ్నశిల్పమునకు నాగినియని గారాబాల పట్టియవి యోగినియని, భోగినియని, అనేకమైన పేర్లు బహుళ ప్రచారములో యున్నవి. ప్రతి దేవాలయమందు నగ్నముగా ఒక స్త్రీ శిల్పము ఉండవలయునను సిద్ధాంతము కలదు. ఆ ప్రకారమే అన్ని ఆలయములందు ఒక నగ్న శిల్పము గోచరించును. కాని శిల్పి తనకు ఇష్టము వచ్చినట్టుగా మలచి ప్రతిష్టించినది మాత్రముకాదు. ఇది ఒక ప్రత్యేక

పక్రియగల శిల్పము. ఇందులో అద్భుతమైన భావము అంతర్లీనమైయున్నది. ఇది మనోచైతన్యమునకు రుద్రమదేవియొక్క వివిధ భంగిమలలో ఇది ఒక ప్రత్యేక భంగిమకు రామప్ప రూపకల్పలచేసిన కుండలినీ తత్వముగల శిల్పము ఆలయములోని ప్రతి శిల్పము నిర్మించుటకు ముందుగా ఒక పథకమును స్థిరముచేసి తర్వాత అస్థానస్తపతి-ఆస్థానపండితులు, రాజగురువుయొక్క అను గ్రహము పొందిన తర్వాతనే ప్రతిశిల్పమునకు రూపములు సిద్ధము చేయబడి నవి. కాని శిల్పి ఇష్టము వచ్చినట్లుగా తీర్చిదిద్దినవి మాత్రము కాదు.

ఆలయముయొక్క మూడు ద్వారముల ముఖతలములకు రెండువైపుల రెండు నాలుగుచొప్పున మొత్తము పన్నెండు శిల్పములను అమర్చినారు. ఈ నగ్న శిల్పము ఆలయ ప్రధాన ముఖమంటపమునకు కుడివైపున బిగించబడి నది. ఈ శిల్పములన్నియు ఆలయముయొక్క పైకప్పునకు ఆధారములుగా గోచరిస్తాయి. వీటికి జోడుగా మదగజముల కుంభస్థలముపై నుండి లంఘించు చున్న విధముగా వ్యాళమృగములు తీర్చిదిద్దబడినవి. ఆలయ ముఖమంటప మునకు ఈ శిల్పములు ప్రత్యేక శోభను కలుగజేయుచున్నవి.

దేవాలయ సందేశము పవిత్రమైనది. పవిత్రమైన ఈ దేవాలయములో ఈ నగ్నశిల్పమేమిటి? అను ప్రశ్న ఉదయించవచ్చును. ఉత్కృష్టమైన మానవజీవిత మానసిక ప్రక్రియకు శాస్త్రీయమైన రూపకల్పనయే ఈ శిల్ప నిర్మాణము.

ఈశిల్పమునకు రెండువైపులయందు వాయిద్యకుడు, వింజామరధరించిన లఘు శిల్పములు గలవు. కాని శిల్పి తాను చూపదలచుకున్న నాగిని శిల్పము యొక్క ప్రత్యేకతను ఎత్తిచూపుట (Close-up)లో తన నేర్పును ప్రదర్శించు కున్నాడు. ఇది యోగశాస్త్రము, కుండలినీతత్వమునకు సంబంధించిన శిల్పము అప్పటికి రామప్ప వయస్సు 24 సంవత్సరములు మాత్రమే.

ఈ భంగిమ పడగవిప్పి నిలబడిన నాగుపాము భంగిమను పోలియున్నం దువలన నాగిని శిల్పముయొక్క కేశాలంకరణ నాగుపాము పడగను పోలియు

న్నది. కాళ్ళు, నడుము, మెడ భాగము వక్షస్థలము బిగుసుకొనియున్నవి. నాగుపాము యొక్క తత్వమును రామప్ప స్త్రీ శిల్పరూపములో ప్రదర్శించి యున్నాడు. అతిసుకుమారములైన చేతులయందు బరువైన పడగవిప్పిన నాగుపామును పైకి లేపుచున్నట్లుగా మెడ నుండి బుజముల మీదుగా మోకాళ్ళ వరకు జారిన రెండు నాగుపాములు కలవు. కాళ్ళ అడుగుభాగమున కుండలినీకి సంబంధించిన ఒక కలయికను (Circute)ను పడగవిప్పి చుట్టచుట్టుకొనిన విధముగా నాగుపాము మలచబడినది. మగవాని పురుషత్వమునకు, నాగుపాముకు గల సంబంధము చూపించుటయే ఈ నాగుపాములను ధరించిన స్త్రీ మూర్తి శిల్పముయొక్క ప్రధాన ఉద్దేశము.

వస్త్రవిసర్జన ఒక గొప్పకళ, సరియైన పద్ధతిలో స్త్రీ వస్త్రధారణచేసినా, వస్త్రవిసర్జనచేసినా మగవానిలోని కామము ప్రకోపింపబడును. స్త్రీయొక్క ఏ బాగము ఎంతవరకు ప్రేరేపించగలదో రామప్ప తన ప్రత్యేక అనుభవము ద్వారా గ్రహించి ప్రదర్శించెను. ఏకళకైన కొన్ని ప్రత్యేక హంగులుకలవు. ఈ హంగులను కళాకారులు చిత్రాలద్వారా శిల్పులు శిల్పములద్వారా ప్రదర్శించి ప్రేక్షకుల హృదయాలను ఓలలాడించెదరు.

సాధారణముగా దేవాలయమునకు వెళ్ళువారు శారీరక మానసిక బాధలు కలవారై ఉండాలి లేదా ఏలాంటి బాధలు కలుగకుండుటకై ముందు జాగ్రత్త చర్యగానా వెళుతూ ఉండాలి. లలితకళలన్నియు మనస్సుపై ప్రభావమును కలుగజేయు తత్వము కలవి. వీటిని మానవ ప్రయోజనమునకు ఎన్నో విధములుగా ప్రయోగించి సత్ఫలితములను సాధించి యుండిరి.

మనస్సుకూ శరీరమునకు అనిర్వచనీయమైన అవినాభావ సంబంధముగలదు. మనస్సు శరీరమును తన యిష్టమువచ్చినట్లుగా మార్చే ప్రభావము గలదు మనస్సు వికలమైనప్పుడు దాని ప్రభావము శరీరములోని ధాతువులపైబడి ధాతువుల శక్తి ధ్వంసమైపోయే ప్రమాదము గలదు. ఇటువంటి పరిస్థితులలో మానసిక ప్రశాంతతకు ఏకాగ్రత కల్పించుటకు ఎన్నెన్నో సుందర శిల్పములు దేవాలయముల యందు కీలకమైన పాత్రవహించినవి. భక్తుడు దేవాలయములో

ప్రవేశించగానే ఈ సుందర శిల్పములు అచ్చటి ప్రశాంత వాతావరణము భజన గీతములు, గంటల ఓంకార ప్రణవధ్వనులు మనస్సును ఆనందడోలికలతో ఓలలాడించుటవలన తనకున్న మానసిక బాధలన్నియు మరచి ఆనందముతో తన్మయత్వం పొందగలడు.



నా గి ని

సాధారణముగా అనారోగ్యముతో బాధ పడే వారి మణిపూర్వక చక్రమున వేలసంఖ్య లోగల నాడులన్నియు మరియు ధమనీ మండ లము శక్తిహీనములై ఉంటాయి. ఆరోగ్య వంతుడు అందమైన యువతియొక్క ఆకర్ష కేంద్రములను చూడగానే తక్షణమే గుండె పొత్తికడుపు వీర్యము ప్రవాకా పంపబడి లైంగిక వాంఛ జనించి త్వరత్వరగా గుండె స్పంధింప నారంభించును. నగ్నముగానో అర్ధనగ్నముగానో యువతియొక్క ఆకర్షక కేంద్రములను చూపించుటవలన శరీరములోని భాగములు చలనము కలుగు నారంభించును కాని సమాజములోని స్త్రీలను చూపించుటకు వీలులేదు కాబట్టి దేవాలయశిల్పములే ఆపాత్ర వహించినవి.

ఈ నగ్న శిల్పముము చూడగానే శరీరములో నిర్వీర్యమై స్తంభించి పోయిన నాడిమండలము రక్త ప్రసరణ మండలము ప్రకోపింపబడి వీర్యకోశ ములు తత్సంబంధమైన నాడీమండలములో కామవాంఛచే ప్రేరేపింపబడి అనా హత చక్రము (గుండె) మణిపూర్వక చక్రము (పొత్తి కడుపు) స్వాధి ష్టానచక్రము (వీర్యకోశములు క్రమక్రమముగా ప్రేరేపింపబడి తీయని లైంగిక వాంఛ జనించ నారంభించును. ఈ విధముగా కుండలినీ శక్తిచే ప్రకోపింపబడి గుండెకూ కడుపు భాగమునకు వీర్యకోశములకు సర్క్యూట్ ఏర్పడి రోగనివారణ జరుపబడుతూ తిరిగిశక్తి జనింప నారంభించును. ఇది

ఇది అతిరహస్యమైన కుండలిని యోగ రహస్యము.

అధునాతన వైద్యశాస్త్ర పరిశోధకులు ఈ విధానమును వైద్య గ్రంథ ములలో ప్రముఖంగా వ్రాసియున్నారు. నేటి వైద్యశాలలయందు రోగులకు సేవ చేయుటకు అందమైన యువతులను నర్సులు (లాలిత్యమును ప్రదర్శించు యువతులు)గా ఏర్పాటు చేయుటలో ఈలాంటి ప్రక్రియ యిందు దాగియున్నది.

నైజాము కాలంలో కళాపిపాసియైన ఒక తురుష్క తాలూకుదారు ఈ నగ్న శిల్పముచే ప్రేరేపింపబడి ముగ్ధుడై మతి చలించి దేవాలయము నుండి ఈ శిల్పమును పెకలించి తీసుకొనిపోవుచుండగా కేంద్ర ప్రభుత్వం వారి ఆదేశానుసారము వరంగల్, హైదాబాద్ మార్గమధ్యలోనే ఈశిల్పమునుస్వాధీన పరచుకొనిరి. వెంటనే ఈ శిల్పమును అతనిచేతనే యథాస్థానమందు బిగింప జేసి అతనిని ఉద్యోగము నుండి తొలగించిరి.

భారతదేశమందు శిల్పములు ప్రపంచములోని మూలమూలలయందు గల మహామహులనే ఆకర్షించుచుండగా ఈ తాలూకుదారు ఆకర్షింపబడకపోవుట వింతఏమియు లేదు. కాని మహోన్నతమైన కాకతీయ శిల్పసంపదను వరంగల్లు లోని ప్రముఖులు ఆదరించకపోవుటలోని అంతర్యమేమిటో తెలియకున్నది.

భారతదేశమునుండి దొంగచాటుగా కాంస్యవిగ్రహములు, శిలాశిల్పములు అమెరికాలాంటి దేశములకు చేర్చబడి లక్షల రూపాయలకు విక్రయింపబడు చుండగా వాటి విలువ ఏమిటో మనకుతెలియకపోవుట మనతప్పు కాదు వందల సంవత్సరములుగా విదేశీ భాషలకు, ఆచారములకు బానిసలనుచేసి మననాగరితను సంస్కృతిని సర్వనాశనం చేసిన ఫలితమే యిప్పుడున్న అస్తవ్యస్త సమాజ పరిస్థితికి కారణము.

ఇప్పటికీ ఈ నగ్న సుందరీ శిల్పము యువకులకు తీయని విందై గిలి గింతలు పెడుతూ హృదయ తంత్రులను మీటుతూ మత్తెక్కించి పురుషత్వము లను ప్రేరేపించి కామముచేత కలయికను కాంక్షపజేస్తున్నది.

ఈ ఆలయ ద్వారములకు బిగించబడిన పండ్రెండు శిల్పములు three dimemssion T.D. పద్ధతిలో మలచబడినవి. రాతి నుండి ప్రతీ భాగము విడదీయబడి బయటికి ఊడిపడుచున్నాదా అను భ్రమ కలిగించును. ఈ పద్ధతి విదేశీ చిత్రాలలో ప్రవేశపెట్టబడి నూతన విధానమును కనుగొన్నామని తలంచు చున్నారు. కాని రామప్ప ఈ పద్ధతిని 12వ శతాబ్దములోనే శిల్పములయందు ప్రవేశపెట్టి భావితరాల శాస్త్రవేత్తలకు మార్గదర్శకుడైనాడు. ఈ ప్రతిభ భారతీయ శిల్పులకే దక్కుటుందనుటలో సందేహము లేదు. ఈలాంటివెన్నో ప్రక్రియలు ఈ ఆలయములో ప్రవేశపెట్టబడినట్లు ఈ పరిశోధనలో కనుగొనబడినవి.

ఈ శిల్పములకు పార్శ్వ భాగములయందు గల లఘుశిల్పములు ఆయువుపట్టు లాంటివి. ఈ లఘుశిల్పములను బట్టి ఆ భంగిమ యొక్క స్వరూపము స్వభావము ఆ సుందరి ఏ జాతికి జెందినది కూడా తెలుసుకొనుటకు సులభమై యున్నది.

## మోటుపల్లి ఓడ రేవు:

కాకతీయ శిల్పములకు విదేశములలో అద్భుతమైన గిరాకీ పెరగడముతో అమూల్యములైన తైలవర్ణ చిత్రములు, శిల్పములు, శ్రీగంధము, కర్పూరము ముత్యములు, దంతములు, కాంస్య విగ్రహములు, సుగంధ ద్రవ్యములు, మిరియాలు, నూలుబట్టలు, కంబళ్ళు, రత్నములు విరివిగా ఎగుమతి చేయబడి కాకతీయులకు విదేశీ విపణివీధిలో మంచి పేరు సంతరించుకున్నారు. కొన్ని ప్రత్యేకమైన సరుకులు అనగా సన్నని నూలు బట్టలు ప్రత్యేకముగా బందరు ఓడరేవు నుండి ఎగుమతి చేయబడుండెను.

పట్టు, గాజు సామాగ్రి, చీనా కర్పూరము, గుఱ్ఱములు దిగుమతి చేయబడెడివి.

ప్రత్యేకముగా కాకతీయ శిల్పములు యొక్క పనితనముచే కాకతీయ శిల్పులకు ప్రపంచములో కీర్తిప్రతిష్టలు సంతరించి పెట్టినవి. విదేశాలలో చదువంతగా లేని రోజులలో ఈ శిల్పములతో శిల్పవాఙ్మయము ద్వారా విజ్ఞాన వంతులైనారు.



## ఎత్తు మడమల శిల్పము:

ఈ శిల్పము ఆనాటి అంతఃపుర రాజకన్యల ఆచార వ్యవహారములను ఆభరణ విశేషములను తెలియజేయుచున్నవి. సామాన్యముగా మెడలో, చేతుయందు గల కంకణములు కాళ్ళ కడియములు ఎత్తుమడమల పాదరక్షలు కేవలం రాజకన్యలే ధరించేవారు ఈఆభరణములు సామాన్యులకందుబాటులోలేనటువంటివి.

---

ఎత్తు మడమల ఆధార శిల్పములు (Bracket & Sines) అనాటి అంతఃపుర రాజకన్యల కట్టుబొట్టు, అలంకార విశేషములను పద్ధతులను తెలియ చేయుచున్నవి.

---

రుద్రమదేవికి రామప్పపైగలఅపారమైన అనిర్వచనమైన ప్రేమవలన రామప్ప నిలిపిన భంగిమలో నిలచిఅద్భుతమైన శిల్ప సుందరీ శిల్పములను రూపకల్పన చేయుటకు తోడ్పడినవి. ఏ శిల్పరచనకైనా, ఏ చిత్ర రచనకైనా ఎదుట ఆధారము లేకుండా రూపకల్పన చేయుట అసాధ్యమైన విషయము రుద్రమకు రామప్పపైగల ప్రేమచే ఎన్నో ప్రయాసములకోర్చి తోటి చెలులు

రాజవంశీకులు స్థానిక ప్రముఖులు ఎన్ని కథలల్లిన లెక్కచేయక రామప్ప దేవాలయంలో శిల్పసుందరిగా తరతరాలకు నిలిచియున్నది.

ఎ ఎత్తుమడమల శిల్పము ఆలయ మండపమునకు అమర్చబడినది. అధు నాతన యుగంలో స్త్రీలకు ఎత్తుమడమల పాదరక్షలు సృష్టించి ఈ సృష్టి అంతయు ఈనాటి అభివృద్ధిగాంచిన నాగరికతగా చెప్పుకొనుట చూచుచున్నాము. కాని 12వ శతాబ్దములోనే ప్రవేశపెట్టబడిన ఈ ఎత్తు మడిమల పాదరక్షలు రూపకల్పన చేయబడినట్లుగా ఈ శిల్పము ద్వారా తెలియుచున్నది.

ఈ దేవాలయ ప్రతి శిల్పములో ఉమ్మడి ప్రయోజనములు ప్రవేశపెట్ట బడినట్లుగా తెలిసికొనియున్నాము. ఈ శిల్పము యొక్క పాదరక్షలు అలంకర ణలు మొదలగునవన్నియు రాచకన్యల అలంకరణములకు రూపకల్పనలే ఈ ఈ పద్ధతులన్నియు రాజకన్యల వరకే పరిమితమైనవి. యువరాణి రుద్రమదేవి ధరించిన మినిస్కర్టు, పాదరక్షలు, ఆభరణములు శిల్పరూపములో పొందుపరచ బడినవి. ఈ ఆభరణములను మితిమించకుండా అమర్చి శరీర భాగములయొక్క అందచందాలను దాచకుండా ప్రవేశపెట్టబడినవి. రామప్ప ఈ శిల్ప సుందరిని తన ఆరాధ్య దేవతయైన రుద్రమదేవి ఆధారముగా మలచబడెను.

స్త్రీలు ఈ ఎత్తుమడమల పాదరక్షలు ఉపయోగించుట వలన ఎలాంటి ఉపయోగములు కలుగునో ఈశిల్పమునుబట్టి సునాయసముగా ఊహించవచ్చును ఈ ఎత్తుమడల పాదరక్షల వలన కీళ్ళ భాగములు తొడలు, పిరుదు భాగములు ఉపస్థకు సంబంధించిన నాడీమండలము ధృఢమునై పురుషునికి లైంగికసుఖమును కలుగజేయు విషయమును ప్రత్యక్షముగా ప్రదర్శించియున్నారు.

ఈ శిల్పము అనాహత (గుండె) చక్రమునకు సంబంధించినదిగా గోచ రించుచున్నది. చక్కని అలంకారముతో పాదరక్షలు సన్నని నగిషిపనితో మినీ స్కర్టు కటివస్త్రము. కాళ్ళ భాగమున ఒక కోతి కటివస్త్రమును లాగుచున్నట్లుగా ఈ శిల్పము గోచరిస్తుంది. కోతిచేష్టలకు, చిలుక పలుకులకు కామ శాస్త్రములో

ఒక ప్రత్యేకత గలదు. కోతి అంగవస్త్రమును లాగగా అకస్మాత్తుగా యోని భాగము వాటి క్రిందికి జారుచున్నట్లుగా ఆ భాగమును ఎడమ చేతితో కప్పివేసి కుడి చేతితో కోతిని కొడుచున్నట్లుగా ఈ శిల్పము గోచరిస్తుంది, ఇందులో ప్రవేశపెట్టబడిన ప్రక్రియ అనాహత చక్రమునకు సంబంధించినది.

ఈ శిల్పము, వేయి స్థంభాల దేవాలయములోని కళ్యాణ మండపములో గల స్థంభముపై రామప్ప తండ్రియైన రుద్రప్ప శిల్పించిన శిల్పమునకు ప్రతి రూపముగా శిల్పించి తండ్రిని మించిన ప్రతిభను ప్రదర్శించినాడు.

## కోతి పెద్ద శిఖగల శిల్పము.

ఒకప్రియ రాజకుమారి అందులో అందాల కుందనపు బొమ్మ. ఆమె ఎప్పుడు బయటికి వెళ్ళినా ఎవరూ గుర్తుపట్టని రూపములో పోవుట అవసరము లేని తీరుకు ఆమె ప్రాణమునకే ప్రమాదము కావున ఒక్కొక్కసారి ప్రియుని సందర్శనమునకు వివిధ వేశములతో వెళ్ళి రామప్పకు కావలసిన భంగిమలో నిలచి రూపచిత్రణ పూర్తి కావడముతో అర్ధరాత్రియో తెల్లవారు జాముననో ఇంటికి రావటము పరిపాటి. ఒకనాడు పెద్దశిఖ, వెడల్పైన చెవుల తాటంకములు, మెడ నిండా బంగారు ఆభరణములు ముంజేతి కడియాలు కాళ్ళకు కడియములు, పట్టు గొలుసులు ధరించి అచ్చముగా దేవకన్య మాదిరిగా వచ్చినప్పటి ఆ రూపమే ఈ శిల్పము యొక్క రూపురేఖలు.

సాధారణముగా మగకోతికి ఒక అందమైన స్త్రీయొక్క శరీర భాగములు కనబడినచో అక్కడి నుండి కదలదు. అందులో నగ్నముగానున్న స్త్రీని గాంచి నచో కామముచే కదలకుండా ఆమె శరీరాంగముల సోయగములను చూచుచు ఆనందించే స్వభావము గలదు. అనే సంబంధమును ఈ శిల్పములో చూపబడినది

అందముగా అలంకరించుకొని మినీస్కర్టునుధరించిపొంగారుకుచములను గాంచి కోతి పరవశించి మినిస్కర్టును లాగగా అకస్మాత్తుగా కటిభాగము నుండి క్రిందికి జారుటయు రహస్య భాగమును ఎడమ చేతితో కప్పుకొనుటయు కోప



యువతి, కోతి- మినీస్కర్టును లాగుచున్న కోతి
అవాహాలు చక్రమునకు సంబంధించిన ప్రతిమ

ముతో కోతిని కొట్టబోయినట్టుగా ఎంతో అందముగా మలచబడినది. చేతి ముద్దు టుంగరాలు సన్నని నడుము భాగము, ఎత్తుమడిమల శిల్పమును పోలియున్నది. కాని చలనత్వములో శారీరక వంపు సొంపులతో ఒక ప్రత్యేకత గోచరిస్తుంది. భుజముల నుండి కాళ్ళ వరకు వ్రేలాడుచున్న రాజకుమారి ధరించు ముత్యాల హారములు ప్రతి మంధాకినీ శిల్పములలో గోచరిస్తుంది. క్రిందగల వింజామర శిల్పము రాజకుమారియని గుర్తుకు తెస్తుంది.

గణపతిదేవుడు వృద్ధుడు కావడముతో ఆలయ ప్రత్యేక పర్యవేక్షణ భారమును కూడా అప్పగించడము వలన రాజప్రాసాదమునందు ధరించెడి పురుష దుస్తులతో చెలికత్తెలతో రాజఠీవితో యువరాజుగా వచ్చి ఆలయమంతా సందర్శించి రామప్పతో ఇష్టాగోష్టి సలిపి చీకటి కాకముందే నగరము చేరు కొనుట ఆమెకు అలవాటు.

ప్రియుని సందర్శనమునకు వచ్చినప్పుడు కోయ వేషములోనో ఎరుక వేషములోనో లంబాడీ వేషములోనో వచ్చి ప్రియునితో సరస సల్లాపములాడి తెల్లవారుజామున వెళ్ళుచుండుట ఒక అలవాటు. రామప్ప ప్రియురాలి అంగాంగ ముల సోయగములను మృదుత్వమును అనుభవించినవాడు కాబట్టి అందులో అద్భుతమైన శిల్పి కళాకారుడు కావడముచేత రుద్రమదేవి యొక్క సన్నని నడుము, పొంగారు బంగారు వక్షోజాలు దృఢమైన ఎత్తయిన పిరుదు భాగములు అచ్చముగా శిల్పములో పొదిగి తన ముద్దుల ప్రేయసి శిల్పముగా మలచి తన పవిత్ర ప్రేమను ప్రదర్శించినాడు ప్రియునిపైగల మమకారముచేత రామప్ప కోరిన భంగిమను ప్రదర్శించి రామప్పపైగల ప్రేమను చాటుకొనినది.

రుద్రమ సాము, గరిడీలు, గుఱ్ఱపు స్వారీలు, యుద్ధ విద్యలు నేర్చినది కాబట్టి ప్రతి అవయవము నిండుగా బలిష్ఠముగా నున్నట్లు మలచిబడనవి. రామప్ప రుద్రమదేవి యొక్క ప్రణయ లీలలు, రామప్పకు కోరిన భంగిమల నిచ్చుటలో రుద్రమ సహకారము. రుద్రమదేవితో వనములయందు చెరువు గట్టు లయందు సంచరించుచు రాత్రంతా కాలము గడుపుట ఆమె ఏ వేళకు ప్రియుని

సంపర్శనమునకు వచ్చునో రామప్పతో ఎచ్చటెచ్చట తిరుగునో ఆ ప్రాంత ప్రజలకు తెలిసియేయుండెను. కాని గణపతిదేవుడు అరివీర భయంకరుడు ఎవరికి తెలిసిన రహస్యము వారి మనస్సులలోనే దాచుకొనెడివారు. ఈ విషయములు చక్రవర్తి చెవినబడిన యెడల శిరచ్ఛేదన జరుగుతుందని ఎవరిమట్టుకువారు ఈ ప్రేమ వ్యవహారములను గుట్టుగా నుంచిరి.

విశ్వాసపాత్రులైన కొందరు రాజబంధువులు ఈ వ్యవహారమును చక్రవర్తులవారికి రహస్యముగా ఎరిగించిరి, చక్రవర్తులకు రుద్రమ యెడల పూర్తి విశ్వాసము గలదు. రామప్ప యెడల సద్భావముండుటయు అప్పటికి హోయసల రాజకుమారి సౌపర్ణి మహాశిల్పియైన జక్కణాచార్యులను ప్రేమించి పెండ్లాడిన విషయము తెలిసియుండుటచేత రుద్రమ విషయములో జోక్యము కలిగించుకొనలేకపోయెను. తన తర్వాత ఈ మహాసామ్రాజ్యమునకు రుద్రమయే మహారాణి కాబట్టి అన్నియు తెలుసి యువరాణికి ఏమియు చెప్పజాలకపోయెను. అందుచేత రుద్రమ శిల్పములను గాంచినను అభ్యంతర పెట్టలేదు. అందుచేత ఎవరికి వారు ఈ విషయములో మూకీభావము వహించిరి.

రుద్రమ సంపూర్ణ సహకారము వలననే ఈ దేవాలయములో అద్భుతమైన శిల్ప కళాఖండాలు వెలసినవి.



భారతదేశములోని ఏ శిల్పములకు అనుకరణలేని స్వంత ప్రతిభ గల శిల్పములు ఈ రామప్ప శిల్పములు చెవులకు పెద్దవైన తాటంకాలు, మెడలో త్రిసరములు మెడపట్టెడలు, ముంగురులుఅనాటి స్త్రీల అభరణవిశేషములు.

## కాలుముల్లు శిల్పము:

ఎడమ చేతిలో ధనుస్సు కుడిచేతిలో బాణము, ధనుస్సు ఆధారముగా ఎడమకాలు పైకి లేపి చక్కని వనితనములో ముత్యాల ముల హారములు బిగువైన కుచముల మీదుగా వ్రేలాడుచున్న కంఠహారములు కళానైపుణ్యముతో చేయబడిన ఓణి స్కర్టు చేతివ్రేళ్ళకు వజ్రములు పొదిగిన ముద్దుటుంగరములు కాళ్ళకు చేతులకు విలువైన కంకణములు, కడియములు రాజఠీవిని ఒలకబోస్తు వయ్యారముగా నిలబడి కాలుముల్లు తీయించుకుంటున్న ఈ భంగిమ రాజకన్య అను భావమును కలుగచేస్తు ప్రియుని స్మరణలో ముల్లు బాధకూడ మరచినట్లు అద్భుతముగా మలచబడినది.

యువరాణి రుద్రమ ప్రియున్ని కలుసుకొనుటకు వేటనెపముతో కోయ కన్యవేశములో పాలంపేటకు వచ్చెడిది. రామప్ప తప్ప యితరులెవ్వరూ రుద్రమదేవియని గుర్తుపట్టుటకు వీలులేనివిధముగా కేశాలంకరణ అంగవస్త్ర ములు ధరించి స్వేచ్ఛగావచ్చెడిది. పనిలో నిమగ్నమైయున్న రామప్ప ఈ బాకను సైగలను గమనించి ఆమెవెంట అడవులకు వెళ్ళి ఆమెతోపాటు వేటలో పాల్గొని రాత్రి అంతయు ఆమెతో కాలము గడిపి స్వర్గసుఖములననుభవించెడి వారు. ఒకరోజురాత్రివేటాడుచుండగాకాలుకుముల్లుగ్రుచ్చుకొనినది. ముల్లువిరుగుట వలన కాలు మోపలేకపోయినది. ప్రియురాలి బాధను సహించలేక ఆమెను అలాగే విల్లుఆధారముగా నిలబెట్టి ఒక బాణపు మొనతో ముల్లు తీయుచుండగా ప్రియుని కరస్పర్శ సుఖముచే ముల్లుబాధ మరచిసిలచిన ఈ భంగిమ ఒకరోజు అడవిలో జరిగిన సన్నివేశమునకు రూపకల్పనగా శిల్పములో మలచెను.

ఈ శిల్పము యొక్క ఆభరణములు మినిస్కర్టు ఆ దేవినిబట్టి ఆమె అంతఃపురరాచకన్యగా గోచరించుచున్నది. రుద్రమదేవి కన్యమ్మగ వేటకు వచ్చినప్పటి సన్నివేశము ఈ శిల్పములోగోచరిస్తుంది. రామప్పకు రుద్రమదేవిపై రుద్రమదేవికి రామప్పపైగల అనురాగబంధమును ఈ శిల్పములో పొందుపరచి తీర్చిదిద్దబడినది. రామప్పకు తన ప్రణయ సుందరిపైగల పవిత్ర ప్రేమాను రాగములను ఈ శిల్పము వెల్లడిచేయుచున్నది.

రామప్ప మాత్రమే రుద్రమను ప్రేమించి యుండి ప్రేమ ఏకపక్షముగా నున్న యెడల సజీవ శిల్పసుందరీమణుల కళాఖండాలు వెలసెడివికావు స్త్రీయొక్క రహస్య అవయవములు అట్టి అందచందాలు బయటపడెడివికావు. రామప్పతల యెప్పుడో తీయబడెడిది. యిరువురి అన్యోన్య ప్రేమానురాగములు విడదీయరానివై యుండుటచేత రతీమన్మథులలాంటి ఈ జంటను వేరుపరుచుటకు వీలులేకుండా పోయినది.

రామప్ప ప్రతి శిల్పము యొక్క భావమును తెలుపుటకు ప్రతి శిల్పములో ప్రక్కభాగమున లీలగా ఏదో ఒక సౌంజ్ఞారూపకలము శిల్పమును శిల్పించి తన ప్రతిభను ప్రదర్శించుకున్నాడు.

ఫేవెతే నృత్య భంగిమ:—

పూర్వము బోధిధర్మ అను బౌద్ధభిక్షువు అనివార్యకారణముల వలన భారతదేశము వదలి చైనాకు వెళ్ళవలసివచ్చెను. చేతిలో ఏ ఆయుధము లేకుండా తను నేర్చిన నాట్యభంగిమలచేత దృఢమైన చేతులపై ఆధారపడి అడవి మార్గమున చైనాకు బయలుదేరెను. మార్గమధ్యమున భయంకర క్రూరమృగములను ఏ ఆయుధము లేకుండా తన హస్తఘాతముతోనే, వధించుచూ ఆత్మరక్షణ చేసుకొనుచూ ఎందరెందరో చోరులను సంహరించుచూ చైనా వెళ్ళగలిగెను. చైనాలోని కొందరు యువకులకు ఈ హస్తఘాతవిద్యను బోధించి శిక్షణనిచ్చి తమను తాము కాపాడుకొని రక్షణకల్పించుకొను నేర్పరి తనమును పరిపేశ పెట్టెను. చైనాలో తిరిగి అంతర్యుద్ధములు ప్రబలి రక్తపాతముతో మారణహోమము జరుగుచున్న తరుణములో బోధిధర్మ తన అనుచరులు తమకుతాము రక్షించుకొని తనను శరణువేడిన వారిని రక్షించి రహస్య మార్గమున జపాన్ చేరగలిగిరి. జపాన్‌లోని కొందరికి ఈ విద్యను నేర్పించి విరివిగా ప్రచారముచేసిరి, జపాన్‌వారు ఈ ఆత్మరక్షణవిద్యకు "కరాటే" అనగా ఏ ఆయుధ సహాయములేకుండా తమచేతులనే ఆయుధములుగా ఉపయోగించి కాపాడుకొనుట అని అర్థము. విద్యనంతా నేర్చినతర్వాత చేతిదెబ్బతో ఒక మదించిన దున్నపోతును చంపుటలో

అతనికి ఒక ప్రత్యేక బిరుదమునిచ్చెడివారు. ఆ విద్యయే నేడు ప్రపంచమంతా వ్యాపించి తిరిగి భారతదేశము చేరుటతో భారతీయులకే వింతగొలుపుచున్నది.



పేరిణి శివతాండవ నృత్యభంగిమలో అంతఃపుర రాజకన్నియల ఆభరణములు
పేరిణి సాంప్రదాయమును తెలుపు మృదంగవాద్యల లఘుశిల్పములు కరాతేపద్ధతి

దీని ఆధారమే పేరిణీ శివతాండవము, ఉదయకాలమందు ఈ తాండవము చేయుటవలన సూర్యునిలోని ఒక ప్రత్యేకమైన అణుశక్తిశరీరమందు ప్రవేశించి అధికశక్తి చేకూరును. శంకరుడు ఈ శక్తిని సాధించుటవలన శివుడుగా అసాధనకు సంబంధించిన నాట్యమునకే పేరిణీశివతాండవమని పేరువచ్చినది. శివుడు గజాముఖ సురసంహారము గావించినట్లుగా కమ్మీలపై శిల్పములుగలవు, అనగా ఈ శివతాండవము యొక్క శక్తిచేత మదగజమును కూడావధింపవచ్చును అను అర్థములో గజాసురముఖ సంహార శిల్పము తీర్చిదిద్దవలసివచ్చినది. ఈ రుద్రేశ్వరాలయములోని ప్రతి శిల్పముతో కరా చే భంగిమలు నాట్యరూపములో పేరిణి శివతాండవరూపముతో విరివిగా గోచరిస్తాయి. ఈ అణుశక్తితో కూడు కున్నదే శివధనస్సు

ఈ శిల్పమునకు యిరువైపుల యిరువురు మృదంగ వాద్యకుల లఘు శిల్పముండుట పేరిణీ నృత్య సాంప్రదాయమనబడును. ఈ భంగిమ కేవలము నృత్యసాంప్రదాయమునే ప్రదర్శించుచున్నది. సాధారణముగా ఈ శివతాండవమును పురుషులే చేయుదురు. కానివారి శరీరములో వంపుసొంపులు స్త్రీల వంపు సొంపులలోని అందమును ప్రదర్శింపజాలవుకాబట్టి ఈ భంగిమలకు రామప్ప తన ప్రియురాలైన రుద్రమ భంగిమనే ఎన్నుకొని శిల్పరూపమున ప్రదర్శించ గలిగెను.

ప్రతి ఆధారశిల్పము (Bracket & Sines) పూర్తి నగ్నముగా నుండి ఆభరణవిశేషములచే అవయవభాగములను మాత్రమే కప్పివేసి స్త్రీ సహజ శరీర సౌందర్యము విన్యాసమునకు అధిక ప్రాధాన్యత నివ్వబడెను. హోయసల దాక్షిణ్య శిల్ప సాంప్రదాయములో ఈ విధమైనసాంప్రదాయము గోచరించదు. స్త్రీశరీరమంతయు పూర్తిగా ఆభరణములతో కప్పిసహజత్వమునకు అవరోధము కల్పించిరి. ఈ శిల్పవిధానము భారత దేశములోని ఏ శిల్పముల ప్రతి రూపములు కావు. కాకతీయ శిల్పవిధానమను ఒక స్వంత శైలిని ఏర్పరుకొనినారు.

మృదువైన చేతి వేళ్ళకు వజ్రపుటుంగరములు సున్నితమైనపసితనముతో మలచబడినవి. ఈ చేతిప్రేళ్ళకు పొడుగాటి గోళ్ళను సృష్టించి రామప్ప సునిశిత మైన నిర్మాణ ప్రతిభను ముందుకు తీసుకపోయినాడు. ఈ భంగిమ ప్రత్యేక. కోణములలో హస్తముద్రలు గలిగి ఒక ప్రత్యేకవృత్తములో వంగియున్నది. విలువైన ఆభరణములు, తలభాగమునకు విలువైన ఆభర్ణములు గలిగి ముఖ ములో ప్రత్యేక భావము గోచరిస్తున్నది.

ఇది పేరిణీ శివతాండవనృత్యము ఈ శిల్పముయొక్క కన్నులుముక్కులు సన్నగానుండి కోలముఖము గలిగి సన్నని పొడుగాటి శరీరముతో ఈ శిల్పము ఒప్పుచున్నది.

రసవత్తరముగా నృత్యం చేస్తున్న సమయములో విలువైన కంఠహారము తెగినట్లుగా గ్రహించి నృత్యమునకు అంతరాయముకలుగకుండా చేతిని ప్రత్యేక ముద్రలు మలచి రెండు కొనవెళ్ళతో హారమును అపుట ఈ శిల్పము యొక్క ప్రత్యేకత ఈ శిల్పముగూడా ముఖమండప ఆధారశిలపై మలచబడినది. ఈ శిల్పము (Three demenssion) పద్ధతిలో మలచబడినది, నాజూకైన వేళ్ళ వేళ్ళకు ఉంగరములు తలచుట్టు ముత్యాల హారమ్ములు[illegible] కలిగిమనోజ్ఞముగా మలచబడినది. ఈ భంగిమయొక్క ముద్రలు ప్రత్యేకమైనవి. రెండువాయిద్య కుల శిల్పములు చిన్నగాను పేరిణీలో చూపదలచుకొన్న వివరముగా భంగిమను పెద్దదిగా (Enlarge)చేసి చూపబడినది ఈ ఆధార శిల్పములన్నియు చిన్న మెడువెన్నుపూసకు వ్యాయామమును కలిగించుటకు ప్రత్యేక కోణములో అమ ర్చబడినది. ఇది కరాటేలోని Eraue Stauee Poseకు సంబంధించినది.

సుందర ముగ్ధమనోహర రూపలావణ్యముతో నాట్యముద్రలు గలిసి చేతు లకు కాళ్ళకు కడియములు గలిగి కటిప్రదేశమున రిబ్బెనలాంటి భూషణము ధరించి కుడికాలు బొటనవ్రేలుపైమోపి గుండ్రటి వెడల్పైన తాటకముగలిగి ముంగురులులాంటి కేశ సౌందర్యముతో అందముగాగోచరిస్తుంది. శిల్పం ఇది పేరిణీ భంగిమ కాకపోయిన నాట్యంలోని ఒక ప్రత్యేక ముద్ర ముఖములో

సౌమ్యత సన్నని నడుము పొడుగాటి కోలముఖము ఇందులో రాజసం అంతర్లీనమై ఒప్పుచూ ఆలయముఖమంటపమునకు అందమును ఆకర్షణను కలుగజేయుచున్నది.

మృదంగ శిల్పం :- మృదంగవాద్యరులు మృదంగములు చేతబూని మృదంగములకు తాళములను ప్రయోగించుకుంటూ కనబడతారు పేరిణి నృత్య సమయములో మృదంగవాద్యకులయొక్క ప్రాముఖ్యతను ఎత్తిచూపుతున్నవి. ఈ నాట్యములో నాట్యముచేయువారేకాక వారి వంతవాద్యకులు ఈ సాంప్రదాయమునకు ఎంతో అవసరమనువిషయము తేటతెల్లనగుచున్నది. ఈ భంగిమకు పీఠముఖతలముపై ముగ్గురునర్తకులు మృదంగ వద్యమునకు తగినట్లుగా అభినయిస్తున్న లఘుశిల్పములు ఆధారశిల్పమునకు తగినట్లుగా అభినయిస్తున్న లఘుశిల్పములు ఆధారశిల్పమునకు తగినట్లుగా మలచబడినవి.



"యువరాణి పద్మిమ్మ శిల్పి రామప్పతో చర్చిస్తున్న దృశ్యం"

ఈ విధముగా ఆధారశిలలపై మొత్తం 12 భంగిమలతో 12 శిల్పములు మలచబడినవి. ఈ వన్నియు ఆలయముఖతలమునకు ఒక ఉద్దేశముతో బిగించబడినవి. దేవాలయము పవిత్రమైనది ఆలయలప్రవేశము చేయునప్పుడుకొన్ని సాంప్రదాయములు పాటించవలసియుండును. అప్పుడే ఆలయపవిత్రి కాపాడిన వారమగుదుము. లక్షలకోట్ల ప్రాణాలను కాపాడుటకునిర్మించిన ఆలయములు

అదిమేలుచేయు పద్ధతులపై దానియొక్క గొప్పతనము ఆధారపడియున్నది. ఆలయ సంప్రదాయములు మానసిక, శారీరక తత్వములకుసంబంధించియుండును

అయితే ఈ లాంటి పవిత్రమైన ఆలయములో నగ్నప్రతిమలు పవిత్ర మైన మానవజీవిత మానసిక ప్రక్రియకు అత్యంతమైన ప్రయోగములుచేసి శిల్పములద్వారా ప్రవేశపెట్టుటలో ఎన్నెన్నో ఆశయములు రాసియున్నవి.

నేటి చాలామంది వ్యక్తులలో విసుగు-కోపము-చిరాకు జీవితముపై జుగుప్స-వైరాగ్యము అసంతృప్తి అసహనము వంటినీచభావాలు ప్రబలెను కట్టు దిట్టమైన మన శాస్త్రీయ సాంప్రదాయములు మానవునిమానసిక శారీర ప్రక్రి యలకు సంబంధించి మానవున్ని ఒక్క చక్కని మార్గములో నడిపి ఆయు ష్షును ఆరోగ్యమును పెంచిప్రకృతి సంపదను అనుభవించిఆనందిపజేయును. కాని ఆచారములు సంప్రదాయములు విచ్ఛిన్నము కావడముతో నీతినియమ ములు మాని హత్యలు - మానభంగాలు - దొంగతనాలు - దోపిడీలు విస్తృత రూపములో ప్రజలో ఆచారసంపన్నులు అమాయకులు అనేక రకాల కష్టనష్టా లకుగురియై తుదకు ప్రాణాలుకోల్పోయి బలియగుచున్నారు.

ఈ లాంటి అస్తవ్యస్త పరిస్థితులకు నీచభావాలకు నరాలబలహీనతలే కారణమని నేటి శాస్త్రజ్ఞుల అభిప్రాయము న్యూరోల్లజిస్టులు అట్టినరాల వ్యాధు లకు చెప్పిన చికిత్స ప్రికారణములు ఈ దేవాలయమున అనేక రూపములలో ప్రవేశపెట్టబడినవి. మహాకవులు, శృంగారభావకులు ప్రవశించే ఉదాత్త కామ కళానుభవాన్ని సామాన్యులుకూడా పొందగలిగేనిజశృంగార శిల్పకళాక్షేత్రాలు నాడే ప్రారంభమైనవి. నిద్రాణమైయున్న కామాన్ని మేల్కొలుపుటకు ఈ కామశిల్పాలు సృష్టించబడినవి.

కామం శారీరకమైనదేకాక ఆధ్యాత్మికమైనది కూడా శరీరసంతృప్తి లభిం చాలనుకున్నప్పుడు శరీర ప్రకృతి మూలహేతునేమిటో అందుకొరకు తార్కిక జ్ఞానముతో వివేచించియే కామశిల్పాలకు సృష్టించవలసివచ్చినది.

కాకతీయశిల్పులు శిలలపై ఉలులనాట్యమాడించి సజీవసుందర శిల్పము లను సృష్టించిరి ఇవి వాస్తుశిల్ప నిర్మాణమునకు, నాట్యశాస్త్ర విన్యాసమునకు, కామశాస్త్రపరిజ్ఞానమునకు, యోగశాస్త్రవిలువలకు దర్పణములాంటివి. ఈ శిల్ప ములు సన్నగా నుండి పొడవైన శరీరలావణ్యము గలిగిఆభరణములుతక్కువై ఈ సాలభంజికలు యోగకామ, కళా రహస్యములుగలిగి రసాలభంజికలై ఆలయముఖమంటపమున స్వాగతమిస్తాయి. ఈ భంగిమలు ప్రేక్షకుల మనో ఫలకములపై చెరగనిముద్రవేస్తున్నవి.

ఈ దేవాలయమునందలి ఏ శిల్పమును పలకరించినా ఒక ఆధ్యాత్మిక రహస్యమునో, ఏ శిల్పమును కదలించినా హృదయాన్ని ఓలలాడించే కమ్మని కామ శాస్త్రమునో ఏ సోయగాన్నిగాంచినా నవరసాలొలికించుచూ మత్తెక్కించే మధురస్మృతులు కలుగజేస్తాయి.

ఈ నల్లరాతి శిల్పములను స్పర్శించినచో అనిర్వచనీయమైన విద్యుత్తు లాంటి శక్తి మనశరీరమున ప్రవేశించుచునట్లు గ్రహించగలము.

అద్దమువలె తళతళ మెరియుచున్న శిల్పభాగములు, మహాపద్మరాజము ఆలయనర్తకి మణిదీపహారతులు గలిగి నృత్యంచేయుచున్నప్పుడు దీపముల నుండి మణులనుండి వెలువడే కిరణములు నలువైపుల విస్తరింపజేయుటదిశ్యము మును వీక్షించుచున్న ప్రజలకు ఈ కిరణముల ప్రభావము సంక్రమింపబడును. ఈనీలి శిలల మూలమున అణుకిరణముల తీవ్రత శరీరమునకు తగినవిధముగా తగ్గింపబడును.

కాకతీయ శిల్పములో చలనత్వము సజీవత్వము గలిగి వివిధ భావము లను గోచరింపజేస్తాయి. భారత, భాగవత, రామాయణములకు బాష్యములుగా పండితులు మొదలు పామరులు కూడా ఈ శిల్పములలోని భావగాంభీర్యమును అర్థముచేసుకొని అను భూతిపొందగలుగుచున్నారు. ఈ ఆలయం నిజముగా కాకతీయులకలలపంట.

ఈ ఆలయ శిల్పకళా వైభవమును పండితులు, విద్యాగంధం లేని వారు చెవిటి వారేకాకుండా స్పర్శజ్ఞానముతో గ్రుడ్డివారు సహితం శిల్పభంగిమలోని భావమును తెలుసుకొని ఆనందానుభూతిని పొందుచున్నారు.

బయట ఎండతీవ్రత ఎంత అధికముగానుంటే అంత రాళములో గర్భాలయములో అంత చల్లదనముగను, బయటి వాతావరణము చల్లగానున్నయెడల అంతరాళములో గర్భాలయములో వెచ్చదనముగలిగి ద్వివిధ ప్రక్రియలందు ప్రవేశపెట్టబడినవి. ఈ శీతలీకరణమునకు, ఆష్ణజనీకరణమునకు, గర్భాలయమునకు మూడువైపుల యందుగల మూడంతస్తుల వాయుకోష్ఠములులేక వాయు శీతలీకరణ (Air conditioning plants) కారణమని ప్రముఖుల అభిప్రాయాము పూర్వపు శిల్పులు ఈ విధానమును కనుగొని మానవకళ్యాణమునకు ఆలయములందు ప్రవేశపెట్టబడినది. ఈ శీతలీకరణ లక్షణము నీలిశిలలకే కలదు. అందుచేత అలయప్రధాన భాగములకు నీలిశిలనే ఉపయోగించినారు. ఈ నల్లరాయిని ఒక శాస్త్రీప్రయోగము రూపముననేగాక సూక్ష్మశిల్పభాగమును శిల్పించుటకు కూడా ఉపయోగించి ఉమ్మడి ప్రయోజనములను సాధించినారు.

అందుచేత కాకతీయశిల్ప నిర్మాణ ప్రతిభ ఒక ప్రత్యేక సంప్రదాయమును సంతరించుకొని దేశవిదేశాలలో కాకతీయుల కీర్తిప్రతిష్ఠలను యినుమడింపజేసినది,

ముఖ్యశిల్పములుమాత్రమే ప్రాధాన్యతకల్గి లేకుండా ప్రక్కనున్న లఘు శిల్పములను కూడా సజీవత్వముతో గోచరిస్తాయి గణపతిస శివున్నిపరివేష్టించి యున్న యితర దిక్పాలకులకు లీలగా ఒక విధమైన కదలిక తన్మయత్వం గోచరిస్తుంది. ఏ శిల్పముముందు నిలచినా-ఎప్పుడొచ్చినారు, అంతా బాగున్నారా అని ప్రత్యక్షముగా ముచ్చటించినట్లు అనుభూతికలుగుతుంది.

అజంతా శిల్పములలో నాలుగు జింకలకు ఒకేతలను, భువనేశ్వరములోని శిల్పములకు నలుగురికికలిపి రెండేతలలను సృష్టించిమెప్పును బడసినారు రామప్ప తనశిల్ప చాతుర్యమును అధిగమింపజేసి ముగ్గురు నర్తకులకు ఒక

ఉపయుక్తమైన ప్రయోజనమును ప్రవేశపెడుతూ గుఱ్ఱముపై కూర్చున్నప్పటి కాళ్ళభంగిమలను కలిగి నాట్యభంగిమలో ముగ్గురికి నాలుగు కాళ్ళతో అనుకొన్నట్లుగా భ్రమకల్పించినాడు. ఈ భంగిమ స్వభావమును చైనాదేశములో కిబదాషియని అనగా (Horse Rider Stance Pose) ప్రచారమౌతున్నది. అనగా గుఱ్ఱము పైకూర్చున్నప్పటి విధానమును యిందు ప్రవేశపెట్టబడినది. చేతులు నాట్యసమయములో పైకెత్తిన విధముగా పైకెత్తబడిన చేతులను అప్పర్ బ్లాక్ అనియు క్రిందిచేతులకు లోయర్ బ్లాక్ అనియుపేరు ఈ పద్ధతివలన కాళ్ళ నడుము చేతులు అధికశక్తి సంకర్షించుకొని ఎదుటి శక్తులను ఎదిరించే ప్రయోగ మీందు యిమిడ్చబడినది రామప్పయొక్క కళాసృష్టి దేవాలయమంతటా లయ మయ చైతన్యముతో భావయుక్తముగా ప్రయోజన సహితముగా ప్రాధాన్యత గలిగి దర్శనమిస్తాయి. ఈ విధానమంతా జపాన్‌లో ప్రవేశించి మీరు పేర్లతో మనదగ్గరికి దిగుమతియగుచున్నవి. యివి మార్షల్ ఆర్ట్సుగా అనగా Power full కరాటే పద్ధతిగా నేడువివుల ప్రచారముగా చూస్తున్నాము వీటికి భారతీయ శిల్పములు, నృత్యములే మాతృకలు

రామప్పదేవాలయము-వరంగల్ కోటలోని శిధిల శిల్పములు-పానుగల్లు-పిల్లలమఱ్ఱిఆలయాలు - హంపీ విజయనగరము - లేపాక్షి-తాడిపత్రి ఆలయాలు మాచర్లలోని చెన్నకేశవలయాలు శ్రీశైలం - మార్కాపురం మందిరాలు కాళహస్తి, కంచి, కైలాసనాధమొదలగు ఆలయములో ప్రాచీనాంధ్రనృత్య శిల్ప కళా వైభవము తెలియజేయు భంగిమలు విరివిగాగోచరిస్తాయి.

ఈ శిల్పములోని భావమును విదేశీయులు అర్ధముచేసుకొని వాటిని సాధించి ప్రపంచ ఖ్యాతిగాంచుచున్నారు. కాని భారతదేశములోని శిల్పముల యందలి భావగర్భితమైన విషయములను అర్ధముచేసుకొన లేకపోవుట చాలా దురదృష్టకరమైనదని. భావించుచున్నాను.

అందుచేత విదేశములలో భారతదేశ ఏ శిల్పమునకైన లక్షల రూపాయిలిచ్చి కొంటున్నారంటే వాళ్ళుపించివాళ్ళుకారని అమ్మేమనమే అజ్ఞానులమని

గపునించాలి భారతీయశిల్పములలో ఏ ప్రాధాన్యతలేనిచో యింత విపరీతమైన గిరాకీ ఉండెడిదికాదు. ఇప్పటికైన మన శిల్పులు ప్రవేశపెట్టిన శాస్త్రవిజ్ఞానమును అర్ధముచేసుకొని శిల్పులను-చిత్రకారులను పండితులను-నాట్యాచార్యులను ఆదరించి అంతరించిపోవుచున్న ఈ అద్భుతమైన సాంప్రదాయమును ప్రభుత్వము కాపాడవలసి యున్నది. అడవులలో ఏ కొరతా లేకుండా బ్రతుకుతున్న జంతువుల రక్షణకువన్యమృగరక్షణ పేరుతో లక్షలకు లక్షలు ఖర్చుచేయుచున్న ఈ ప్రభుత్వములు మానవజాతికి మానవకళ్యాణమునకు ఉపయోగపడుచున్న తోటిమానవుడైన కళాకారులకు పోషణలేక పోవుట చాలా విచారకరమైన విషయముగా భావించబడుచున్నది.

ప్రతివాడు కష్టపడి విద్యావంతుడు కావచ్చును, కాని ప్రతి విద్యావంతుడు కళాకారుడుకాలేడు ఇది దైవదత్తమైన వరప్రసాదము ఈ లలితకళనవలన ఇంకెన్నో అద్భుతమైన శక్తులు ప్రసాదింపబడి ప్రాణములను కాపాడుచున్నవి. కాబట్టె పూర్వీకులు వీటికి అధికప్రాధాన్యతనిచ్చి కవులను కళాకారులను పోషించి ఈ సాంప్రదాయమును కాపాడినారు.

తర్వాత కాకతీయ సామ్రాజ్యములో ప్రఖ్యాతిగాంచినవర్తకీమణిముద్దసాని ఆమె మనుమరాలు ప్రఖ్యాతనర్తకీ వణిమాచల్‌దేవి ప్రతాపరుద్రునికాలములో ఆస్థాన నర్తకీమణిగా యుండెను. ఈమె పేరు గల ఒకమందిరము మట్టికోటలో కూరుక పోయినది. ఈమె నివాసభవనము కాకతీయ రాజుల భవనముతో సరితూగగల ఉన్నతమై వెలసినదట.

వీరి ఆభరణములు ప్రాచీన పద్ధతులలో నుండెడివి. రాజుల పాత్రలు ధరించెడి వీధిభాగవతులకు యితర వేషధారణ వేయువారి కిరీటములు దేవాలయమందలి దేవతల కిరీటములు పోలియున్నవి.

రుద్రుడు యితర దేవతాగణమునకు రూపలావణ్యములో ఒకే పోలికలు గోచరించినా వ్యత్యాసము మాత్రము గోచరించును. ఆయుధ విశేషములలో వస్త్రాలంకరణలో తలకట్టు ఆభరణాల విషయములో ఏ యితర శిల్పములకు

అనుకరణలేకుండా కాకతీయశిల్పము అనదగిన స్వంత శిల్పనిర్మాణ పద్ధతిని ఉపయోగించి హస్తముద్రిలు, కోలముఖములు ముక్కులు మొనలుదేరి సంపెంగ పూలరేకులను పోలియున్నది.

హోదాల విషయములో ఒకేరకమైన శిరప్రాణములు గోచరించినా అంగ ప్రమాణములో మాత్రము భిన్నత్వము స్పష్టముగా గోచరిస్తుంది. స్త్రీ పురుష ప్రతిమలకు ఒకే రకమైన అలంకారములు వస్త్రములు వాడబడినవి. అవి దేవతాశిల్పములైనప్పటికి నడుమువరకు ఏ లాంటి అచ్ఛాదన లేకుండా నగ్నముగాగోచరించును. నడుమునుండి మోకాళ్ళవరకు ప్రత్యేక ఆభరణములతో అచ్ఛాదన గావింపబడినది.

ఒకవైపు ఆధ్యాత్మిక భావమును ప్రదర్శించు శిల్పములను చూపుతూ మరొకవైపు శృంగార ప్రధానమైన లైంగిక శిల్పములు ప్రవేశపెట్టబడి ఆధ్యాత్మిక వికాసముతో అటు కామశాస్త్రవిజ్ఞానమును కలుగజేయు ఒపక ప్రయోగశాలగా గోచరించును.

ఎన్ని దశాబ్దముల క్రింద ఏ దేవదాసీగణములు ఈ నృత్యభంగిమలను ప్రదర్శించి ఆ బాలగోపాలాన్ని ఆనందపరిచారో ఆ భంగిమను శిల్పులు ఎన్ని సంవత్సరముల క్రితం శిలలో శాశ్వత పరచారో ఈ కళలను ఏ ప్రభువులు పోషించినారో ఈనాడు ఆ దేవదాసీగణములు, ఆ శిల్పులు ఆ ప్రభువులు కాల వాహినిలో అదృశ్యమైనారు. కాని వారు నిర్మింపజేసిన ఆలయాలు కళాఖండాలు శిల్పములు సొబగులీనుచూ నేటికికళలను మహాత్మ్యమును ఆనాటి నాగరికతా విశేషాలను సాంప్రదాయములను తెలుసుకొనగోరు సౌందర్యోపాసకులు దేశ పర్యాటకులకు కళాకారులకు, శిల్పులకు, చరిత్ర పరిశోధకులకు, శాస్త్రీపరిశోధకులకు సందేశములనిస్తూ స్వాగతమిస్తున్న ఈ కళాఖండాలు వారి పరిశోధనలు సరిదిద్దుకొనుటకు సాక్ష్యముగా నిలచియున్నవి.

ఈ దేవాలయము తర్క, వేదాంత, మీమాంస, వ్యాకరణాదులందు ఉద్దండపండితులైన కుండనాల పండితులకు నాట్యకళావేత్తలకు కళాపాసకులకు కళాభిమానులకు నేత్రపర్వమైన విందుకలుగజేయుచు కళాకేంద్రమై ఒప్పుచున్నది.



## రా ష లో మ్

కాలిఫోర్నియా ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి చెందిన ఖగోళశాస్త్రజ్ఞుడు ఎలినార్ హెలిన్ యిటీవల ఒక క్రొత్త ఉపగ్రహమును కనుగొన్నాడు దానికి రాషలోమ్ అని నామకరణం చేసినాడు ఆ ఖగోళశాస్త్రవేత్త "రా" అంటె ఈజిప్టు భాషలో సూర్యదేవుడని "షలోమ్" అనునది హీబ్రూభాషలో శాంతికి పర్యాయ పదం ఈ రెండింటిమేలు కలయికతో నామకరణం చేయబడిన ఆ క్రొత్త ఉపగ్రహం ప్రపంచశాంతికి ఆశాకిరణంగా వెలుగొందగలదని ఆ శాస్త్రవేత్త ఆశించుచున్నాడు. —ఈనాడు 17-2-79 శనివారం పత్రిక ఆధారంగా

ఈ ప్రధాన ఆలయమునకు కుడిఏడమలుగా చక్కని పనితనముతోశిల్ప

ముగల రెండు చిన్న ఆలయములు గలవు ఎడమ వైపునగలది కోటేశ్వరాలయ ము, కుడివైపునగలది. భోగేశ్వరాలయము.

కోటేశ్వరాలయము శైవమత ప్రాధాన్యతగలది ఇదికూడా ఎత్తైన ఉప పీఠముపై నిర్మింపబడినది. దీని ప్రవేశద్వారమునకు యిరవైపుల శిల్పకళతో నిండిన రెండు ఏనుగులుగలవు, దీని చుట్టూ లతలతో పద్మములతో తీర్చిదిద్ద బడినది ఇందులోని శివలింగము లుప్తమై యున్నది. నందిశిల్పముకూడా శిధిలమై యున్నది. ఈ ఆలయము పూర్తి శిధిలమై యున్నది. ఇది ముదురుగులాబి ఎఱు పురాతితో నిర్మింపబడినది.

ముఖ్య ఆలయమునకు కుడిభాగమున ఎత్తైన ఉపపీఠముపై పూర్తి ఎరుపురాతితో నిర్మించినది. ఇది భోగేశ్వరాలయముగా ప్రచారములోనున్నది. ద్వారములకు ఎత్తైన ఏనుగుశిల్పములు గలవు. లోపల ప్రధానమంటపమున నాలుగుస్తంభముల మధ్యన వర్తులాకారపు బలపీఠమునకు విప్పారిన సహస్రదళ పద్మరాజముగలదు. ద్వారములకు వేయిస్తంభాలమంటపములోని పూర్ణకుంభము లను బోలిన శిల్పములుగలవు. ఈ స్తంభములకు ఈ క్రింది భాగమున నాలుగు ముఖతలములపై పూర్తి వైష్ణవ సాంప్రదాయ శిల్పములుగలవు కృష్ణుడూ-గోపి కలు, వేణువును మ్రోగించుచున్న కృష్ణుడు నాట్యమాడుచున్న గోపికా లఘు శిల్పములు మలచబడినది. వాలిసుగ్రీవుడు, లక్ష్మణుడు, హనుమంతుడు, రాముడు మొదలగు శిల్పములు ఎంతోనేర్పుతో మలచబడినవి. ముగ్గురు నాట్య కారులకు ఆరుకాళ్ళకు బదులుగా నాలుగుకాళ్ళతో శిల్పము పూర్తిచేయబడినది. ఇందులోని మూల విగ్రహము లుప్తమైయున్నది. ఈ ఆలయములోని శిల్ప ములు నేత్రపర్వముగా నున్నవి.

ముఖ్యఆలయమునకు పడమరదిశగా ఒక ధర్మశాల గలదు. ఆలయ నిర్మాణ సమయములో శిల్పులకు వంటశాలగా ఉపయోగించినారు.

ఈ ధర్మశాలకు ముందు భాగమున ఒక పెద్ద రేగుచెట్టుగలదు. దీనికి ముళ్లులేకపోవుట ఒక ప్రత్యేకత.

ప్రధానాలయము యొక్క ప్రధాన ప్రవేశ ద్వారము శిథిలమైనందున పడమటి దిడ్డిమార్గము ద్వారా ప్రజలు రాకపోకలు జరుపుచున్నారు.

ఈ ఆలయమునకు ముందుభాగమున గల కళ్యాణ మంటపము పూర్తిగా శిథిలమై నేలమట్టమైనది.

మహిషాసుర మర్ధని ఎరుపురాతితో మలచబడినది. దీని ఎత్తు దాదాపు $4\frac{1}{2}$ అడుగుల ఎత్తు ఇది ఆలయ ముందు భాగమున నిలబెట్టబడి యున్నది. రాతితో కొట్టినచో ఇటుకలధ్వని వినిపించును. ఈ శిల్పమునకు పక్కగా గణపతి శిల్పము గలదు. దీనినుండి కంచు శబ్దాము సృష్టించవచ్చును.

ఈ ఆలయమునకు రామప్ప శిల్పిపేరుతో రామప్ప చెఱువు కలదు. అర్ధ చంద్రాకారముతోనున్న పర్వతములను కలుపుతూ ఒక కట్టవేయబడియున్నది. ఈ చెఱువు వైశాల్యము 82 చ. మై. ఒక సముద్రము మాదిరిగా గోచరిస్తుంది. ఈ చెరువు కట్టకు రెండువైపుల సుందరమనోహర శిల్పములు గల ఆలయములు గలవు మత్తడి వద్దగల ఆలయము శివాలయము ఇది ఒక గట్టునానుకొని చెరువు గట్టుపైగలదు. ఇదికూడా ప్రధానాలయమును బోలియున్నది.

కట్టకు రెండవ వైష్ణవ సాంప్రదాయ ఆలయములుగలవు. ఇవి చిన్న ఆలయములైనప్పటికి చక్కనిశిల్పములతో అలరారుచున్నవి. ఇవి కూడా గట్టు నానుకొని యున్నవి.

కట్టపైగల శివాలయము నానుకొని ఒక యాత్రికా భవనముగలదు. చక్కని ప్రకృతి శోభగలిగి మానవ మనస్సుపై, శరీరముపై చక్కనిప్రభావము కలుగ జేయగల వాతావరణము గలదు.

మహాశిల్పి నిలయముగా, మహావిజ్ఞాన పుంజముగా, తత్వనిలయముగా వెలసిన ముఖ్యాలయము శాస్త్రపరిజ్ఞానముతో శిల్పకళా చాతుర్యముతో శిల్పకళా ఖండాలను సృష్టించిన రామప్ప తన పేరును ఏ భాగమందు కూడా మలచ కొనకపోవడము అతని త్యాగనిరతికి దర్పణము లాంటిది. ఇంతటి ఘనమైన దేవాలయము నిర్మించి ఓహోయనిపించుకొన్న ఈ మహాశిల్పి ఇంకా నాకంటె

గొప్పశిల్పులున్నారు. అనుభావముతో ఎక్కడా తన పేరును ప్రతిభను వ్రాతలు లేకపోవుట ఒక ప్రత్యేకత.

ఈ దేవాలయము యొక్క నేతృత్వముతో ఘనపురము వద్దగల దేవాలయముతో మొత్తం 360చిన్నా పెద్ద ఆలయములు గలవు వీటికి తర్వాత కాలములో ఆదరణ లేక శిథిలమైయున్నవి. రోజు కొక్క ఆలయం చొప్పున 360 పూజాకార్యక్రమములు జరుపబడుచూ నిత్యకళ్యాణం పచ్చతోరణముగా వెలుగ కలిగినది,

చిన్న చిన్న ఆలయములందుగలలింగాకారములన్నియుదొంగిలించబడినవి.

ప్రధానాలయము దాదాపు ఐదు సంవత్సరములు వరకు నిర్మించి పూర్తి చేసిరి.

ఈ నిర్మాణ కాలములో రుద్రమ రహస్యముగా ఎన్నిసార్లు రామప్పతో ప్రేమ కలాపములునల్పి కావలసిన భంగిమలనిచ్చి వెళ్ళిపోయెడిది. ఆమె యొక్క సౌందర్యోపాసన స్వరూపమే ఈ దేవాలయ శిల్ప కళాఖండాలుగా వెలసినవి. రామప్ప - రుద్రమదేవి మధ్యన విడరాని బంధమేర్పడినది.

ఇంతటి శిల్పవైభవముగల దేవాలయ నిర్మాణమునకు ఆ విశ్వకర్మ భగవానుని అనుగ్రహమే అని రామప్ప ఉప్పొంగిపోయెడివాడు.

గణపతి దేవునికి మగసంతానము లేదు. ఇద్దరూ కూతుళ్ళే రుద్రమ, గణపాంబ తన తర్వాత ఈ విశాల కాకతీయ సామ్రాజ్య పరిపాలనా బాధ్యత వహించుటకు సమర్థురాలు రుద్రమదేవియే.

రుద్రమదేవి రామప్పను మనసారా ప్రేమించిన విషయము వృద్ధుడైన గణపతి దేవునికి తెలిసియే యుండేను. తనకు ఎన్నో న్నోరాజకార్యములయందు సలహాలనిచ్చి అనేక విజయములకు కారకురాలు మహావీరవనితయైన రుద్రమ అభిప్రాయమే తన అభిప్రాయముగానుండెను. ఆమెదెప్పుడు ఏ విషయములోను

కళాకారులు పట్టాభిషేక మహోత్సవమునకు వచ్చియుండిరి. రామప్పకు ప్రత్యేక ఆహ్వానము పంపబడెను. ఏదోకారణముచేత రామప్ప రాలేకపోయెను. రామప్ప రాలేదను విషయము తెల్సి రుద్రమ బాధపడెను.

శుభముహూర్తమున అందరి సమక్షమున ప్రముఖుల ఆశీర్వచనములతో రుద్రమదేవికి ఘనముగా పట్టాభిషేకమయ్యెను. ఈ వార్త రామప్పకు పట్టరాని సంతోషము కల్గించెను. తనకే పట్టాభిషేకమయినట్లు ఉప్పొంగిపోయెను. తన మనసుతో మనసు కలిపి, తన తనువుతో తనువు కలిపి కాముని వున్నమరాత్రి తనను పెనవేసుకొనిన మధుర రాత్రులు జ్ఞప్తికి వచ్చి రామప్ప మురిసిపోయెను తనివితీరా తన మృదు మధుర శరీర స్పర్శసే సత్తైక్కించి అభయ త్రిభంగి భుజంగినీ, భంగిమల శిల్పములకు రూపములనిచ్చిన తన ప్రియురాలు కాకతీయ మహా సామ్రాజ్యమునకు ఒక మహారాణి అగుట తన అదృష్టముగా తలచి సంబరపడిపోయెను.

గణపతిదేవునికి ఓ సమస్య తీరినది. రెండవది వివాహ సమస్య.

రుద్రమకు పట్టాభిషేకమయిన తర్వాత సామంతులు, కొందరు దాయాదులు ఒక మహాసామ్రాజ్యమునకు రాణి ఒక స్త్రీయగుట ఆమెకు వంగి దండాలు పెట్టుటకిష్టపడకపోయిరి. అది ఒక అవమానముగా భావించి దేశములో విప్లవములు తీయుటకు సిద్దపడి ఏ విధముగానైనా ఆ సింహాసనమును ఆక్రమించవలెనని తలంచి ప్రజలలో విప్లవ జ్వాలలు సృష్టించ మొదలు పెట్టిరి. తురుష్కులు కాకతీయ సామ్రాజ్యమును ఆక్రమించుటకు ఇది తగిన సమయమని యుద్ధమునకు సన్నద్ధులగుచుండిరి.

గణపతిదేవుడు రుద్రమను రావించి రామప్ప విషయములో రుద్రమదేవి యొక్క అభిప్రాయము కోరెను. రుద్రమ రామప్పను తప్ప వేరెవరిని.

వివాహమాడుటకు ఇష్టపడలేదు. ఐదు సంవత్సరములు రామప్పకు తన

మనస్సును, శరీరమును, తన సర్వస్వము అర్పించుట చేతనే రామప్ప విసుగు విరామము లేకుండా శిల్పకళాఖండాలను సృష్టించుటకు తాను ప్రదర్శించిన ఆప్యాయత ప్రేమయే కారణము. అతడొక మహాశిల్పియేకాక అందగాడు, హృదయమున్న మగవాడు. తన ప్రోత్సాహము వలననే కాకతీయులకు శిల్పకళాఖండాలు సృష్టించి ప్రపంచ చరిత్రలో ఒక గౌరవాన్ని నిలిపిన మహానుభావుడు. తాను కాదంటే రామప్ప బ్రతుకలేడు. రామప్ప మానసిక పరిస్థితి బాగుగా తెల్సిన రుద్రమ రామప్పకు అన్యాయము చేయదలచలేదు. తనకు నచ్చిన వానిని వివాహమాడుట క్రొత్త విషయము కూడా కాదు. జక్కనాచార్యుడు హోయసల రాజకుమారిని ప్రేమించి పెళ్ళిచేసికొని చరిత్రలో అద్భుతమైన కళాఖండాలను సృష్టించినాడు కాబట్టి రామప్పకు నేను అన్యాయము చేయలేను. తనకు రాజ్యమునైనా త్యజించెదను. కాని రామప్పను వదలలేనని అది తుది నిర్ణయముగా తండ్రికి తెలియజేసెను.

గణపతిదేవుడు రామప్పను రహస్యముగా రావించి రుద్రమదేవి విషయమడిగెను. నా రక్తకణాలలో రుద్రమదేవి రక్తకణాలలో మా ఇరువురి శరీర తత్వము మార్పిడి జరిగినది. నరనరాలలో రుద్రమదేవి నిలిచి దేవాలయమునందలి శిల్ప సుందరీమణులను తీర్చిదిద్దుటకు తోడ్పడి స్వర్గసుఖములనిచ్చినది. రుద్రమదేవియే తోడ్పడనిచో ఈ శిల్పములు సుందరాకృతి దాల్చెడివికావు. కాబట్టి రుద్రమ లేనిదే నేను బ్రతుకుట దుర్లభము అని తన తుదినిర్ణయము తెలిపెను.

రుద్రమదేవిని మరచిపోవలసినదిగా రామప్పను ప్రాధేయపడెను. కావలసిన ధనమునిచ్చెదను. ఎక్కడకైనా పెళ్ళిపోయి హాయిగా బ్రతుకవలసినదిగా ప్రార్థించెను. ఇది నా కుటుంబ గౌరవ రహస్యమని పరిపరివిధములుగా వేడుకొనెను. రామప్ప మానసిక సంక్షోభముతో తిరిగి పాలంపేట చేరుకొనెను.

పొరుగురాజ్యాల వారు ఎవరికి వారే దండయాత్రలకు సిద్ధమగుచున్నట్లుగా చారులచేత వార్తలు వచ్చుచుండెను. దేశములో అంతఃకలహాలు చెలరేగుచుండెను. వాటినణుచుట సాధ్యపడకపోయెను. సైన్యాధికారులు మంత్రులు ఎంత ప్రయత్నము చేసినను యుద్ధ ప్రయత్నములు మానునట్లు కనబడుటలేదు

చక్రవర్తులు రుద్రమదేవిని రావించి ఈ క్లిష్టపరిస్థితిని తెలియజేసెను. నాలుగువైపుల ఇంతకాలము వేచియున్న శత్రురాజులు కొన్ని కోటలను ఆక్రమించుకొనుటట మొదలుపెట్టిరి. ఆ విషయము రుద్రమదేవి స్వయముగా గాంచుచుండెను. ఇట్టి రాజకీయ విపత్కర పరిస్థితులలో తనకు తోడు వీరుడు యుద్ధతంత్ర నిపుణుడు ఉన్నచో ఎంత పెద్ద దండయాత్రనైనా సునాయాసముగా ఎదుర్కొనవచ్చునను అభిప్రాయమును తండ్రి రుద్రమదేవికితెల్పినా కీర్తి ప్రతిష్ఠలను కాకతీయ సామ్రాజ్యమును మంటకలపవలదని కూతురుని ప్రాధేయ పూర్వకముగా వేడుకొని విలపించెను.

ఈ పరిస్థితులను తండ్రి వేదనను రాజకీయ సంక్షోభమునుగాంచి రుద్రమ తండ్రి మాటను బలపరచెను.

అణిగిమణిగి యున్న శత్రురాజులు ఏ క్షణములోనైనా దాడి జరుపుటకు సిద్ధముగా నున్నారని వార్తలు వచ్చుచుండెను. వారిని ఎదిరించుటకు కాకతీయ సైనికులు సిద్ధమగుచుండిరి. దేశమంత అయోమయముగా నుండెను. తండ్రి వృద్ధుడు. మంత్రి 60 సం॥ల వృద్ధుడు చెల్లెలు రూపాంబ అప్పటికే తనకంటే ముందుగానే బ్రాహ్మణ యువకున్ని ప్రేమించి వివాహమాడెను. చెల్లెలు వైపున కూడా బలహీనముగా నుండెను.

విధి వక్రించినపుడు ఎవరుకూడా ఏమియు చేయలేరు. ఈ హడావిడిలోనే రుద్రమకు పెళ్ళి నిశ్చయమాయెను. కల్యాణవేదికను నిర్మించుటకు రామప్పకు ఆహ్వానము వచ్చెను. ఆ ఆహ్వానముగాంచిన రామప్పపై పిడుగుపడినిట్లాయెను, మతి చలించిపోయెను. రామప్ప రాకపోవుటచే సమయము లేనందున వేరే

శిల్పులచే వివాహ వేదిక రాత్రికిరాత్రి సిద్ధమాయెను. తక్కువ వ్యవధిలోనే అందుబాటులోనున్న బంధువర్గములను హడావిడిగా ఆహ్వానించిరి. ప్రజలందరు, ఈ అకస్మాత్తుగా నిర్ణయమైన పెండ్లి విషయము ఆశ్చర్యచకితులను చేసెను. అయినను రాతికోటయందు మంత్రిలు, సామంతులు, దండనాధులు విడిదిచేసి యుండిరి.

వివాహ వేదిక పైకి వచ్చేముందు రుద్రమ పెండ్లి బట్టలతో భద్రకాళి దేవాలయమునకు వచ్చి ఆదేవతను క్షమించమని, రామప్పకు నావలన ఏ ప్రాణ హాని రాకూడదని ప్రార్థించెను. తనకూ రామప్పకూ మానసికముగా, శారీరకముగా ఎప్పుడో లగ్నమయినది. కాని ఇది బాహ్యప్రపంచమునకు మాత్రమే. ఇప్పుడు వేరొకరితో జరుగుచున్నదిని వీరవనిత తన ప్రియుణ్ణి కాపాడవలసినదిగా వల వల విలపించుచు ప్రార్థించినది.

వేదపండితులతో, బ్రాహ్మణులతో రాజభవనమంతయు కి ట కి ట లా డు చు ం డె ను.

వైదిక సాంప్రదాయానుసారముగా పెండ్లికుమార్తె రుద్రమను కళ్యాణ మంటపములోనికి మంగళహారతులతో చెలులు వెంటరాగ ముత్తైదువలు రుద్రమను పెండ్లిపీటపై కూర్చుండబెట్టిరి.

ప్రముఖుల పెద్దల సమక్షమున ఆర్థికబలము లేనివాడు మహావీరుడైన చాళుక్య వంశీయుడు ఒక మండలాధిపతియైన వీరభద్రునికి, రుద్రమకు వైభోపేతముగా వివాహముగా జరిగినది.

రుద్రమకు వివాహమైన విషయము రామప్పకు, తెల్సి స్తంభించిపోయెను రామప్పకు పిడుగుపడి మతి చలించినట్లాయెను. నిద్రాహారములు మానివేసి తైల సంస్కారము లేక ఏదో అమూల్యమైన వస్తువును పోగొట్టుకొనిన వానిగా ఏవేవో తనలోతాను మాట్లాడుకొనుచు ఆలయములోని శిల్పముల చూస్తూ తిలగ

నారంభించెను. శిల్పిగా గౌరవించిన వారందరికీ రామప్ప పరిస్థితి చూసి హృదయము దహించిపోయెను. ఆలయములోని ఏ శిల్పమునుగాంచిన రుద్రమదేవి స్వరూపమే కనబడజొచ్చెను. సముద్ర మథనములోని ధన్వంతరి అమృతము, అప్సర గణములు, కౌస్తుభము, చింతామణీ, ఉచ్చైశ్రవము, ఐరావతము మొద. లగు శిల్పములతో రుద్రమయే గోచరించుచుండెను. శివుని ఏకాగ్రతకు భంగము కలుగగా అయన దృష్టి పార్వతిపై బడిన శిల్పముతో పార్వతికి బదులుగా రుద్రమయే గోచరించుచుండెను. తానే మన్మదుడును, రతీదేవి రుద్రమగా గోచరించుచుండెను. రామప్ప. రుద్రమకు కామదేవునివలె కనిపించి ఉక్కిరి బిక్కిరి చేసిన విషయము వర్ణించి చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చి మతిని చలింపజేసినది. తాను స్వయముగా మలచిన పార్వతి కళ్యాణ ఘట్టము, దశావతారములో గంగావతరణ శిల్పములు, శివపార్వతులు, భిల్లీ బిల్లులుగా, భిల్లుని ఎదుట సూకరణల ఆ బిల్లీలో రుద్రమ గోచరించుట, గంధర్వ, కిన్నెర, కింపురుష ప్రతిమలు తన్నుగాంచి ప్రేమ వ్యవహారములో విఫలమైనందుకు పరిహాసించునట్లుగా రామప్పకు కనిపించి మానసిక సంక్షోభముతో బాధపడసాగెను. అహోరాత్రములు ఆ శిల్పములోనే ముచ్చటించుచు గడ్డము పెరిగి అసహ్యముగా మారెను.

ఒకరోజు వర్షము కురియుచుండగా ఏవేవో మధుర స్మృతులు జ్ఞప్తికి వచ్చుటయు వెంటనే నగ్ననాగిని శిల్పము వద్దకేగి తలచుకుంటూ నిలబడి తదేక దృష్టితో జూచుచు వలవల కన్నీరు కార్చసాగెను. సుకుమారములైన చేతులతో బరువైన నాగుపామును ఎత్తినిలిచిన భంగిమ కాముని పున్నమిరాత్రి రుద్రమ కామముచేత ప్రేరేపింపబడి విలహావేదనను తట్టుకొనలేక రామప్ప కొరకు పరితపించుచు వచ్చి రామప్పను లేపి రతిక్రీడకు ఆహ్వానించిన ఆ భంగిమను, నాగిని శిల్పముతోగాంచి హృదయము ద్రవించిపోయెను.

ప్రముఖులెందరో వచ్చి భోజనము చేయవలసినదిగా వేడుకొనినను వారి మాటలు పెడచెవిన పెట్టి పలికెడివాడు కాడు.

ఒక్కొక్కసారి ఆలయ ప్రధాన మంటపములో కూర్చుండి పైకి



చూచుచు సంధాన శిలలనుగాంచి భద్రప్ప జ్ఞప్తికి వచ్చుటయు స్తంభ శిల్పము గాంచ కామారిష్టపతి, త్రిపురాది భట్టులు ఎదురుగా నిలుచున్నట్లుగాంచి బాధ పడుటయు కళావిలసితమైన ఈ రుద్రేశ్వరాలయము నిర్మించి దేశవిదేశాల ప్రముఖులచే ఓహోయని అనిపించుకొన్న మహాశిల్పి ఓడిపోవుట సహాయకులుగా పనిచేసిన తోటి శిల్పులు శిల్పములయందు ప్రత్యక్షమై అవమానించినట్లు సిగ్గు పడిపోయెను.

వసంతలక్ష్మిగా ప్రత్యక్షమైన రుద్రమ రూపమును శిల్పములలో గాంచుచు తను, రుద్రమ వాత్స్యాయన కామసూత్రముల శిల్పములకు కావలసిన

స్త్రీల మర్మములు, రహస్య సౌందర్య భాగములను గురించి చర్చించుకుంటుండగా రుద్రమ తటాలున సిగ్గుతో తలవంచిన సంఘటనలు జ్ఞప్తికి వచ్చి రామప్ప మతి చలించిపోయెను. ఒక్కసారిగా ఆలయములోని శిల్పములు నలుదిక్కులనుండి పరిహసించుచున్నట్లుగా ప్రతిధ్వనులు వినిపించినట్లు చెవులు కోసుకొని విని పించుట చూపరులకు బాధ పెట్టుచుండెను.

రామప్పకు కామ సూత్రములు. ఉపనిషత్సారమును బోధించి ఆలయ నిర్మాణములో అనే సలహాలనిచ్చి సహకరించిన షణ్ముఖస్థపతి రామప్ప వాలక మును గాంచి బాధపడసాగెను.

రామప్ప రుద్రమల ప్రేమబంధము, వారు వెన్నెల రాత్రులయందు, వనములందు సరోవరముల ప్రాంతములందు విహరించుచు కాలము గడిపిన విషయములు ఆ ప్రాంత ప్రజలకు తెలిసియే యుండెను. ఇది ఒక మహాశిల్పికి ఒక రాజకుమార్తెకు మధ్యగల విషయము కాబట్టి ఎవరికివారే ఈరహస్యమును బయటికి పొక్కకుండా లోలోపల కథలు కథలుగా వ్యాపించెను. రుద్రమ కామ విరుపులు, కన్నులతో రామప్పను కాటువేసి అతని అందాలను జుర్రుకొనిన రుద్రమ రామప్పను తప్పక పెండ్లియాడుదునని సూర్యచంద్రుల సాక్షిగా ప్ర మాణము చేసిన విషయము మరిచిపోయినట్లు తనను మోసము చేసినట్లు తలచుచు విలపించసాగెను. పెండ్లి దుస్తులలో కూడా రామప్పనే తలంచుచు అతనిని శృంగార శేష్టలను జ్ఞప్తికి తెచ్చుకొనుచు అతనితో గడిపిన మన్మధ రాత్రులు రుద్రమ మనస్సును కలవరపెట్టెను. రామప్పకు ద్రోహమే జరిగినదని విల పించెను. రుద్రమ, రామప్పలు ఈ విధముగా ఒక్కొక్కరే వారివారి మధురా నుభూతులను తలంచుకొంటు కుమిలిపోయిరి.

రామప్ప అదేపనిగా నిద్రాహారములు మాని పిచ్చివానివలె ఆలయమంతా తిరుగుచున్నాడని ఎవరినోటనో విని రుద్రమ స్తంభించిపోయెను. రుద్రమ రామప్పయొక్క మానసిన తత్వము తెలిసినది కాబట్టి రామప్ప ఏ అఘాయిత్యా

పొల్పడి ప్రాణ త్యాగం చేస్తాడేమోనని పరివిరివిధాలుగా రుద్రమ అంతఃపురము కలంచసాగెను. రామప్పకు క్షమాపణ చెప్పుకొని అతనిని ఏ విధముగానైనా దక్కించుకొనవలెనను తపన బయలుదేరెను. మహారాణి హోదాలున్న రుద్రమ ఎవరికి చెప్పక సైన్యాధిపతులకు తిరుగుబాటుదారులపై పురికొల్పి రాత్రికి రాత్రి రామప్పను చూచుటకు బలుదేరెను. ములుగులోనున్న కాటయభాండయలను కల్సుకొని రామప్ప పరిస్థితిని తెల్సుకొనెను. వారు రామప్ప ఆహారము మాని నేటికి ఏడవరోజు, కండ్లు లొట్టలుపోయినవి. ముఖము కళావిహీనమైనది. ఎక్కువకాలము బ్రతుకుట జరుగని పనియని సవినయముగా కాటయ, భాండ ములు తెలుపుకొనిరి.

ఆలస్యమైనచో ఏమగునోయని తలంచి సైన్యాధిపతులను వెంటపెట్టుకొని దేవాలయము వైపు బయలుదేరిరి. ఈమధ్య ఎవరో. రుద్రమదేవి నిన్ను చూచుటకు వచ్చుచున్నదని రామప్పకు తెలిపిరి. రుద్రమ దర్శనమునకు తహ తహలాడుచున్న రామప్ప ఓప్పు వహించలేక ఆలయ గోపురమెక్కి చూడ సాగెను. రాజబటులు కోటయ, భాండయలు వెంట వచ్చుచున్నట్లు గ్రహించెను. ఆమెపై కోపను, మమకారము పెచ్చుపెరిగి గాద్గద కంఠముతో మహారాణియను హోదాను కూడా మరచిపోయి రామప్ప ఏకాంతములో నున్నపుడు ప్రేమగా పిల్చెడువాడు "రుద్రా రుద్రా"యని ఎలుగెత్తి పిలువనారంభించెను. రుద్రమ ఆ మధురమైన కంఠస్వరమును ఆలకించి దేవాలయ ప్రాంగణములో ప్రవేశించెను ఇది గ్రహించి రామప్ప గుడిగోపురము దిగనారంభించెను. త్వరత్వరగా దిగు నప్పుడు గోపురపు ఇటుక విరిగి పట్టుతప్పి కాలుజారి గోపురము పైనుండి రుద్రా యని పెద్ద కేక వేయుచు క్రింద పడిపోయెను. రామప్ప రక్తపు మడుగులో ప్రాణములు బిగపట్టి రుద్రమ దర్శనమునకై ప్రాణము తల్లడించెను.

దేవాలయములో ప్రవేశించిన రుద్రమకు పిడుగు పడినట్లయ్యెను. పరుగు పరుగున రామప్ప పడియున్న స్థలమునకు వచ్చెను. రామప్ప పరిస్థితి చేయిజారి పోయియుండెను. రుద్రమ రామప్ప తలనిమిరి కనులనిండా నీరు నిలచెను.

రామప్పా అనివార్య కారణముల వలన నీకు తీరని ద్రోహమే జరిగినది. నీలాంటి మహాశిల్పిని దక్కించుకొనవలెనని వంటనే బయలుదేరి వచ్చితిని. మార్గమధ్యమున ఆలస్యమైనందున ఎంత దారుణము జరిగినది. దేవుడు నన్ను క్షమించడు. నీవైనా నన్ను క్షమించు రామప్పయని విలపించసాగెను తుది ఊపిరితో కొట్టు మిట్టాడుతూ కనులు తెరచి రుద్రమను ఒకసారి చూచెను. అపుడు రుద్రమ రామప్పతో. రామప్పా నీయొక్క త్యాగ శీలమునకు నీలాంటి నిష్కళంకమైన ప్రేమజీవికి నీలాంటి ఒక మహాశిల్పి పేరు తరతరాలు నిల్చు టకు రుద్రేశ్వరాలయముగా నిర్మాణమైన ఈ ఆలయమునకు ఇప్పటి నుండి రామప్ప పేరుతో రామప్ప దేవాలయముగా నామకరణము చేయుచున్నాను. ఈ చెఱువునకు రామప్ప చెఱువుయని పేరుపెట్టుచున్నాను. జావితరాలవారు నీ కళా చమత్కృతిని వేనోళ్ళ పొగడుతూ రామప్ప దేవాలయముగా నీపేరు ఆలయము లో నిలుచున్నట్లుగా ప్రచారము చేయించెదనని రామప్ప ముందు శపథము చేసెను. ఒక్కసారి రామప్ప కన్నులు రుద్రమ వైపు తిరిగి తుది ఊపిరి వది లెను. రామప్పకు నా అనువారు రుద్రమతప్ప వేరే ఆత్మీయులు లేరు, ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి ఈ కీకారణ్యముల మధ్యన తన విలువైన ప్రాణములు కోల్పోయినాడు.

రుద్రమ ఒక మహారాణి మహారాణి హోదాలో గాంభీర్యము వహించి కాటయ, ఖాండయలతో రామప్ప శవమును ప్రదక్షిణ మార్గమున నుంచవలసి నదిగా చెప్పెను. వెంటనే భటులు పోయి నూతన వస్త్రములు తెచ్చి రామప్పపై కప్పిరి.

రుద్రమ గర్భాలయమున ప్రవేశించి కడపపైన తల ఆనించి విలపించ సాగెను. భగవాన్! ఆమహాశిల్పిని చూచుకొను మహాభాగ్యమును కూడా లేకుండా చేశావా? నేనేమిపాపం చేసాను? ఇంత కఠినమైన విధించుట న్యాయమా? అనుచు వలవల ఏడ్వసాగెను.





ఆ ప్రాంత ప్రజలకు ఈ వార్త తెలిసి ఆబాలగోపాలము పనులు వదిలి అయ్యో ఎంతపని జరిగినది అని విలపించుచు జనం తండోపతండాలుగా ఆలయముతో గుమిగూడి విలపించసాగిరి. రామప్ప ఆత్మశాంతికై శివున్ని ప్రార్థించిరి

మధ్యాహ్నమైన తర్వాత రుద్రమదేవి స్వయముగా కాటయ ఖాండయుల సహాకారముతో రాజలాంఛనములతో అంత్యక్రియలు జరిపించెను.

రామప్ప కళాప్రతిభకు త్యాగ నిరతికి సకల శాస్త్ర పాండిత్యమునకు కాకతీయుల కళాప్రియత్వమును ప్రపంచమునకు చాటిన రామప్ప ఆత్మశాంతికి రుద్రేశ్వరాలయముగా వెలసిన ఈ దేవాలయమునకు "రామప్ప దేవాలము"గా ప్రచారములోనికి వచ్చినది.

ఆ తర్వాత కాటయ బొండయులచేత రుద్రమదేవి భంగిమలకు కోయ కన్యయని, నాగకన్యయని పేర్లు పెట్టి సంసార జీవితమునకు అంతరాయమేర్ప కుండా ప్రచారము గాంచిరి.

తరతరాలకు, యుగయుగాలకు రామప్ప పేరు నిత్యమై, సత్యమై శాశ్వతమై ఇప్పటికీ, మరెప్పటికీ ఆ శిల్పములయందు చిరంజీవియై దర్శనమిస్తూ ఉంటాడు. అమరశిల్పి రామప్ప.

* సమాప్తం *



# తప్పొప్పుల పట్టిక

| పేజీనెం. | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 4 | ద్విగ్ర్పాంతి | దిగ్భ్రాంతి |
| 5 | 4 | విజ్ఞాకము | విజ్ఞానము |
| 7 | 3 | బ్రాహీమహూర్తము | బ్రాహ్మీముహూర్తం |
| 8 | 1 | భార్గదేశము | భారతదేశము |
| 9 | 3 | కేక్షూర్చినందుకు | చేకూర్చినందుకు |
| 10 | 2 | పాంతందత | ప్రాంతమంత |
| 10 | 5 | రీతరు | రీడరు |
| 11 | 1 | విస్వంచి | విశ్వసించి |
| 11 | 2 | దివ్వ | దివ్య |
| 12 | 2 | గట్టము | ఘట్టము |
| 15 | 4 | వైష్టమతము | వైష్ణవమతము |
| 25 | 5 | ధర్మపారాయణులైన | ధర్మపారాయణులైన |
| 26 | 7 | దైవనముందు | దైవమునందు |
| 28 | 2 | పాశ్రిముతవ | ప్రాంతమున |
| 28 | 15 | దీక్షదృక్కులకు | దీక్షణదృక్కులకు |
| 29 | 13 | ప్రభావంతచే | ప్రభావం చేత |
| 30 | 5 | సద్ధులారగించి | చద్దులావగించి |
| 30 | 9 | శీలగా | లీలగా |
| 31 | 1 | రాజభావిలో | రాజధానిలో |
| 37 | 5 | మత్స్యనాలతో | మత్స్యముతో |
| 37 | 10 | దొరినందుకు | దొరికినందుకు |
| 39 | 5 | 54 దశములు | 54 రశములు |
| 40 | 4 | ఈవేరిగి శివతాండవ | ఈ పేరిణీ శివతాండవ |
| 40 | 7 | వేనులపై | ఏనుగులపై |
| 40 | 7 | సూదంచు | సూచించు |
| 40 | 9 | కాలకమైన | తెలికమైన |
| 45 | 19 | చేయడిన | చేయబడిన |
| 45 | 20 | విజ్ఞానముకు | విజ్ఞానమునకు |
| 52 | 6 | శయన | శైన |

| | | | |
|---|---|---|---|
| 52 | 23 | అకర్ృన | ఆకర్షన |
| 53 | 6 | అమరనాధ్ | అమరనాధ్ |
| 56 | 4 | బిందువులుగా | బిందువుగా |
| 85 | | రాఘప్ప | రామప్ప |
| 93 | 15 | స్కాందపురాణం | స్కందపురాణం |
| 95 | 5 | దమరుకము | ఢమరుకము |
| 101 | 4 | సముద్రమథతము | సముద్రమథనము |
| 102 | 22 | కాశీపతి | కాశీపతి |
| 104 | 13 | నిర్మాణమ్మ | నిర్మాణము |
| 106 | 23 | నిప్పుకుంట అర్థనగ్న | విప్పుకుంటు అర్థనగ్న |
| 110 | 3 | స్పర్శానుభూతికి | స్పర్శానుభూతి |
| 111 | 13 | శిల్పములమ | శిల్పములను |
| 115 | 7 | చిగుని | చూసి |
| 124 | 31 | ప్రవికొపంపబడి | పత్రికొపింపబడి |
| 125 | 14 | శిల్న | శిల్ప |
| 126 | 15 | తైలపర్ట | తైలవర్ణ |
| 138 | 2 | ఒప్పుచో | ఒప్పుచు |
| 142 | 9 | మీం | మిందు |
| 143 | 13 | అభరణములు | ఆభరణములు |
| 147 | 2 | ఏడమటి | పడమటి |
| 152 | 16 | విద్ధముగా | సిద్ధముగా |
| 152 | 22 | కల్యాన | కళ్యాణ |
| 153 | 6 | భద్రిశాళి | భద్రకాళి |
| 154 | 1 | మూసి | చూసి |
| 154 | 20 | విలహ వేదనము | విరహవేదనము |
| 154 | 21 | పచ్చి | పచ్చి |
| 155 | 2 | గ్రాంచ | గాంచి |
| 157 | 3 | తపన బయలుద్దేరెను | తపనతో బయలుదేరెను |
| 157 | 10 | సైన్యాదిపతులను | సైన్యాదిపతులను |
| 157 | 14 | కొటయ | కొటయ |
| 158 | 1 | రామప్పా | రామప్ప |
| 160 | 1 | రామప్స | రామప్ప |
| 161 | 3 | రామవ్చ | రామప్ప |